## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ధర్మపదం కథలు

యే ధర్మా హేతుప్రభవా హేతుం తేషాం తథాగతోహ్యవదత్
తేషాం చ యో నిరోధ ఏవంవాదీ మహాశ్రమణః

*Of all things that arise from cause, the Thathagatha has explained their causes and their cessations. Thus has the great Sramana taught*

**బోధచైతన్య**




**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ తుకారంగేట్, సికింద్రాబాద్ - 500 017,
ఫోన్ 0091-40-7732421, ఫ్యాక్స్ 0091-40-842477

నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స



ఈ గ్రంథ ప్రచురణకు తమ అమూల్య సహాయ, సహకారాలందించిన సహృదయులు ఎమ్ లక్ష్మీకర్ రెడ్డి, ఎస్ విష్ణువర్ధన్ రెడ్డి ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ, సర్వతోముఖ ప్రగతి సాధించాలని ఆకాంక్షిస్తున్నాము



# విషయానుక్రమణిక

# మున్నుడి

బుద్ధఘోషుని రచనగా విశ్వసింపబడుచున్న ధమ్మపద అట్ఠ (అర్థ) కథలో 305 కథలున్నాయి. వీటిని కుదించి Dhammapada Verses and Stories పేరుతో Central Institute of Tibetan Studies, Saranath, Varanasi సంస్థ ప్రచురించిన ఆంగ్లగ్రంథం ఈ రచనకు ఆధారం. 305 కథల నుండి 77 కథలను ఎంపిక చేసుకొని ఆయా కథల్లోని మౌలిక అంశాల్ని మాత్రమే రచనకు ఆధారంగా తీసుకొని కథాకథనంలో స్వేచ్ఛను ఈ రచయిత పాటించాడు. ఈ 77 కథలు ఒక కథ ఉన్నట్లుగా మరొకటి ఉండదు. దేనికది విలక్షణంగా ఉంటుంది బ్రహ్మచారులు, సన్న్యాసులు, ఇంకా ఇతర పూర్తి స్థాయి అధ్యాత్మ సాధకులు ఆత్మపరిశీలన చేసుకోవడానికి ఈ కథలు అద్దంలా ఉపయోగపడుతాయి వివిధ అధ్యాత్మ సంస్థల్లో సుమారు 25 ఏండ్లుగా ఈ రచయితకు ఉన్న అనుభవం కూడా ఈ రచనకు తోడ్పడింది.

ప్రతి కథలోనూ బుద్ధభగవానుని ప్రవేశం ఉంటుంది శ్లోకాలన్నీ ఆయన వాక్యాలే కనుక ఆయన ప్రవేశం తప్పనిసరికదా! అక్కడక్కడా కథల్లో బుద్ధభగవానుని జీవిత సంఘటనలు ముఖ్యమైనవి కూడా కొన్ని చోటు చేసుకొన్నాయి

ప్రతి కథ చివర వచ్చే శ్లోకమే కథకు ప్రధానాంగం తెలుగు పాఠకులకు పాళీ భాష పరిచితం కాదు కనుక సంస్కృత ధర్మపదం నుండి శ్లోకాలను తీసుకొని ఆ శ్లోకాలకు సరళంగా తాత్పర్యం ఇవ్వడం జరిగింది

---

* *బుద్ధుని ఉపదేశాలకు ధమ్మ (ధర్మ) అని పేరు (ధమ్మ = sayings or teachings of Buddha) పదం అంటే భాగమని ఒక అర్థం (పదం = section or part or portion). సూత్రపిటకం చివరి నికాయంలోని 15 భాగాల్లో ధర్మపదం ఒకటి ఇందులో, 26 వర్గాలుగా వర్గీకరించబడి మొత్తం 423 శ్లోకాలున్నాయి*

# చక్షుపాలుడు

శ్రావస్తిలోని జేతవన విహారంలో ఒక సమయంలో బుద్ధభగవానుడు విడిది చేసియుండగా ఆయనకు నమస్కరించడానికి ఒక బౌద్ధభిక్షువు సుదూరంలోని ఒక విహారం నుండి అక్కడికి వచ్చాడు ఆయన పేరు చక్షుపాలుడు ఒక రాత్రి ఆయన ధ్యాననిమగ్నచిత్తుడై తన కుటీరం ముందు ఇటు అటు పచార్లు చేస్తుండగా ఆయన పాదాల క్రింద కొన్ని కీటకాలు నలిగి చచ్చిపోయాయి మరునాడు ప్రొద్దున తక్కిన భిక్షువులు ఆ చచ్చి పడియున్న కీటకాలను చూచి వాటి చావుకు చక్షుపాలుడే కారణమని భావించి ఆయన్ను ఏవగించుకొన్నారు అంతటితో ఊరుకొని యుండక ఆ సంగతిని బుద్ధునికి నివేదించారు

"చక్షుపాలుడు కీటకాలను చంపుతుండగా మీరు చూచారా?" అని బుద్ధుడు వారిని ప్రశ్నించాడు చూడలేదని వారు సమాధానమిచ్చారు "అతని కాలిక్రింద అవి నలిగి చావడం మీరెలా చూడలేదో అతను కూడ అలాగే చూడలేదు అంతేగాదు అతను అర్హతుడు (ముక్తపురుషుడు) కనుక అతనికి వాటిని చంపాలనే ఉద్దేశం కలిగే అవకాశం బొత్తిగా లేదు కనుక అతను నిర్దోషి" అన్నాడు చక్షుపాలుడు అర్హతుడైయుండీ గ్రుడ్డివాడుగా ఉండిపోవడానికి కారణమేమిటని భిక్షువులు బుద్ధుణ్ణి ప్రశ్నించారు దానికి సమాధానంగా సర్వజ్ఞుడైన బుద్ధుడు క్రింది వృత్తాంతాన్ని చెప్పాడు

"ఒకానొక పూర్వ జన్మలో చక్షుపాలుడు నేత్ర వైద్యుడుగా ఉంటూ ఉద్దేశ

పూర్వకంగా ఒక స్త్రీకి అంధత్వాన్ని కలిగించాడు ఆ స్త్రీ చికిత్స కోరుతూ తన కన్నులు బాగైతే తానూ తన పిల్లలూ యావజ్జీవం అతని సేవకులుగా ఉంటామని వాగ్దానం చేసింది చికిత్స వల్ల ఆమె కన్నులు నయమయ్యాయి కానీ ఇక బానిసత్వంలోకి చొరబడవలసివస్తుందనే భయం చేత ఆమె వైద్యునితో తన కన్నులు నయం కావడానికి బదులు మరింత అధ్వానంగా తయారయ్యాయని అబద్ధం చెప్పింది ఆమె అబద్ధం చెబుతున్నదనే సంగతిని కంటి వైద్యుడు పసిగట్టి ఆగ్రహంతో ఆమెకు వేరే మందు ఇచ్చాడు దాని ప్రభావంతో ఆమె పూర్తిగా గ్రుడ్డిదైపోయింది ఆ పాపఫలంగా అతను తరువాతి జన్మల్లో చాలసార్లు చూపులు లేనివాడుగానే ఉండిపోయాడు ఈ చివరి జన్మలో కూడ ఆ పాపఫలం వెన్నంటి వచ్చింది" ఈ పూర్వజన్మ వృత్తాంతాన్ని వినిపించి బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు

**మన: పూర్వంగమా ధర్మా మన: శ్రేష్ఠా మనోమయా**
**మనసా చేత్ప్రదుష్టేన భాషతే వా కరోతి వా**
**తత ఏనం దు:ఖమన్వేతి చక్రమివ వహత: పదం 1-1**

వేదనలకు (feelings) సంజ్ఞలకు (perceptions), సంస్కారాలకు (mental formations) మనస్సు అగ్రగామిగా ఉంటూ ముఖ్యత్వాన్ని కలిగియున్నది (మనస్సు అంటే ఎఱుక, విజ్ఞానం = consciousness అని అర్థం) అట్టి మనస్సును మలినం చేసుకొని ఎవడైనా మాట్లాడినా, పనులు చేసినా అతనికి దు:ఖాలు తప్పవు. అతను ఎక్కడికి పోయినా అవి అతని వెన్నంటి వస్తాయి - బండిని లాగే ఎద్దుల పాదాలను అనుసరించి బండి చక్రాలు కదిలినట్లు

# కోశాంబి భిక్షువులు

ఒక వర్ష రుతువులో బుద్ధుడు కోశాంబి విహారంలో ఉండదలచాడు ఆ విహారంలోని భిక్షువుల మధ్య సిద్ధాంతపరమైన స్పర్ధలున్నాయి * కొందరు 75 ధర్మాలను (elements of existence) ప్రతిపాదిస్తే మరికొందరు ఆ పట్టికలో చాలా వాటిని వట్టి వికల్పాలుగా (mental fabrications) కొట్టివేసి ఉన్నవి 43 ధర్మాలే అని వాదం చేసేవాళ్ళు. నిర్వాణం భావరూపమని ఒక వర్గం వాదిస్తే అది అభావరూపమని మరొక వర్గం ప్రతివాదం చేసేది. ఇలా చాలా విషయాల్లో సిద్ధాంత భేదాలు పెట్టుకొని ఎడతెగని చర్చలతో వాదోపవాదాలతో స్పర్ధలు పెంచుకొంటూ ఉండేవారు ఇరువర్గాలవాళ్ళూ బుద్ధుడి ఉపదేశాలనే ప్రమాణంగా చూపేవారు తథాగతులవారి అభిప్రాయం సరిగా తెలుసుకొన్నవాళ్ళమని ఎవరికి వారు భావించుకొనేవారు

వీరి పోకడలను బుద్ధుడు గమనించి వాక్కలహాలు మాని సంసార బంధాలను త్రెంచుకొని దుఃఖం నుండి బైటపడే ప్రయత్నంలో మనస్సును పెట్టండని హితం చెప్పాడు అయినా వాళ్ళ ధోరణిలో ఆశించినంత మార్పు రాలేదు బుద్ధుడు మౌనంగా ఆ చోటు వదలిపెట్టి అరణ్యంలోని రక్షితవనానికి వర్ష రుతువు గడపడానికి వెళ్ళిపోయాడు

---

* సత్కాయదృష్టిని (*false view of self*) నిర్మూలించడానికి బుద్ధుడు విశ్లేషణ పద్ధతిలో బోధనలు చేశాడు. ఆ బోధనల్లో స్కంధాలు, ధాతువులు, ఆయతనాలు, ఇలా అనేక పదాలు చోటు చేసుకొన్నాయి ఇదంతా ధ్యానానికి విషయంగా ఉపయోగించేగానీ విజ్ఞానశాస్త్రాభివృద్ధికిగానీ సిద్ధాంతాల నిర్మాణానికి గానీ కాదు కనుక బుద్ధుని బోధనల్లో సైన్సును చూడడం, సిద్ధాంతాలను చూడడం వట్టి అవివేకం ఎంత సైన్సు, ఎన్ని సిద్ధాంతాలున్నా మనిషి చాలా అనారోగ్యంగానే ఉన్నాడు మనిషి మనసుకు ఆరోగ్యాన్ని చేకూర్చే సరియైన ఉపాయాలే బుద్ధుని బోధనలు సిద్ధాంత సికతాభవనాల నిర్మాణానికి అవి ఉద్దేశించబడలేదు

బుద్ధుడు కోశాంబిని వదలిపెట్టి వెళ్ళిపోవడానికి కారణం భిక్షువుల మధ్య సిద్ధాంతపరమైన తగాదాలే అని తెలుసుకొన్న పౌరులు ఆ భిక్షువులకు ఆదరణ చూపడం, గౌరవించడం మానివేశారు వాళ్ళను వెలివేసినంత పని చేశారు. ఈ పరిణామాలకు భీతిల్లి ఆ భిక్షువులందరూ ఆనందుణ్ణి ఆశ్రయించారు వర్ష రుతువు అయ్యాక బుద్ధుడు జేతవనం చేరినప్పుడు ఆనందుడు ఆ భిక్షువులనందరినీ బుద్ధుని ముందుకు తీసుకుపోయాడు భిక్షువులు బుద్ధుని పాదపద్మాలకు ప్రణమిల్లి తాము ఇక మీదట వాదోపవాదాలు కట్టిపెట్టి సంసార బంధనాలు 'త్రెంచుకొనే ప్రయత్నంలోనే ఉంటామని ప్రతిజ్ఞ చేశారు అప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని వారికి వినిపించాడు.

*పరే చ న విజానంతి వయమత్ర యంస్యామ:*
*యే చ తత్ర విజానంతి తత: శామ్యంతి మేధగా:* 1-6

"తాము ఎప్పటికైనా మరణించవలసినవారమే" అనే వాస్తవాన్ని ప్రాజ్ఞులు కానివారు గుర్తించలేరు "మరణం తప్పదు" అనే అవగాహన లేకపోవడం వల్ల వారు అనవసర విషయాల్లోకి దిగి ఘర్షణ పడుతుంటారు "జాతస్య హి ధ్రువో మృత్యు:" అన్న సత్యాన్ని గుర్తించి దాన్ని సదా మననం చేసుకొనే ప్రాజ్ఞులు ఘర్షణలకు దూరమై ఉపశమనసంపన్నులౌతారు

# మహాకాలుడు

శ్వేతభ్య నగర పరిసరాల్లో బుద్ధభగవానుడు ధర్మోపన్యాసాలు చేస్తుండగా ఆయన బోధనలచే మిక్కిలి ప్రభావితుడై మహాకాలుడనే వర్తకుడు బుద్ధుని ఆశ్రయించి సన్న్యాసం తీసుకొన్నాడు ఇది అతని సోదరుడు చూలకాలునికి నచ్చలేదు. తమ్ముణ్ణి తిరిగి మామూలు మనిషిగా చేయాలనుకొన్నాడు. అది నెరవేరాలంటే తాను కూడ అతనితోనే ఉండాలి కనుక తాను కూడ సన్న్యాసం తీసుకున్నాడు వీరిద్దరూ ఈ వరకే వివాహితులు

పరమ వైరాగ్యంతో మహాకాలుడు సన్న్యాస నియమాలను చక్కగా పాటిస్తూ బుద్ధుడు చెప్పిన అనిత్యచింతన మొదలగు సాధనల్లో చిత్తాన్ని నిలిపి అచిరకాలంలోనే అర్హత్వాన్ని పొందగలిగాడు

కొంతకాలం పిమ్మట బుద్ధుడు తన ధర్మచక్ర ప్రవర్తన కార్యక్రమంలో భాగంగా మళ్ళీ శ్వేతభ్య నగర పరిసరాలకు విజయం చేశాడు అప్పుడు చూలకాలుని భార్యకు ఒక ఉపాయం తట్టింది బుద్ధుణ్ణి శిష్య సమేతంగా భిక్షకు ఆహ్వానించింది. ఆ ఆహ్వానాన్ని బుద్ధుడు అంగీకరించాడు భిక్ష ఏర్పాట్లు చేయడం తనకు కొత్త గనుక బౌద్ధ భిక్షువుగా ఉంటున్న తన భర్త చూలకాలుని సహాయాన్ని కోరింది చూలకాలుడు సమ్మతించి ఆ ఏర్పాట్ల విషయంలో సహాయమందించడానికి ఆమెతో వెళ్ళాడు

భిక్షకు వచ్చిన సాధువులు వెళ్ళిపోయాక చేయవలసిన కార్యక్రమం ఒకటుంది దాన్ని అనుమోదనం అంటారు దాన్ని చూలకాలునికి అప్పగించి బుద్ధుడు వెళ్ళిపోయేలా ఆమె జాగ్రత్తలు తీసుకుంది. గౌతమ బుద్ధుడు తన శిష్యులతో

కలిసి వెళ్ళిపోయాక ఆమె చూలకాలుని పసుపు బట్టలను లాగివేసి మామూలు బట్టలను తొడిగించింది. ఇక అతను ఇంటిపట్టునే ఉండిపోయేలా చేసుకొన్నది.

ఈమె సాధించిన విజయం తను కూడ సాధించాలనుకొని మహాకాలుని భార్య మరొక రోజున తనవంతుగా బుద్ధుణ్ణి భిక్షకు ఆహ్వానించింది మహాకాలుడు తాను ముందుగా రావలసిన అవసరం లేదనీ అనుమోదన కార్యక్రమం కావలస్తే చేస్తాననీ ఆమెకు చెప్పాడు.

భిక్ష అయ్యాక శిష్య సమేతంగా బుద్ధుడు తాను విడిది చేసిన విహారానికి చేరుకున్నాడు. తథాగతులవారు మహాకాలుణ్ణి అనుమోదన కార్యక్రమ నిర్వహణకై అక్కడ వదలిరావడం తమకు రుచించలేదని బౌద్ధభిక్షువులన్నారు. ఇలా చేసినందువల్ల ఇంతకు పూర్వం చూలకాలుడు మనకు కాకుండా పోయాడు ఇప్పుడు మహాకాలుణ్ణి కూడ కోల్పోబోతున్నామని బౌద్ధభిక్షువులన్నారు బుద్ధుడు సమాధానంగా "అలా ఎన్నటికీ జరుగదు. ఇద్దరు సోదరులు ఒకే స్వభావం కలవారు కాదు చూలకాలుడు విషయలోలుడు, ఇంద్రియ నిగ్రహం లేనివాడు, సోమరి. అతణ్ణి కోల్పోవడం వల్ల భిక్షు సంఘానికి వచ్చిన నష్టం లేదు. మహాకాలుడు దృఢచిత్తుడు, అధ్యాత్మిక బలసంపన్నుడు, శ్రద్ధావంతుడు అతని విషయంలో మీరు బెంగపడవద్దు" అని క్రింది రెండు శ్లోకాలను పఠించాడు

**శుభమనుపశ్యంతం విహరంతం ఇంద్రియేషు అసంవృతమ్**
**భోజనే అమాత్రజ్ఞం కుసీదం హీనవీర్యం**
**తం వై ప్రసహతి మారో, వాతో వృక్షమివ దుర్బలమ్** 1-7

విషయ ప్రీతి కలిగియుండి వాటియందు శుచిచింతన చేయువానిని, ఇంద్రియనిగ్రహం లేనివానిని, అతిభోజనుని, సోమరిని, శక్తిహీనుని మారుడు (రాగ ద్వేష మోహాలు) సులభంగా జయించివేయును. దుర్బల వృక్షాన్ని పెనుగాలి తేలికగా పెకలించివేయునుగదా!

**అశుభమనుపశ్యంతం విహరంతం ఇంద్రియేషు సుసంవృతమ్**
**భోజనే చ మాత్రజ్ఞం శ్రద్ధం ఆరబ్ధవీర్యమ్**
**తం వై న ప్రసహతే మారో వాత: శైలమివ పర్వతమ్.** **1-8**

దేహములందున్న అశుచిత్వాన్ని భావన చేస్తూ వైరాగ్యాన్ని పెంచుకొంటున్న వానిని, ఇంద్రియములను చక్కగా అదుపులో పెట్టుకొన్నవానిని, శ్రద్ధావీర్యములు (ఉత్సాహం) కలవానిని, మారుడు కదిలించలేడు ఎంత పెద్దగాలి వచ్చినా పర్వతము కదులునా?

శ్లోక పఠనం పూర్తయ్యే సమయానికి మహాకాలుడు అక్కడికి వచ్చి చేరాడు



# శారిపుత్రుడు

ఉపతిస్స, కొలిత అనేవి ప్రక్క ప్రక్క గ్రామాలు ఆ గ్రామాల పరిసరాల్లో ఒక ఇంద్రజాల ప్రదర్శన జరిగింది. ఉపతిస్స నుండి శారిపుత్రుడు, కొలితనుండి మౌద్గల్యాయనుడు ఆ ప్రదర్శనను చూడడానికి వెళ్ళారు వారిద్దరూ స్నేహితులు ఆ ప్రదర్శన చూశాక ఈ ప్రపంచం కూడా ఇంద్రజాలం లాంటిదే అనే భావన వాళ్లిద్దరూ కలిగించుకొన్నారు ముక్తిమార్గాన్వేషణ చేయాలని సంకల్పించారు

అప్పుడు చాలా ప్రసిద్ధుడుగా రాజగృహ నగరానికి చెందిన సంజయుడనే పరివ్రాజకుడుండేవాడు ఆ ఇద్దరు యువకులు ఆయన దగ్గరకు వెళ్ళారు ఆయన బోధించిన అజ్ఞేయవాదం (agnosticism) వీళ్ళకు రుచించలేదు ఆయన్ను వదలిపెట్టి భరతఖండమంతా సంచారం చేశారు. సరైన మార్గం బోధించేవాళ్ళు గోచరించలేదు. ఇక ఇద్దరూ వేరు వేరు దిక్కుల్లో అన్వేషణ సాగించాలనే నిశ్చయానికి వచ్చి ఒక ఒప్పందాన్ని కుదుర్చుకొన్నారు - ఎవడు ముందు సరైన మార్గాన్ని తెలుసుకుంటాడో అతడు మరొకతనికి వెంటనే దాన్ని తెలుపవలెనని.

ఆ పిమ్మట ఒకనాడు శారిపుత్రుడు అశ్వజిత్ అనే బౌద్ధభిక్షువును కలిశాడు ఆయన ఈ యువకుని తీవ్రముముక్షుత్వానికి ముగ్ధుడై తాను బుద్ధదేవుని చరణ సన్నిధిలో విన్న ముక్తిధర్మాన్నంతా తెలియజెప్పి **"యే ధర్మా హేతుప్రభవా హేతుం తేషాం తథాగతోహ్యావదత్. తేషాం చ యే నిరోధ, ఏవం వాదీ మహాశ్రమణః"** అని ముగించాడు.

ఆ దివ్యబోధ విని శారిపుత్రుడు ఉప్పొంగిపోయాడు. ముక్తిమార్గం గోచరించింది మిత్రునికి తానిచ్చిన మాటను గుర్తుకు తెచ్చుకొని అతణ్ణి వెదకి పట్టుకొని తాను విన్న ముక్తిమార్గాన్ని వినిపించాడు మౌద్గల్యాయనుడు కూడా ఆ ధర్మాన్ని విని పరమ సంతోషాన్ని పొందాడు ఆ పిమ్మట ఇద్దరూ తమ ప్రధమ

గురువును జ్ఞప్తికి దెచ్చుకొని ఆయన దగ్గరకు వెళ్ళి ఇలా అన్నారు : "జరామరణయోగం నుండి బైటపడే మార్గాన్ని బోధించే గురువును మేము కనుక్కొన్నాము. బుద్ధుడు భువియందు అవతరించియున్నాడు ధర్మం అవతరించియున్నది. సంఘం అవతరించియున్నది. రండి మనమందరము ఆ జగద్గురువును ఆశ్రయించుదాము"

సంజయుడు అంగీకరించలేదు "వేలకొలది మందికి గురువుగా వున్న నేను మరొకరికి శిష్యుడు కావడమంటే ఒక పెద్ద కుండ తటాలున చిట్టిముంతగా మారిపోవడంలా వుంటుంది అంతేకాదు, ఈ లోకంలో వివేకులు చాలా కొద్దిమందే వున్నారు. ఎక్కువ శాతం వున్నది మూర్ఖులే. ఆ కొద్దిమంది వివేకులు బుద్ధుని దగ్గరకే వెళతారు వెళ్ళనీ మిగిలిన మూర్ఖజనాలు కోకొల్లలు శిష్యులుగా నా దగ్గర చేరుతారు మీ దారిన మీరెళ్ళండి. నన్ను ఇలాగే వుండనీయండి" అని కొంత వెటకార ధోరణిలో అన్నాడు సంజయుడు.

ఆ పిమ్మట ఆ ఇద్దరు స్నేహితులు బుద్ధుని చరణకమలాలను ఆశ్రయించారు. అది జరిగిన ఏడవనాటికే మౌద్గల్యాయనుడు అర్హత్వాన్ని పొందాడు. మరో ఏడు రోజులకు శారిపుత్రుడు కూడా అర్హత్వాన్ని పొందాడు ఈ ఇద్దరు శిష్యరత్నాలను బుద్ధుడు తన ప్రధాన శిష్యులుగా (అగ్రశ్రావకులుగా) నియమించాడు. ఒకప్పుడు వీరిద్దరి ప్రస్తావనతోబాటు సంజయుని ప్రస్తావన కూడా వచ్చినప్పుడు బుద్ధుడిలా అన్నాడు "సంజయునిలో మిధ్యాగర్వం చోటు చేసుకోవడం వల్ల సత్యాన్ని సత్యంగా తెలుసుకోలేకపోతున్నాడు. అసత్యాన్ని సత్యంగా తెలుసుకొంటున్నాడు. ఈ స్థితిలోనే కొనసాగినంతకాలం అతను పరమార్థాన్ని గ్రహించలేడు" ముగింపుగా క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు

**అసారే సారమతయః సారే చాసారదర్శినః**
**తే సారం నాధిగచ్ఛంతి మిథ్యాసంకల్పగోచరాః** **1-11**

**సారం చ సారతో జ్ఞాత్వా అసారం చ అసారతః**
**తే సారం అధిగచ్ఛంతి సమ్యక్ సంకల్పగోచరాః** **1-12**

# నందుడు

ఒకప్పుడు బుద్ధభగవానుడు రాజగృహ నగర సమీపంలోని వేణువనంలో విడిది చేశాడు ఆ వార్త కపిలవస్తు నగరంలోని శుద్ధోధనుడికి తెలిసింది తన కుమారుడు రాజప్రాసాదం వదలి వెళ్ళాక మళ్ళీ ఈ ఛాయలకు రాలేదు బుద్ధుని బోధనలు వినే యోగ్యత కపిలవస్తు ప్రజలకు లేదనే అపవాదు తలెత్తకముందే ఎలాగైనా బుద్ధుణ్ణి తన నగరానికి రప్పించదలచాడు దూతల మీద దూతలను వేణువనానికి పంపాడు బుద్ధుడు అంగీకరించి భిక్షు సమూహంతో కపిలవస్తు నగరం చేరాడు

తన దివ్యమైన ఆధ్యాత్మ బోధనలతో కపిలవస్తు పౌరులను పరవశులను చేస్తూ కొన్ని రోజులు గడిపాడు ఒకనాడు ఆ నగరంలో భిక్షాటన చేస్తూ రాజప్రాసాదం వైపుగా వెళ్ళాడు అక్కడ తన పినతల్లి కుమారుడు నందుడు బుద్ధదేవుని పాదపద్మాలకు ప్రణమిల్లి చేతులు జోడించి నిలుచున్నాడు. బుద్ధుడు అతనికి తన భిక్షాపాత్రను అందించి మౌనంగా నడక మొదలుపెట్టాడు నందుడు ఆయన్ను అనుసరించాడు. ఈ సంకేతాన్ని నందుని భార్య జనపదకల్యాణి వెంటనే పసిగట్టింది. తన భర్త భిక్షువు కాబోతున్నాడని గ్రహించింది ఆమె వేగంగా నందుని సమీపించి "మీ దారికి నేను అడ్డు రాను. కానీ నాదొక మాట భిక్షువుగా జీవించడం మీకు ఏ క్షణంలో అయిష్టంగా మారుతుందో ఆ క్షణమే ఏ తటపటాయింపుకు తావివ్వకుండా నా దగ్గరకు వచ్చేయండి" అన్నది ఈ మాటలు నందుని చెవిలో పడ్డాయి. కానీ తిరిగి చూడలేదు మౌనంగా బుద్ధుని వెంటే వెళ్ళిపోయాడు

ఆ పిమ్మట బుద్ధుడు శ్రావస్తికి బయలుదేరాడు ఆ నగర సమీపంలోని జేతవనంలో అనాథపిండకుడు నిర్మించిన విహారంలో విడిది చేశాడు క్రొత్తగా భిక్షువు అయిన నందుని మానసిక పరిస్థితి అక్కడ అంత ఆశాజనకంగా ఉండడం లేదు ఆకస్మిక సన్యాసంలోని కష్టాలన్నీ అతనికి ఎదురవుతున్నాయి. భిక్షాన్నం రుచించడం లేదు స్థండిలశాయిత్వం (కటిక నేలపై పరుండడం) శరీరానికి సుఖాన్నివ్వడం లేదు నృత్యగాన వినోదాలు మనస్సును ఉల్లాసపరచినట్లుగా ధర్మబోధనలు ఉల్లాసపరచడం లేదు. ధ్యానం కోసం కన్నులు మూసుకొంటే తాను ముద్దుగా సుందరీ అని పిలిచే జనపదకల్యాణి రూపమే గోచరిస్తున్నది తన నిద్రాసమయకలవరింతల్లో "సుందరీ" అనే పిలుపు సమీప భిక్షువుల చెవుల్లో పడి వారి అపహాస్యాలకు గురికావడం కూడా జరిగింది "ఇష్టం లేని క్షణమే నా దగ్గరకు వచ్చేయండి" అన్న జనపదకల్యాణి తియ్యని మాటలు చెవుల్లో మారుమ్రోగుతూనే ఉన్నాయి

భవరోగవైద్యరాజైన బుద్ధునికి అతని మానసికస్థితి తెలిసింది. చికిత్సకు ఇక ఆలస్యం చేయరాదనుకొన్నాడు. తన యోగమహిమచే నందునికి దేవలోకదృశ్యం కనిపింపజేశాడు అక్కడ ఇంద్రసభలో అప్సరసల నాట్యం జరుగుతున్నది నందుడు ఆ అప్సరసలను, వారి నాట్యభంగిమలను పరమాశ్చర్యంతో తిలకించాడు నందునికి మళ్ళీ ఈ లోక స్పృహ కలిగించి బుద్ధుడు ఇలా అన్నాడు · "నందా, అప్సరసల కన్నా నీ సుందరి అందంగా ఉందా?" సమాధానంగా నందుడు, "వారితో పోల్చితే నా సుందరి, చెవులు ముక్కు తెగిన ఆడకోతికన్నా హీనంగా ఉందని చెప్పాల్సి ఉంటుంది" అన్నాడు "ఆ అప్సరసలు నీకు కావాలనుకొంటే నేను చెప్పిన సాధనలు తప్ప వేరే మార్గం లేదు ఆ సాధనలు సాధకుని చిత్తవిశేషాన్ని బట్టి నిర్వాణ సుఖాన్నిగానీ స్వర్గసుఖాలనుగానీ సంపాదించి పెట్టాయి" అన్నాడు బుద్ధుడు

సాధనల వల్ల చేకూరే ఫలమేమిటో స్పష్టంగా తెలిసింది కనుక నందునికి సాధనల విషయంలో భలే ఉత్సాహం కలిగింది ఇక అప్పటి నుండి తీవ్ర

సాధకుడైపోయాడు. ఆ సాధనల మహిమ ఏమిటోగానీ చేస్తున్నకొద్దీ అతనిలో విరాగం ఎక్కువ ఏర్పడసాగింది. హృదయం కరుణకు నిలయం కాసాగింది క్రమంగా చిత్తంలో శమథము (tranquility), విపశ్యన (insight) చోటు చేసుకొన్నాయి. అప్సరసల మీదేమిటి బ్రహ్మపదవి మీద కూడ అతనికి తూష్ణీంభావం వచ్చేసింది నందుని ఆధ్యాత్మిక శిఖరారోహణం గమనించింది బుద్ధుడొక్కడే అక్కడున్న ఇతర భిక్షువులకు నందుని కలవరింతలే ఇంకా జ్ఞాపకం ఉన్నాయి. ఆ జ్ఞాపకాలతోనే వాళ్ళు నందుని అంచనా వేసుకొంటున్నారు. "నందా, నీ సాధనలు ఎలా సాగుతున్నాయి?" అని ఒకనాడు వారు అతణ్ణి అడిగారు. "తథాగతులవారి అనుగ్రహం వల్ల సాధించవలసినది సాధించి కృతకృత్యుడనైనాను" అన్నాడు నందుడు. "ఇతను డాంబికం మాటలు కూడా నేర్చాడే!" అని వారు మళ్ళీ అతని విషయంలో తప్పుడు అంచనా వేసుకొని బుద్ధుని దగ్గరకు వెళ్ళి నందునిపై తమకున్న అభిప్రాయాన్ని బైట పెట్టారు సుగతుడు ప్రసన్న గంభీరంగా "నిజమే ఒకప్పుడు నందుడు కంతలతో నిండిన పైకప్పుగల కుటీరంలాగా వుండినాడు ఇప్పుడతడు కంతలు లేని చక్కని పైకప్పు గల కుటీరంలాంటివాడైనాడు" అని ఆ సందర్భానికి తగినట్లుగా క్రింది రెండు శ్లోకాలను పఠించాడు.

**యథాగారం దుశ్ఛన్నం వృష్టిః సమతివిధ్యతి**
**ఏవం అభావితం చిత్తం రాగః సమతివిధ్యతి** **1-13**

పైకప్పు సరిగా లేని ఇంటిలోకి వర్షం నీరు ప్రవేశించునట్లుగా శమథమును, విపశ్యనను భావన చేయని చిత్తం లోనికి రాగం ప్రవేశిస్తుంది

**యథాగారం సుచ్ఛన్నం వృష్టిర్న సమతివిధ్యతి**
**ఏవం సుభావితం చిత్తం రాగో న సమతివిధ్యతి** **1-14**

పైకప్పు సరిగా ఉన్న ఇంటిలోకి వర్షం నీరు ప్రవేశింప వీలుకానట్లుగా శమథమును, విపశ్యనను భావన చేసిన చిత్తం లోనికి రాగం ప్రవేశింపజాలదు

# ఇద్దరు మిత్రులు

శ్రావస్తిలోని ఉన్నత కుటుంబాలకు చెందిన ఇద్దరు యువకులు మంచి మిత్రులు వాళ్ళిద్దరూ ఒకనాడు గౌతమబుద్ధుని ప్రబోధాలకు పరవశులై ఆయన సంఘంలో చేరిపోయారు వారిద్దరిలో ఒకనికి పాండిత్యం మీదెక్కువ దృష్టి అతను అదే పనిగా గ్రంధాలను పఠిస్తూ కొన్నేండ్లకు గొప్ప పండితుడైపోయాడు. విడిగా ఒక ఆశ్రమాన్ని నెలకొల్పుకొని 18 శాఖలకు చెందిన సుమారు 500 మంది భిక్షువులకు అధ్యాపకుడుగా వుంటూ గొప్ప పేరు తెచ్చుకొంటున్నాడు.

మరొకనికి పాండిత్యం మీద అంత రుచి లేదు. అధ్యాత్మ జీవనానికి పనికివచ్చే కొన్ని సూత్రాలు మాత్రం చదువుకొని ఎక్కువ కాలాన్ని విపశ్యన (insight) సాధనకు వినియోగిస్తూ కొంతకాలానికి అర్హత్వాన్ని పొందగలిగాడు విడిగా ఆశ్రమం పెట్టుకోకుండా అతను బుద్ధుని వెంటే వుండేవాడు.

ఇలా సంవత్సరాలు గడిచాయి జేతవనానికి బుద్ధుడు విజయం చేసిన వార్త పండిత భిక్షువుకు చేరింది. బుద్ధదేవుని దర్శనభాగ్యం కోసం అతను వేగిరంగా అక్కడికి వచ్చాడు. చిరకాలానికి తన మిత్రుణ్ణి కూడా చూడడం అతనికి ఆనందం వేసింది. తన మిత్రుడు అర్హత్వాన్ని పొందిన వ్యక్తి అని మాత్రం గుర్తించలేదు చదువంటే గిట్టని సోమరి అని భావించి అతణ్ణి ఆట పట్టించాలనుకొన్నాడు. 'ఇతను ఐదు నికాయాల్లో ఒక్కటి కూడా చదువుకోలేదు. మూడు పిటకాల్లో ఒక్క పిటకాన్ని కూడ అధ్యయనం చేయలేదు ఈ సాయంత్రం ఇతణ్ణి నికాయాలకు, పిటకాలకు సంబంధించిన ప్రశ్నలు అనేకం వేసి చీకాకు పెట్టి

వేడుక పొందుతాను' అని మనస్సులో అనుకున్నాడు

అభిజ్ఞుడైన (అతీంద్రియశక్తులు కలిగినవాడు) బుద్ధునికి అతని ఆలోచన తెలిసిపోయింది ప్రశ్నల తంతును నివారించాలనుకొన్నాడు. ఒక అర్హతుణ్ణి ఆట పట్టించే దోషం నుండి ఆ పండిత భిక్షువును తప్పించాలనుకొన్నాడు ఆ ఇద్దరు మిత్రులు సంభాషణలోకి దిగే సమయానికి అక్కడికి వెళ్ళి ప్రశ్నలు వేసే పనిని తానే తీసుకొన్నాడు "ధ్యానం అంటే ఏమిటి? దాని వివిధ స్థాయిలేమిటి? వివిధ స్థాయిల్లో కలిగే అనుభూతులేమిటి? ఆయా స్థాయిల్లో ఎదురయ్యే ఆటంకాలేమిటి? వాటిని అధిగమించడం ఎలా?" ఇలాంటి ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు ఈ హరాత్ పరిణామాన్ని పండిత భిక్షువు ఎదురు చూడలేదు. ఈ ప్రశ్నలకు సమాధానాలు పుస్తకాల్లో వుండవు ఉన్నా అవి పని చేయవు స్వానుభవం ద్వారా బదులివ్వాల్సిన ప్రశ్నలవి పండితభిక్షువు ఎప్పుడూ ధ్యానం జోలికి పోయినవాడు కాదు కాలమంతా గ్రంథపఠనానికి, ధారణకు వినియోగించాడు. ఒక్క ప్రశ్నకు కూడ సమాధానం చెప్పలేక తెల్లమొహంతో మౌనం దాల్చాడు. చదువురాని భిక్షువు చాలా వినయంగా ఆయా ప్రశ్నలకు తన అనుభవం నుండి సరైన సమాధానాలు చెప్పాడు గ్రంధికుని కన్నా విపశ్యకుడు మిన్న అనే విషయాన్ని తేల్చివేసి బుద్ధుడు తన కుటీరానికి వెళ్ళిపోయాడు

ఆ పిమ్మట అక్కడ గుమికూడిన భిక్షువులనుద్దేశించి బుద్ధుడు ఇలా అన్నాడు "ధర్మ విషయాలను చదువడమే పనిగా పెట్టుకొని అనుష్ఠించడం అనే అతి ముఖ్య విషయాన్ని ఉపేక్షించినవాడు జీతానికి పని చేస్తున్న పశులకాపరి లాంటివాడు. ఆ పని వల్ల అతనికి రావలసిన జీతం మాత్రమే వస్తుంది పాండిత్యము వల్ల దానికి జీతంగా సత్కారసన్మానాలు, శిష్యుల సేవలు వగైరా లభిస్తాయి ధర్మాన్ని చక్కగా అనుష్ఠించేవాడు పంచగవ్యాలను (పాలు, మీగడ,

వెన్న, మజ్జిగ, నెయ్యి) హక్కు భుక్తంగా కలిగిన పశుల యజమానిలాంటివాడు, పంచగవ్యాలు దేహానికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి. అలాగే ధర్మానుష్ఠానం మానసికారోగ్యాన్ని ప్రసాదిస్తుంది ఆధ్యాత్మ జీవనంలో ముఖ్యమైంది పాండిత్యం కాదు వైరాగ్యాన్ని పెంచుకోవడము ద్వారా రాగ ద్వేష మోహాలను వదిలించుకోవడమే ముఖ్య కర్తవ్యము "

చివరగా పై అర్థం వచ్చే క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు

**బహ్వీమపి సంహితాం భాషమాణః న తత్కరో భవతి నరః ప్రమత్తః**
**గోప ఇవ గా గణయన్ పరేషాం న భాగవాన్ శ్రామణ్యస్య భవతి 1-19**

**అల్పామపి సంహితాం భాషమాణో ధర్మస్య భవత్యనుధర్మచారీ**
**రాగం చ ద్వేషం చ ప్రహాయ మోహం సమ్యక్ ప్రజానన్ సువిముక్తచిత్తః**
**అనుపాదాన ఇహ వా అముత్ర వా స భాగవాన్ శ్రామణ్యస్య భవతి**
**1-20**



# కుంభఘోషకుడు

ఒక సమయంలో మగధదేశంలోని రాజగృహ నగరంలో భయంకరమైన అంటువ్యాధి సోకింది ఆ నగరంలోని కోటీశ్వరుడైన ఒక వర్తకునికి, ఆయన భార్యకు కూడా ఆ వ్యాధి సోకింది వాళ్ళిద్దరూ తమ ఏకైక కుమారుడు పన్నెండేండ్ల కుంభఘోషకుణ్ణి తక్షణమే ఆ ఊరు వదలి దూరంగా ఎక్కడికైనా వెళ్లిపొమ్మన్నారు తాము దాచి వుంచిన 40 కోట్ల వరహాలు ఎక్కడున్నాయో గుర్తులు చెప్పి తగిన సమయంలో వచ్చి ఆ ధనాన్ని స్వాధీనం చేసుకోవలసిందిగా కూడా చెప్పారు

కుంభఘోషకుడు 12 ఏండ్లపాటు వింధ్య పర్వత ప్రాంతాల్లో గడిపి ఆ పిమ్మట రాజగృహానికి మరలినాడు తల్లిదండ్రులు చెప్పిన గుర్తుల ప్రకారం 40 కోట్ల ధనరాశిని కనుక్కొన్నాడు కానీ దాన్ని వెంటనే తీసుకోవడానికి ఆత్రపడలేదు. అంత ధనాన్ని ఒక్కసారిగా బైటకు లాగితే దాన్ని రక్షించుకోవడం ప్రాణాంతకంగా వుంటుంది. ఆ ధనంతో ఏ దేశం వెళ్ళినా "దిక్కూ దివాణం లేనివాడికి ఇంత ధనం ఎక్కడిది?" అని ఆ దేశం రాజు నిశ్చయంగా ధనాన్ని లాక్కోవడమే గాక దండించే అపాయం కూడా వుంది కనుక స్వంత ఊరిలోనే వుండి మెల్లగా సమయం వచ్చినప్పుడు అది పిత్రార్జితమని నిరూపించి మరీ దాన్ని బైటకు తీయాలని నిర్ణయించాడు

కొన్నాళ్ళకు ఆ ఊరి పురపాలక సంఘంలో ఒక చిన్న నౌకరీ సంపాయించి కార్మికవాడలో ఒక చిన్న బస కూడా ఏర్పాటు చేసుకొన్నాడు. ఆయా సమయాల్లో వీధి వీధి తిరిగి దండోరా వేసి రాజశాసనాలను, ప్రకటనలను వినిపించడం అతనికి

పనిగా ఇచ్చారు

ఒకనాడు అతడు దండోరా వేసి వినిపిస్తుండగా ఆ దేశం రాజైన బింబిసారుడు వినడం జరిగింది. బింబిసారుడు మహా కుశాగ్రబుద్ధి. "ఆ కంఠం వున్నవాడు దండోరా వేసే నౌకరుగా నేను నమ్మడం లేదు. ఆ కంఠం కోటీశ్వరుడి కంఠం" అన్నాడు ఆ మాటలు విన్న రాజపరిచారిక వెంటనే కుంభఘోషకుని సమాచారం సేకరించి రాజుకు విన్నవించింది "అతడు చిల్లిగవ్వ కూడా లేని ఒక పరదేశి దరిద్రుడు. ఈ ఊరికి కొత్తగా వచ్చి దండోరా ఉద్యోగం సంపాయించి పొట్ట పోసుకుంటున్నవాడు. నివాసం కార్మికవాడలో ఒక చిన్న గుడిసె "

రాజు నమ్మలేదు. "అతను కోటీశ్వరుడని నా ఆరవ ఇంద్రియం నొక్కి చెబుతూ వుంది" అన్నాడు. రాజపరిచారిక ఈసారి తానే స్వయంగా ఆరా తీయాలని నిశ్చయించింది.

రాజగృహానికి సమీపంలోని వేణువనంలో వున్న బుద్ధదేవుణ్ణి సందర్శించుకోవడానికి సుదూరం నుండి వచ్చిన ఒక యాత్రికురాలుగా నటన చేసి కుంభఘోషకుని ఇంటిలో కొన్నాళ్లు ఆశ్రయాన్ని సంపాయించింది ఆమె ఎంత శోధించి చూచినా అతను ఒక దరిద్రుడనే తేలుతూ వుంది చివరకు ఒక ఉపాయం తట్టింది ఆ ఉపాయాన్ని రాజుకు చెప్పి అమలులో పెట్టించింది

"విశ్వకర్మ పూజ కోసం కార్మికవాడ కుటుంబాలన్నీ తమ తమ వంతుగా ఒక్కొక్క వరహా చందాగా ఇచ్చుకోవా"లని రాజుగారి దండోరా మరునాడు వింతగా ఆ వాడలో వినపడింది. కుంభఘోషకుని దగ్గర వరహా లేదు. రహస్యంగా వున్న ధనం నుండి ఒక వరహా తెచ్చి తన వంతు చందాగా చెల్లించాడు. అతనిచ్చిన వరహా మాత్రం ఇతర వరహాలతో కలిసిపోకుండా పరిశీలనకై రాజుగారి చేతికి పోయింది.

కుంభఘోషకుణ్ణి రాజుగారు తన సముఖానికి పిలిపించి ఏకాంతంలో అతనికి బాగా నమ్మకం పుట్టించి అసలు విషయాన్ని రాబట్టాడు. ఆ 40 కోట్ల వరహాలను తన కోశాగారానికి చేర్పించాడు. కుంభఘోషకుణ్ణి కోశాధికారిగా నియమించడమేగాక తన కుమార్తెనిచ్చి వివాహం కూడా చేశాడు

ఒకనాడు అల్లుణ్ణి వెంటబెట్టుకొని బింబిసారుడు తథాగతుని దర్శనానికోసం వేణువనానికి వెళ్ళాడు. అల్లుణ్ణి పరిచయం చేస్తూ అతడు కోటీశ్వరుడై వుండి కూడా చాటింపు వేసే నౌకరుగా ఎలా వుండినాడో చివరకు ఎలా తన అల్లుడయ్యాడో మొదలగు విషయాలన్నీ చెప్పాడు. ఆ సందర్భంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు

***ఉత్థానవత: స్మృతిమత: శుచికర్మణో నిశమ్యకారిణ:***
***సంయతస్య చ ధర్మజీవినో ౽ ప్రమత్తస్య యశో ౽ భివర్ధతే*** **2-4**

ప్రయత్నశీలుడు, స్మృతిమంతుడు, మనోవాక్కాయకర్మలలో శుద్ధికలిగినవాడు, పూర్వాపరములు చక్కగా విచారించి పనులు చేయువాడు, ఇంద్రియములను వశమునందుంచుకొన్నవాడు, ధర్మబద్ధముగా జీవికను నడిపించువాడు, అజాగ్రత్త లేనివాడు అయినవాని యొక్క కీర్తి, సంపద క్రమముగా వృద్ధి చెందుచుండును.



# మహాకాశ్యపుడు*

బుద్ధుని ముఖ్యశిష్యుల్లో మహాకాశ్యపునికి ఒక విశిష్టత వుంది. బుద్ధుడు ధర్మప్రవచనాలు చేస్తున్నప్పుడు ఆయన కూర్చున్న వేదిక మీద సమాన స్థాయిలో ప్రక్కనే ఆశీనుడయ్యే ప్రత్యేకత అరవైమంది ముఖ్యశిష్యుల్లో ఆయనకు ఒక్కడికే వుండేది! బుద్ధుని శరణుజొచ్చిన తొలి దినాల్లో ఆయన అతీంద్రియ శక్తుల సంపాదనలో మక్కువ కలిగివుండేవాడు. పిప్పహలి కొండ గుహలో సాధన మొదలుపెట్టాడు.

భిన్న భిన్న మనస్తత్వాలకు సరిపడే విధంగా బుద్ధుడు 40 ధ్యాన విషయాలను (subjects of meditation) చెప్పియున్నాడు. (10 కాశినాలు, 10 అశుభ భావనలు,

---

* బుద్ధుని శిష్యుడు కాకముందు మహాకాశ్యపుడు స్వయంగానే ఒక పెద్ద గురువుగా ఉంటూ తన చుట్టూ ఐదువందల మందిని శిష్యులుగా సంపాదించుకొన్నాడు బుద్ధుని ప్రభావానికి లోనయి గురుత్వపీఠాన్ని గడ్డిపోచలాగా వదలివేసి మామూలు శిష్యుడయ్యాడు బుద్ధుని మహాపరినిర్వాణం ఇంకా మూడు నెలలుండగా భిక్షుసంఘాన్ని తన తరువాత నడిపించే నాయకుని పేరును సూచించమని ఆనందుడు బుద్ధుణ్ణి అభ్యర్థించాడు అగ్రశ్రావకులుగా ఉండిన శారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు అప్పటికి కొన్ని నెలలకు ముందే గతించారు భిక్షుసంఘానికి నాయకుణ్ణి నియమించడానికి బుద్ధుడు సమ్మతించలేదు నాయకుణ్ణి నియమించనప్పటికీ భిక్షుసంఘం చాలా పటిష్ఠమైన ప్రజాస్వామ్యపద్ధతిలో నడిచే విధంగా వినయ సూత్రాలు ఉన్నాయి కనుక సరిపోయింది అయినప్పటికి ఎవరో ఒకరు అనధికారికమైన నాయకత్వాన్ని నిర్వహించక తప్పని పరిస్థితులు మహాపరినిర్వాణం తరువాత ఏర్పడ్డాయి అప్పుడు ఆ బాధ్యతను మహాకాశ్యపుడు తీసుకొన్నాడు మహాపరినిర్వాణ సమయంలో ఆయన ఎక్కడో దూరంగా మగధలో సంచారం చేస్తుండినాడు ఆయన వచ్చాకనే అంత్యక్రియలు జరిగాయి చితికి నిప్పు పెట్టింది మహాకాశ్యపుడే ఆ తరువాత 6 నెలలకు రాజగృహంలో 500 అర్హతులను సమావేశపరచి ధర్మాన్ని (బుద్ధుని ఉపదేశాలను), వినయాన్ని (బుద్ధుడు విధించిన భిక్షు నియమాలను) క్రోడీకరింపజేశాడు ఈ సమావేశానికి ప్రథమ సంగీతి (*first council*) అని పేరు

10 అనుస్మృతులు, 4 బ్రహ్మవిహారాలు, ఒక సంజ్ఞ (perception), ఒక వ్యవస్థానం (analysis), 4 అరూపధ్యానములు) సంసార దుఃఖనివారణకు ఉపాయంగా మొదట శీలసంపత్తి (morality), ఆ పిమ్మట సమాధి (చిత్తైకాగ్రత), ఆ పిమ్మట ప్రజ్ఞ (wisdom) - ఈ క్రమంలో సాధనను ఉపదేశించాడు. చిత్తైకాగ్రత అనేది ప్రజ్ఞను ఆవిష్కరింపజేయడానికేగాని ఇతరములైన సిద్ధులు సంపాయించడానికి ఉద్దేశించబడలేదు.

పిప్పహలి కొండగుహలో మహాకాశ్యపుడు అతీంద్రియశక్తులు సంపాయించాలనే ఆశయంతో ఆలోక (light) కాశినాను ధ్యానవిషయంగా తీసుకొని సాధన మొదలుపెట్టాడు ఎవరి చిత్తం ఎలా వుంది? ఎవరు ఎప్పుడు మరణిస్తారు? ఎవరు ఎక్కడ ఎప్పుడు పుడతారు? మొదలగు విషయాల జ్ఞానం సంపాయించాలనే ఆరాటంతో సాధనలో నిమగ్నమయ్యాడు.

లోకోత్తర జ్ఞానసంపన్నుడైన బుద్ధునికి ఈ విషయం తెలిసి మహాకాశ్యపుణ్ణి మందలించి సరైన మార్గంలో పెట్టడానికి తానే స్వయంగా ఆ గుహకు వచ్చాడు. "ముందు ప్రజ్ఞను సంపాయించు ప్రజ్ఞను సంపాయించకుండా సిద్ధులను సంపాయించావంటే పెడదారి పట్టినవాడవవుతావు. రాగం, ద్వేషం, మోహం అనే క్లేశాలను తొలగించుకొని సంసారం నుండి మొదట ముక్తుడవు కమ్ము. సిద్ధులను పొంది లోకానికి చేసే మేలు కన్నా వేయి రెట్లు మేలు ముక్తపురుషుడుగా లోకానికి చేయగలుగుతావు" అని హితబోధ చేసిన సందర్భంలో క్రింది శ్లోకం కూడా చెప్పాడు.

*ప్రమాదమప్రమాదేన యదా నుదతి పండిత:*
*ప్రజ్ఞాప్రాసాదమారుహ్య అశోక: శోకినీం ప్రజామ్*
*పర్వతస్థ ఇవ భూమిస్థాన్ ధీరో బాలాన్ అవేక్షతే* 2-8

స్మృత్యుపస్థానం (mindfulness) ద్వారా సాధకుడు అజాగ్రత్తను తొలగించుకొని ప్రజ్ఞాప్రాసాదాన్ని ఎక్కి నిర్వాణసుఖాన్ని పొందుతాడు నీటిముంపునకు గురియై నానా అవస్థలు పడుతూ హాహాకారాలు చేస్తున్న జనులను చూచి భద్రమైన ఉన్నతస్థానం చేరినవాడు "ఇటు ఇటు ఇక్కడికి ఎక్కి రండి" అని దయతో అరచి చెప్పునట్లుగా ముక్తపురుషుడు కూడా నిర్వాణమనే భద్రమైన చోటున నిలబడి సంసార దుఃఖతప్తులను చూచి చాలా జాలి చెంది "ఇటు రండి ఇటు రండి" అని మహాకరుణతో పిలుస్తుంటాడు.



# ఇద్దరు భిక్షువులు

వర్షరుతువులో ఒకచోట నిలుకడగా వుండి సాధన చేసుకొనే ఆచారం సన్న్యాసుల్లో వుంది జేతవనంలోని ఇద్దరు భిక్షువులు బుద్ధుని నుండి తమకు సరిపడే ధ్యానవిషయాలను, ధ్యానపద్ధతులను తెలుసుకొని ఒక అడవిలోని విహారంలో వర్ష రుతువును గడపడానికి వెళ్ళారు

ఒక భిక్షువు ఆధ్యాత్మ సాధన విషయంలో జాగ్రత్త లేనివాడు, సోమరి వర్ష రుతువును చీకూచింతా లేకుండా గడిపివేయడమే పరమ లక్ష్యంగా పెట్టుకొన్నాడు. పెద్ద వర్షం వచ్చి కుటీరం కప్పునుండి నీరు కారితే ఏమి చేయాలి అని ఆలోచించి గడ్డిమోపులు సేకరించి పెట్టుకొన్నాడు . జడివాన కురిసి చలి వేస్తే ఏమి చేయాలి అని ఆలోచించి చలి కాచుకోవడానికి ఎండు కట్టెపుల్లలు సేకరించి పెట్టాడు. వర్షం వచ్చి అంతా బురద అయినప్పుడు కాలికి బురద తగలకుండా ఉండడానికోసం కుటీరం ముందు పల్లంగా వుండే చోట్లలో పెద్ద పెద్ద రాళ్ళు పాదాలు మోపడానికై ముందు జాగ్రత్తగా వేసుకొన్నాడు ఒకోసారి వారం రోజులు కూడా విడువకుండా మబ్బులు మూసుకొని వర్షిస్తాయి కనుక వస్త్రాలు అదనంగా రెండు జతలు ఉంచుకొంటే మంచిదని వాటిని కూడా సంపాయించి పెట్టుకొన్నాడు

వర్షాలు కురిసి వెలిశాక అడవి అంతా తిరుగుతూ వర్షరుతువులో కనపడే వింత వింత కీటకాలను చూస్తూ "ఆహా, ఏమి సృష్టి! ఏమి సృష్టి" అని ఆశ్చర్యపోతుండేవాడు ఏమీ తోచనప్పుడు కనపడిన నలుగురిని చేరదీసుకొని పిచ్చాపాటి మాట్లాడేవాడు. ధ్యాన విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు ఒక మొక్కుబడిగా, ఒక ఆచారంగా కాసేపు కళ్ళు మూసుకొని కూర్చొని లేచి మళ్ళీ

తన మామూలు ధోరణిలో పడిపోయేవాడు. అతని చాతుర్మాస్యం అలా గడిచింది!

రెండవ భిక్షువు అలా కాదు. వినయపిటకంలో చెప్పిన 250 భిక్షు నియమాలను తు చ. తప్పకుండా పాటిస్తూ ఎక్కువ సమయాన్ని ధ్యానాభ్యాసానికి కేటాయిస్తూ సాధనలో నిమగ్నమయ్యాడు

వర్షరుతువు అయ్యాక ఇద్దరూ జేతవనం చేరారు. బుద్ధుడు వారిద్దరినీ గమనించి సాధనపథంలో ఒకడు బాగా వెనుకబడి వుండడం, రెండవవాడు చాలా ముందుకు పోయి ఉండడం తెలుసుకొని క్రింది శ్లోకాన్ని పఠించాడు.

**అప్రమత్త: ప్రమత్తేషు సుప్తేషు బహుజాగర:**
**అబలాశ్వమివ శీఘ్రాశ్వో హిత్వా యాతి సుమేధా:** 2-9

అధ్యాత్మ విషయాల్లో ఏమరుపాటు, సోమరితనం కలిగినవారికంటే స్మృతిమంతుడు, జాగరూకుడైనవాడు అధ్యాత్మమార్గంలో వేగంగా పురోగమిస్తాడు బలమైన, వేగవంతమైన గుఱ్ఱం పరుగు పందెంలో బలం లేని గుఱ్ఱాన్ని దాటుకొని చాలా ముందుకు వెళ్లగలుగుతుందిగదా!

# నిగమవాసి తిస్సుడు

శ్రావస్తికి సమీపంలోని ఒక వర్తకుల గ్రామానికి చెందిన తిస్సుడు బుద్ధుని ప్రభావంచే శ్రమణ జీవితానికి మరలినాడు అవసరాలను సాధ్యమైనంత వరకు తగ్గించుకొని సుగతుడు తెలిపిన పద్ధతిలో సాధన చేసుకొంటూ తపోమయ జీవితాన్ని సాగించాడు తరచుగా భిక్షాటనకు తన స్వంత గ్రామానికే వెళ్ళేవాడు ధార్మిక ప్రసంగాలు చేయడానికి కూడా ఎక్కువసార్లు ఆ గ్రామానికే వెళ్ళేవాడు అక్కడ పరిచితులు, స్నేహితులు, బంధువులు చాలా మంది వున్నా భిక్షునియమాలను ఉల్లంఘించకుండా జాగ్రత్తపడేవాడు

మహాధనికుడైన అనాథపిండకుడు చీటికిమాటికి ఏర్పాటు చేసే పెద్దభిక్షలకు గానీ, కోసలరాజైన ప్రసేనజిత్తు ఏర్పాటు చేసే పెద్ద భిక్షులకుగానీ పోయేవాడు కాదు. ఇతని ధోరణి తక్కిన భిక్షువులలో కొందరికి కంటగింపుగా వుండేది. ఒక వ్యక్తి మీద అయిష్టత ఏర్పడితే ఇక ఆ వ్యక్తిలోని ఆవగింజంత దోషాలు తాటికాయల్లాగా కనపడతాయి నిగమనాసి తిస్సుడు పేరుకు సన్యాసియేగాని స్వంత ఊరి మీద, అక్కడున్న బంధుజనుల మీద అపేక్ష ఇంకా అట్లే పెట్టుకొని శ్రమణులందరికీ తలవంపులు తెచ్చేవాడుగా తయారయ్యాడని ఒకరికొకరు చెప్పుకోవడం మొదలుపెట్టారు

ఈ దోషారోపణ బుద్ధుని చెవిదాక కూడా వెళ్ళింది ఆనాటి సాయంకాలం భిక్షుసమావేశంలో ఆయన ఒక చిలుక కథ చెప్పాడు ఒక అత్తిచెట్టును ఆశ్రయం చేసుకొని చాలా చిలుకలు వుండేవి. అత్తిపండ్లు వున్నంతకాలం యథేచ్ఛగా తింటూ అవి అయిపోగానే గుంపుగా మరో చెట్టుకు మకాం మార్చేవి కానీ ఒక

చిలుక మాత్రం ఆ చెట్టునే అన్ని కాలాల్లో అంటిపెట్టుకొని శరీరధారణ కోసం లభించింది ఏదో తిని తృప్తిగా కాలక్షేపం చేసేది.

ఈ కథ చెప్పి తిస్సుని ప్రస్తావన తీసుకొచ్చి "తిస్సుడు ఆ చిలుకలాంటివాడు అసలుసిసలైన శ్రమణుడు అతని ఎడల అపార్థాలు పెంచుకొన్నవాళ్ళు వాటిని వదిలించుకోండి భిక్షునియమాలను ఉల్లంఘించనంతవరకు స్వంత గ్రామానికి తరచుగా భిక్షకై పోవడంలో తప్పు లేదు. అక్కడి పరిచితులకు, మిత్రులకు, బంధువులకు ధర్మసందేశాన్ని వినిపించడంలో తప్పు లేదు. అతను అవసరాలు బాగా తగ్గించుకొన్నవాడు కనుక పెద్దభిక్షలకు పోయి కానుకలు తీసుకోవలసిన అవసరం లేనివాడు కనుక వాటికి అతను పోవడం లేదు. దాన్ని ఎవరూ అవినయంగా భావించరాదు" అని చెప్పి క్రింది శ్లోకాన్ని పఠించాడు

**అప్రమాదరతో భిక్షుః ప్రమాదే భయదర్శీ వా**
**అభవ్యః పరిహాణాయ నిర్వాణస్యైవ అంతికే** **2-12**

దుఃఖసత్యం, సముదయసత్యం, నిరోధసత్యం, మార్గసత్యం - ఈ నాలుగు ఆర్యసత్యాలను సదా జ్ఞప్తిలో పెట్టుకోవడానికి ఇష్టపడుతూ అవి మరపునకు రావడం అంటేనే భయపడుతూ వుండే భిక్షువు శమధం (tranquillity) విపశ్యన (insight) నుండి జారిపోకుండా నిర్వాణానికి సమీపుడౌతాడు

# మేఘుడు

మేఘుడు అనే పేరు వింతగా ఉందనిపించవచ్చు. తలిదండ్రులు అతనికి ఆ పేరు పెట్టారు ఆ పేరు వెనుక ఒక చక్కని అర్థం ఉంది వాళ్ళు వర్షాధారం మీద జీవించే రైతుజనులు వర్షం కురిస్తే సంపద, కురవకపోతే దారిద్ర్యం కనుక వర్షసూచకమైన మేఘాలను చూచినప్పుడు వాళ్ళ ఆనందానికి అవధులుండవు ప్రథమంగా మగశిశువు పుట్టినప్పుడు కూడా వాళ్ళకు అలాంటి ఆనందమే కలిగి ఆ శిశువుకు మేఘుడు అని నామకరణం చేశారు ఆ మేఘుడు లాగే ఇతను కూడా తమకు సంపన్నకారకుడవుతాడనే ఆశయంతో వాళ్ళతనికి ఆ పేరు పెట్టారు.

మేఘుని కుటుంబం శాక్యతెగల్లో ఒక తెగకు చెందినది కనుక చిన్నప్పటినుండి మేఘుడు తమ తెగవాడైన గౌతమబుద్ధుని గురించి ఎక్కువ వినడం జరిగింది యుక్తవయస్సు వచ్చే సరికి గౌతమబుద్ధుని వెతుక్కొంటూ ప్రయాణమయ్యాడు బుద్ధుడు అప్పుడు చాలిక నగర సమీపాన కొండల్లోని ఒక విహారంలో ఉన్నట్లు తెలిసి అక్కడికి వెళ్ళాడు ఆయన్ను చూచాక ఇతనికి కూడా శ్రమణుడు (సన్న్యాసి) కావాలనిపించి వెంటనే దీక్ష తీసుకొన్నాడు. కొత్తవాడు గనుక తథాగతుని దగ్గరే మసలడం మంచిదనిపించి ఆ విహార నిర్వాహకుడు అతనికి తథాగతుని పనులను చేసి పెట్టే బాధ్యతను అప్పగించాడు

ఒకనాడు మేఘుడు బుద్ధుని అనుమతి తీసుకొని జంతుగామ అనే గ్రామానికి భిక్షకై వెళ్ళాడు భిక్ష తీసుకొని అక్కడికి కొంత దూరంలో ఉన్న కిమికాలనది ఒడ్డుకు వెళ్ళి భిక్షాన్నాన్ని మధ్యాహ్నం దాటకముందే ఆరగించి ఆ పిమ్మట వాహ్యాళిగా అటు ఇటు పచారు చేస్తుండగా అతనికి ఆ నది ఒడ్డులో ఒక

చక్కని మామిడితోపు కనిపించింది. దాన్ని చూడగానే అతనికి మొన్న ఒక శ్రమణుడు "ధ్యానానికి అనువైన చోటు" అనే అంశం మీద చేసిన ప్రసంగం గుర్తుకొచ్చింది ధ్యానానికి కూర్చునే తావు పరిశుభ్రమైనదిగానూ నిశ్శబ్దమైనదిగానూ ప్రకృతిరమణీయమైనదిగానూ ఉండాలనే విషయాన్ని ఆయన నొక్కి నొక్కి చెప్పడం మేఘునికి జ్ఞాపకం వచ్చింది. బుద్ధుడు బోధివృక్షం క్రింద కూర్చున్నట్లుగా తను ఈ ఆమ్రవృక్షం క్రింద కూర్చోవాలనుకొన్నాడు

మేఘుడు వెంటనే విహారానికి వెళ్ళి బుద్ధుని అనుమతి కోరాడు "నన్నిక్కడ ఒంటరిగా విడిచి ధ్యానానికి వెళ్తావా? కాసేపు ఆగు. ఎవరైనా భిక్షువు వచ్చాక అతనికి నీ పని అప్పగించి వెళ్లవుగానీ" అన్నాడు బుద్ధుడు కానీ మేఘుడు ఉత్సాహం పట్టలేక రెండవసారి, మూడవసారి కూడా అనుమతి కోరాడు బుద్ధుడు అతని ఆతురతను గమనించి, "సరే, వెళ్ళిరా" అని అనుమతించాడు

ఆ మామిడి తోపుకు వెళ్ళి మేఘుడు ఒక చెట్టు క్రింద పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు కళ్ళు మూసుకొన్నాడు. అలానే మూడు గంటలకు పైగా కూర్చుండిపోయాడు ఆ పిమ్మట ఇక లాభం లేదనుకొని లేచి విహారానికి వచ్చాడు బుద్ధునికి ప్రణామం చేసి "శాక్యమునీ, మీమాట వినకుండా ధ్యానానికి వెళ్ళి భంగపాటు చెందాను ధ్యేయం మీద మనస్సు పెట్టాలని కూర్చుంటే ఎన్నెన్నో ఆలోచనలు, ఎన్నెన్నో సంకల్పాలు, ఎన్నెన్నో వికల్పాలు, ఎన్నెన్నో విక్షేపాలు తలెత్తాయో చెప్పలేను మనస్సు అటు గతానికి పరుగులు తీయడమో, లేదా ఇటు భవిష్యత్తుకు పరుగులు తీయడమో తప్పించి ధ్యేయం మీద నిలువనే లేదు. జరిగిపోయిన సంఘటనలను మరో విధంగా జరిగినట్లు కల్పన చేసుకొనేది. భవిష్యత్తులోకి పరుగులు తీసి గాలిమేడలు నిర్మించేది ఇంతేకాదు, కామపూరితమైన ఆలోచనలు, ద్వేషపూరితమైన ఆలోచనలు కూడా ఎన్నో తలెత్తాయి నా తల వేడెక్కిపోవడం, అలసిపోవడం తప్పించి ఈ మూడు గంటల్లో నేను సాధించిందింకేమీ లేదు" అన్నాడు మేఘుడు

"మేఘా, నిరుత్సాహం చెందకు, ధ్యానం కుదురుతుంది. కానీ దానికి పూర్వం నీవు పాటించవలసినవి కొన్ని ఉన్నాయి. అవేమీ లేకుండానే హఠాత్తుగా ధ్యానం సిద్ధించాలంటే ఎలా? మొదట నీవు సత్సాంగత్యం సంపాదించుకోవాలి. సజ్జనులు, ముముక్షువులు, నియమశీలురైన వారి సాహచర్యం మొదటి ఆవశ్యకత. ఇక రెండవది ప్రాతిమోక్షనియమాలను (సన్న్యాస నియమాలను) కడు జాగరూకతతో పాటించుతూ ఉండడము మూడవది వాగ్నియమం. హిత సత్య ప్రియములతో ముప్పిరిగొన్న వాక్కులనే నీవు మాట్లాడాలి. నిర్వాణానికి, నిర్వాణమార్గానికి సంబంధించిన మాటలే మాట్లాడాలి నాలుగవది శీలసంపత్తి (ethics). నాలుగు బ్రహ్మ విహారాలను (మైత్రి, కరుణ, ఉపేక్ష, ముదితములు), దశ కుశల ధర్మాలను (శ్రద్ధ, అహింస, హ్రీ, అపత్రాప్యం, అలోభం, అమోహం, వీర్యం, అప్రమాదం, కరుణ, ఉపేక్ష) పాటిస్తూ ఉండాలి ఇక ఐదవది విచారం. ఆర్య సత్యాలను గురించి, ప్రతీత్యసముత్పాదం గురించి ద్వాదశాంగనిదానం గురించి బాగా విచారం చేస్తూండాలి ఇవన్నీ చేస్తుంటేనే ధ్యానం కూడా నీకు క్రమంగా అలవడుతుంది. మనస్సు స్వాధీనానికి వస్తుంది తొందరపడకు" అని బుద్ధుడు అతణ్ణి ఊరడించాడు చివరగా క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు.

**స్పందనం చపలం చిత్తం దూరక్ష్యం దుర్నివార్యం**
**ఋజుం కరోతి మేధావీ ఇషుకార ఇవ తేజనమ్** 3-1

చిత్తము స్పందనశీలమైనటువంటిది, చపలమైనటువంటిది. దీనిని విషయముల నుండి మరలించడము చాలా కష్టము. విషయముల వైపు పోనీయక నిలువరించడము కూడా కష్టమే నేర్పరియైన ఇషుకారుడు (బాణములను తయారు చేయువాడు) వంకరటింకరగా ఉన్న బాణమును చక్కజేయునట్లుగా బుద్ధిమంతుడైన వాడు చిత్తమును దారికి తెచ్చుకొనును.

**వారిజమివ స్థలే క్షిప్తం ఉదకౌకత ఉద్భూతమ్**
**పరిస్పందత ఇదం చిత్తం మారధేయం ప్రహాతుమ్** 3-2

రాగము, ద్వేషము, మోహము, మానము, విచికిత్స, మిధ్యాదృష్టి ఈ ఆరింటికి క్లేశములని పేరు. ఈ క్లేశములచే వ్యాప్తమైనదంతయు మారుని సామ్రాజ్యము క్రిందకు వచ్చును. ఈ నిరంకుశ మార సామ్రాజ్యము నుండి బయట పడవలెనను తపనతో విషయముల మీద వాలడమే అలవాటయి ఉన్న మనస్సును తటాలున విషయములకు దూరము చేయ ప్రయత్నించినచో అది తల్లడిల్లుట సహజమే. జలనివాసమునకు అలవాటు పడిన చేపను నీటినుండి ఒడ్డున వేసినచో గిలగిల కొట్టుకొనును కదా !



# మాతికుని తల్లి

జేతవనం నుండి కొందరు భిక్షువులు హిమాలయాన్ని ఆనుకొని యున్న మాతిక గ్రామానికి వెళ్ళారు వర్షాకాలంలో సంచారం కష్టం కనుక ఎక్కడో ఒక చోట వర్షాకాలమంతా స్థిరంగా ఉండడం భిక్షువుల ఆచారం మాతికగ్రామ నాయకుని పేరు కూడా ఆ గ్రామం పేరే. అతణ్ణి మాతికుడని పిలుస్తారు భిక్షువులు మొదట అతని ఇంటికి వెళ్ళారు మాతికుని తల్లి వారిని సాదరంగా ఆహ్వానించి అతిధి మర్యాదలు చేసి వారి రాకకు కారణం అడిగింది ఒక మంచి చోటు చూసుకొని వర్షాకాలమంతా ఉండడానికని వారు చెప్పారు

ఆమె వెంటనే చొరవ తీసుకొని వారు ఉండడానికి స్థల నిర్ణయం చేసి కుటీరాలు కూడా త్వరత్వరగా నిర్మాణమయ్యేలా చర్యలు తీసుకొన్నది భోజనం ఏర్పాట్లు తానే స్వయంగా చూచుకొంటూ భిక్షాటన శ్రమ వారికి లేకుండా చేసింది.

ఇన్ని సౌకర్యాలు చకచకా ఏర్పడడంతో ఒక భిక్షువు బెదిరిపోయి తక్కినవారినుద్దేశించి "సోదరులారా, మనం ఈ వర్షాకాలం నిలకడగా ఒకచోట ఉండి ధ్యానం చేసుకోవడానికి వచ్చాము ఇన్ని దైహిక సౌకర్యాలు మన లక్ష్యసాధనకు భంగం అవుతుందేమో! జాగ్రత్తపడాలి కొన్ని నియమాలు మనం పెట్టుకొనకపోతే కాలం కులాసాగా నెట్టివేయడం వరకే మనం సాధించినవాళ్ల మవుతాము లోకంలో చూస్తున్నాము కదా, పెద్ద శ్రమ లేకుండానే సుఖజీవనం సంపాయించుకొన్న భాగ్యవంతులు కొందరు వారానికి ఒకరోజు ఉబుసుపోకగా అధ్యాత్మ సమావేశాలు పెట్టుకొని ప్రేమ-కాలం-స్పందన, మనిషి-మనస్సు-చిగురింత, తత్త్వము-వాస్తవము-సంబంధాలు వగైరా పేర్లక్రింద చప్పన్న విషయాలు ఎంపిక చేసుకొని సుఖాసీనులై గంటల తరబడి చర్చిస్తూ కూర్చుంటారే ఆ పనికిమాలిన

వర్గానికి సమానమైపోయి చివరకు మాటలపోగులుగా మిగిలిపోతాము కనుక మనం కొన్ని నియమాలు పెట్టుకోవాలి భిక్ష సమయాల్లో సేవ సమయాల్లో ఇతర అత్యవసర సమయాల్లో తప్ప మనం పూర్తిగా ఏకాంత జీవితమే గడపాలి. ఎవరి ధ్యానం వారు చేసుకొంటూ మౌనం పాటించాలి" అని నియమావళిని సూచించాడు అందరూ దానికి సమ్మతిని తెలిపారు

ఒకనాడు అక్కడికి మాతికుని తల్లి తానే స్వయంగా భిక్షను పట్టుకవచ్చింది. అక్కడ ఏ అలికిడీ లేదు. ఏ ఒక భిక్షువూ కనబడలేదు ఆమె వెంట సహాయంగా వచ్చిన పనిమనిషికి పద్ధతి తెలుసు అక్కడ వ్రేలాడగట్టిన గంటను గణగణ మ్రోగించింది కొంతసేపటికి భిక్షువులు ఒక్కొక్కరూ ఒక్కొక్క దిక్కునుండి రావడం కనబడింది. వారు ఒకరితో ఒకరు మాట్లాడడం లేదు ఒకరినొకరు చూచుకోవడం కూడా లేదు "వీరందరూ ఒకరితో ఒకరు గొడవలు పడ్డారా ఏమిటి?" అని అనుమానం ఆమెకు కలిగింది వారిలో పెద్దగా ఉన్న ఒక భిక్షువుకు తన అనుమానాన్ని వ్యక్తం చేసింది "అదేమీ లేదమ్మా, మేము అలా నియమాలు పెట్టుకొన్నాము లేకుంటే ధ్యానంలో పురోగతి సాధించలేము" అన్నాడు ఆ భిక్షువు

ఆమె చాలా కుతూహలంతో ధ్యానం విషయాలడిగింది భిక్షువు వివరంగా అన్నీ చెప్పాడు "అమ్మా, అన్ని అనర్థాలకు కారణం "నేను, నాది" అనే తప్పు భావనలే. ఈ ఆత్మ, ఆత్మీయ భావనలు ప్రధానముగా దేహాన్ని ఆశ్రయించుకొని ఉనికిని సంపాయిస్తున్నాయి దేహతత్త్వం అవగతమయితే "నేను, నాది" భావాలకు ఆధారం పోతుంది ఆ తరువాత ఆ రెండు పదాలు కేవలం వ్యవహార సౌలభ్యానికి వాడే వట్టి పదాలవుతాయి దేహాన్ని స్థిరమని, నిత్యమని, శుచియని, సుఖాస్పదమని మనమనుకొంటూ అలా వ్యవహరిస్తుంటాము. అజ్ఞానమంతా ఇక్కడే ఉంది ఈ అజ్ఞానాన్ని తొలగించే సాధనంగానే మాకందరికి బుద్ధభగవానుడు దేహ సంబంధముగా 32 ధ్యానాలను బోధించారు. వాటిని మేము అభ్యసిస్తున్నాము"

ఆమె వార్ధక్య సమీపంలో ఉన్న వ్యక్తి కనుక ఆ భిక్షువు చెప్పిన విషయాలలో వాస్తవం ఉందని ఇట్టే గ్రహించింది ఆమె గనుక యవ్వనంలో ఆ మాటలు విని ఉంటే "ఇదేమిటి పిచ్చి గోల" అని కొట్టివేసియుండేది ఆ ధ్యానక్రమం భిక్షువును అడిగి తెలిసికొని తాను కూడా అభ్యాసం మొదలుపెట్టింది - గృహిణిగా తన ధర్మాలను ఒక ప్రక్క చక్కగా చేస్తూనే

వర్షాకాలం ముగిసాక ఆ భిక్షువులందరూ ఆమె దగ్గర సెలవు తీసుకొని జేతవనానికి బయలుదేరారు ఆమె వారిని సాగనంపుతూ "నాయనలారా, మీ కోసం వేసిన కుటీరాలు అలానే ఉంటాయి మీకు ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడు ఇక్కడికి వచ్చి సాధన చేసుకోండి మీ తోటి భిక్షువులకు కూడా నా ఆహ్వానాన్ని తెలియజేయండి" అన్నది

భిక్షువులు ఆమె చూపిన ఆదరణను అదే పనిగా జేతవనంలో చెప్పడం మొదలుపెట్టారు ఆ మాటలు ఒక యువ భిక్షువును బాగా ఆకట్టుకున్నాయి బుద్ధుని అనుమతి తీసుకొని అతను మాతిక గ్రామానికి పయనమయ్యాడు మాతికుని తల్లికి మొదట తన పరిచయం చేసుకొని ఒక కుటీరములో ఉండి సాధన చేసుకోడానికి వచ్చానని చెప్పాడు. ఆమె ఆనందముతో "చాలా మంచిది నాయనా, ఇప్పుడే అక్కడికి వెళ్ళి నీకు నచ్చిన కుటీరాన్ని ఎంపిక చేసుకో" అని చెప్పింది. అతను వాస్తు శాస్త్రాన్ని నమ్మేవాడు. ఆ శాస్త్రం ప్రకారం శ్రేష్ఠమని తోచిన కుటీరాన్ని ఎన్నుకొని లోనికి ప్రవేశించాడు. ప్రయాణ బడలిక ఇంకా అతన్ని వదలలేదు ఆ కుటీరం దుమ్ముధూళితో ఉంది శుభ్రం చేసుకొనే ఓపిక లేక మనస్సులో ఇలా అనుకొన్నాడు . "ఎవరైనా పనిమనిషి వచ్చి అంతా శుభ్రం చేస్తే ఎంత బాగుండును" కొన్ని నిమిషాల తరువాత అక్కడికి పనిమనిషి రానే వచ్చింది. కాకతాళీయం సామెత అతనికి జ్ఞాపకం వచ్చింది ఆమె అంతా శుభ్రం చేసి వెళ్ళింది. అతడు అంతలో చక్కగా స్నానం చేసి కుటీరానికి వచ్చి

ఆసనం వేసుకొని కూర్చున్నాడు చల్లగాలి వీస్తుండడం వల్ల అతనికి కొంచం చలి వేసి "ఈ చలిలో వేడి పాయసం తాగితే బాగుండును కదా" అనుకొని మధ్యమ నికాయ పఠనం మొదలుపెట్టాడు. కొంతసేపటికి పనిమనిషి వేడి పాయసం పట్టుకొచ్చింది "ఇదేమిటి? రెండవ కాకతాళీయం" అనుకొని అతను ముఖవికాసాన్ని కప్పిపుచ్చుకొని గంభీరముద్ర ధరించి ఆ పాయసాన్ని అందుకొన్నాడు పాయసాన్ని ఆరగించాక పాత్రను కడుగుతూ "నాలికకు ఈ వేళ తీపి ఎక్కువే తగిలింది. ప్రతిపక్షంగా ఈ రోజు భిక్షలో కాకరకాయ తాళింపు, మిరపకాయ పచ్చడి ఉంటే బలేగా ఉంటుంది" అనుకొన్నాడు మళ్ళీ ఆసనం మీద కూర్చొని మధ్యమ ఆగమాన్ని నిలపిన చోటునుండి పఠనం మొదలుపెట్టాడు

గంట మ్రోగింది. భిక్ష వచ్చినదానికి సంకేతమది. భిక్షాస్థలికి వచ్చాడు మాతికుని తల్లియే స్వయంగా భిక్ష తీసుకొని వచ్చింది అందులో కాకరకాయ తాళింపు ఉంది, మిరపకాయ పచ్చడి ఉంది "ఓహో ఇది మూడవ కాకతాళీయం కాబోలు, ఔరా అబ్బురం" అనుకొన్నాడు "నాయనా, ఇది మూడవ కాకతాళీయం కాదు. నీవు ఇక్కడ కూర్చొని ఏది కావాలనుకొంటున్నావో అది నాకు అక్కడ మనస్సుకు తెలుస్తుంది తిను నాయనా ఇలా తెలియడం ఈ మధ్యనే మొదలయ్యింది శారిదత్త భిక్షువు చెప్పిన పద్ధతిలో ధ్యానం చేస్తున్నాను. దానివల్లనేమో ఇది" అన్నదామె.

విషయం తెలిసినవాడు కనుక అతడు వెంటనే జాగరూకుడయ్యాడు స్మృత్యుపస్థానం, సంప్రజన్యం అనే జంట సాధన క్రమాన్నవలంబించి మనస్సు మీద నిఘా వేశాడు బుద్ధుని బోధనల మీదే మనస్సును మళ్ళించే చర్య చేపట్టాడు

ఆ రాత్రి అతను నిదుర పోలేదు అర్ధరాత్రి దాటింది. "ఇప్పుడామె గాఢంగా నిదురపోతుంటుంది ఇక భయం లేదు" అనుకొని మనస్సుకు స్వేచ్ఛ

ఇచ్చి ఇలా ఆలోచించాడు. "ధ్యానక్రమంలో ఆమె అభిజ్ఞ (అతీంద్రియ శక్తులు, పరచిత్త జ్ఞానం వగైరాలు) సాధించినట్లున్నది ఇక్కడుంటే కొంప మునుగుతుంది ఎంత జాగ్రత్తగా ఉన్నా ఎప్పుడో ఒకప్పుడు మనసులో తగని ఆలోచన ఏదైనా తలెత్తవచ్చు సందేహం లేదు అది ఆమెకు తెలుస్తుంది "ఏమయ్యా ఇలాంటి ఆలోచనలు పెట్టుకొని ఎందుకయ్యా భిక్షువేషం వేశావు?" అని ముఖం మీద అడుగుతుందనుకో. ఆ అవమానం కన్నా ఏ కొండ శిఖరం నుండైనా దూకి చావడం మేలు కదా! ఇక్కడ ఇక ఒక క్షణం ఉండరాదు"అనుకొని ఆ చీకట్లోనే వేగంగా ఆ ఊరు విడిచిపెట్టి జేతవనం చేరుకొని బుద్ధునికి విషయం చెప్పి "ఇక ఈ జన్మలో ఆ ఊరికి వెళ్ళను" అన్నాడు

బుద్ధుడు అతణ్ణి సముదాయించి ఆ పిమ్మట, మనస్సు మీద గట్టి పట్టును సాధించే ఉపాయాలు కొన్ని నేర్పి అదే చోటికి పోయి ధ్యానం చేసుకోమన్నాడు. చివరగా క్రింది శ్లోకం కూడా చెప్పాడు

**దుర్నిగ్రహస్య లఘునో యత్ర కామనిపాతిన:**
**చిత్తస్య దమనం సాధు చిత్తం దాంతం సుఖావహమ్** 3-3

మనస్సును అధీనంలో ఉంచుకోవడం చాలా కష్టము ఇది వాంఛిత విషయాల మీదికి వేగంగా కదులుతుంది చిత్తాన్ని అదుపులోకి తేవడం మంచిది అదుపులో ఉన్న చిత్తం సుఖాన్ని కలిగిస్తుంది



# అశాంతుడు

శ్రావస్తిలోని ఒక సంపన్న యువకుడు జీవితం ఎడల విసిగి శాంతి కోసం ఒక భిక్షువును ఆశ్రయించాడు. ఆ భిక్షువు ఉపాయ కౌశల్యం (skill in means) కలిగినవాడు. కనుక అతణ్ణి తటాలున సన్న్యాసంలోకి దింపలేదు ఆ యువకుణ్ణి ఆస్తిని మూడు భాగాలుగా విభజింపమన్నాడు. "ఒక భాగం కుటుంబానికి, మరొక భాగం చేస్తున్న వర్తకవృత్తికి, మరో భాగం దాన ధర్మాలకు కేటాయించి జీవించుమని" చెప్పాడు

కొన్నాళ్ళ తరువాత ఆ యువకుడు మళ్ళీ భిక్షువు దగ్గరకు వచ్చి "మీరు చెప్పినట్లు విభాగం చేసి జీవిస్తున్నాను. అయినా నా అశాంతి తగ్గలేదు" అన్నాడు త్రిరత్నముల శరణు పొంది పంచశీలను పాటిస్తూ జీవించుమని భిక్షువు సలహా ఇచ్చాడు "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అని ఆ యువకుడు శరణు వాక్యాలు పలికి పంచశీలను కూడా పాటిస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. హింస, స్తేయం, అసత్యభాషణం, వ్యభిచారం, మద్యపానం - ఈ ఐదు దోషాలకు దూరంగా ఉంటానని దీక్ష పూనడమే పంచశీల.

మళ్ళీ కొన్నాళ్ళకు ఆ యువకుడు భిక్షువును కలిసి "మీరు రెండవసారి చెప్పినవి కూడా పాటిస్తూ జీవిస్తున్నాను. అయినా అశాంతి తగ్గలేదు" అని మొరపెట్టుకొన్నాడు భిక్షువు పంచశీలకు మరో ఐదు నియమాలు చేర్చి వాటిని కూడా పాటించుమని యువకునికి చెప్పి పంపాడు అదనంగా చేర్చిన నియమాలు ఇవి 1 బ్రహ్మచర్యం, 2. రెండు వేళలకు మించి భోజనం చేయకుండా ఉండడం, 3 నాట్యం, సంగీతం, నాటకాలు మొదలగు వినోద కార్యక్రమాలకు దూరంగా ఉండడం, 4 సుగంధ ద్రవ్యాలు, విలువైన వస్త్రాలు, ఆభరణాలు,

పూలమాలలు మొదలగు అలంకార వస్తువుల వాడకాన్ని వదలిపెట్టడం, 5 మెత్తలు, దిండ్లు మొదలగు వాటితో కూడిన సుఖశయనాలు, కూర్చోవడాలు లేకుండడం

కొన్నాళ్ళ తరువాత అతను మళ్ళీ భిక్షువును సందర్శించి "మహాత్మా, మీరు సెలవిచ్చిన నియమాలన్నీ పాటించి చూస్తున్నాను. కానీ నాలోని అశాంతి, ఆరాటం, అసంతృప్తి అలానే ఉన్నాయి. ఇప్పుడింకేమి చేయమంటారు" అని ఆవేదనతో అర్థించాడు.

ఈసారి భిక్షువు అతనికి సన్యాస దీక్ష ఇచ్చి వినయ పిటకం, సూత్ర పిటకం, అభిధర్మ పిటకం తానే స్వయంగా చెప్పడం మొదలుపెట్టాడు త్రిపిటకాల్లోని విషయాలన్నీ అధ్యయనం చేశాక కూడా ఆ యువకుని అశాంతి తగ్గలేదు ధైర్యం చేసి ఒకనాడు ఆ భిక్షువుతో "మిమ్మల్ని నమ్మి ఇంత దూరం ప్రయాణించాను ఇంకా మిమ్మల్ని నమ్ముకొంటే నాకు చివరకు ఆయాసమే మిగిలేట్లుగా ఉంది" అన్నాడు నిరాశాపూరిత కంఠస్వరంతో "నాకు తెలిసిన వైద్యం అంతా చేశాను కానీ నీ దుఃఖ రోగం తగ్గలేదు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. నిన్ను పెద్ద వైద్యుడి దగ్గరకు తీసుకపోతాను" అని ఆ భిక్షువు అతణ్ణి బుద్ధుని చెంతకు తీసుకెళ్ళాడు. బుద్ధుడు ఆ యువకునకు బోధ చేసిన ఆ సందర్భంలో క్రింది శ్లోకం కూడా చెప్పాడు.

**సుదుర్దృశం సునిపుణం యత్ర కామనిపాతినమ్**
**చిత్తం రక్షేత్ మేధావీ చిత్తం గుప్తం సుఖావహమ్** 3-4

గమనించి పట్టుకోవడానకి చాలా కష్టమైనటువంటిది, మిక్కిలి సూక్ష్మమైనటు వంటిది, తనకు ఇష్టమైన విషయాల మీద శరవేగంతో పోయి వాలేది అయిన చిత్తమును మేధావియైనవాడు సన్మార్గంలో పెట్టి రక్షించుకొనవలెను అలా రక్షింపబడిన చిత్తము సుఖాన్ని ఇస్తుంది

# సంఘరక్షితుడు

జేతవనంలో సంఘరక్షితుడనే భిక్షువు వుండేవాడు ఆయనంటే అందరికీ గౌరవభావం సంఘరక్షితుని పూర్వాశ్రమంలోని చెల్లెలు కూడా అన్నగారి మీద గౌరవభావం చేత తనకు పుట్టిన మగబిడ్డకు సంఘరక్షితుడని పేరు పెట్టుకొంది. అతను పెరిగి పెద్దవాడయ్యాక జేతవన విహారంలో చేరి భిక్షుదీక్ష తీసుకొన్నాడు. ఇద్దరి పేర్లూ సంఘరక్షితులు కనుక గందరగోళం ఏర్పడకుండా వుండడానికి చిన్నవాణ్ణి సంఘరక్షిత భాగినేయుడని పిలిచేవాళ్ళు (భాగినేయుడనగా సోదరి బిడ్డడు అని అర్థం)

ఒక వర్షరుతువు సమయంలో భాగినేయుడికి ఎవరో కానుకగా రెండు జతల మేలిమి వస్త్రాలను బహూకరించారు అతడు ఒక జతను భద్రపరచి వర్షరుతువు అయిపోగానే సంఘరక్షితుని కుటీరానికి వెళ్లి ఆయనకు నమస్కరించి విసనకట్ట విసురుతూ తాను చాలా ఆప్యాయంగా పట్టుకొచ్చిన వస్త్రాలను స్వీకరించుమని కోరాడు "నాకు సరిపడే వస్త్రాలున్నాయి వద్దు" అన్నాడు సంఘరక్షితుడు.

భాగినేయుడి అహం దెబ్బ తినింది తాను ఇంత ప్రేమగా తెచ్చి ఇస్తే గర్వంగా తిరస్కరించి నన్నవమానిస్తాడా? బదులుకు ఇతనికి అవమానం కలిగించాలి. ఎలా? నేను భిక్షుజీవితాన్ని వదలి గృహస్థుడినైతే అప్పుడు ఇతడు అవమానం పాలుకాక తప్పదుకదా! బైట పోతే ఈ రెండు జతల కొత్త వస్త్రాలకు సులభంగా రెండు మేకలు వస్తాయి. ఆ మేకల వల్ల కొన్నాళ్ళకు ఇంకా కొన్ని మేకలు పుట్టాయి కుటుంబాన్ని పోషించగలిగే మేకలమంద ఏర్పడ్డాక పెండ్లి చేసుకొంటాను. సంవత్సరము తిరక్కముందే పిల్లవాడు పుట్టాడు వాణ్ణి తీసుకొని తాను, తన

భార్య సంఘరక్షితుణ్ణి చూడడానికి బండి మీద వస్తారు తాను పిల్లవాణ్ణి ఒక చేత్తో పట్టుకొని మరో చేత్తో పగ్గాలు పట్టుకొని బండిని నడుపుతాడు. బిడ్డను ఇటు ఇచ్చి బండిని సరిగా తోలండని భార్య బిడ్డను లాక్కుంటుంది తాను కోపంతో మళ్ళీ బిడ్డను లాక్కోబోతాడు ఈ లాగులాటలో బిడ్డ, క్రింద పడి బండి చక్రం క్రింద నలిగిపోతాడు. తనకు పట్టరాని కోపం వచ్చి భార్యను జాటీ కఱ్ఱతో బాదుతాడు.

కాల్పనిక జగత్తులో విహరిస్తూ అంతదాక వచ్చిన భాగినేయుడు విసనకఱ్ఱను విసురుగా విసిరాడు అది సంఘరక్షితుని తలకు తగిలింది పరచిత్తజ్ఞానం అనే సిద్ధిని కలిగిన సంఘరక్షితుడు "పెళ్ళాన్ని దండించడం చేతగాక నన్ను కొట్టావేమిటి?" అని కొంత హాస్యస్వరంతో అన్నాడు. భాగినేయుడు అదిరిపోయి ఇక అక్కడ ముఖం చూపడం అవమానమనిపించి ఒకే పరుగుతో బైటకు పరుగెత్తాడు. అతనికన్నా వేగంగా పరుగెత్తగలిగిన యువక భిక్షువులు కొందరు అతణ్ణి వెంబడించి పట్టుకొని తిరిగి విహారానికి లాక్కొచ్చి బుద్ధుని ముందు నిలబెట్టారు.

బుద్ధుడు అతనికి ఉపదేశం చేస్తూ మనస్సు విషయంలో తీసుకొనవలసిన జాగ్రత్తలు కొన్ని చెప్పాడు. ముఖ్యంగా వికల్ప వృత్తులు తలెత్తకుండా చూసుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు మనస్సు భవిష్యత్తుకు పరుగులు దీసి గాలిమేడలు కట్టుంది లేదా గతానికి పరుగులు దీసి జరిగిపోయిన సంఘటనలను మరో విధంగా జరిగినట్లుగా ఊహిస్తుంది ఇలాంటి వికల్ప వృత్తుల వల్ల మనసు అలసిపోవడం, మానసిక శక్తి వృధా కావడం తప్పించి వేరే ప్రయోజనం కలుగదు. కనుక మనస్సు యొక్క కదలికల మీద సదా గమనిక కలిగివుండి దాన్ని వర్తమానంలోనే వుంచగలిగితే రాగద్వేషమోహాలనే సంసార బంధాలు తెగిపోతాయని చెప్పి క్రింది శ్లోకం పఠించాడు

**దూరంగమం ఏకచరం అశరీరం గుహాశయమ్**
**యే చిత్తం సంయస్యంతి ముచ్యంతే మారబంధనాత్** **3-5**

---

Note లోలోపల మాట్లాడకుండా మనస్సును గతానికిగానీ భవిష్యత్తుకుగానీ పరుగెత్తించలేము నోటిలోపల నాలుకను కదిలించకుండా అదిమిపట్టి ఉంచామంటే ఇక మనస్సు వర్తమానంలోనే ఉంటూ తను చేయవలసిన పని *(paying attention to incoming stimuli)* చేసుకొంటూ ఉంటుంది. వికల్ప వృత్తుల *(day-dreaming, castle building, imaginations)* జననానికి ప్రధాన కారణం భాషగానే కనిపిస్తుంది బ్రెయిన్‌లో సమాచారం సేకరించి పెట్టుకొనేందుకూ భాషే ఉపకరణం. ఏ సమాచారం తన జీవితానికి అవసరం? ఏది అనవసరం? గమనిక కలిగియుంటే మంచిది మనస్సును ఒక చెత్తకుండీగా మార్చకుండా ఉండగలము. భాష ద్వారా మనకు సంక్రమించిన మరో జాడ్యం కృతకపద విన్యాసం అర్థంపర్థం లేని వట్టి పదాలను తలకెక్కించుకొని తెలిసినవాళ్లుగా నటించే జాడ్యం



# విశాఖ

ఒక ఉత్సవదినం నదీస్నానం కోసం పదిహేనేండ్ల విశాఖ స్నేహితురాండ్రతో బయలుదేరింది. నది ఒడ్డుకు చేరకముందే వర్షం వచ్చింది. స్నేహితురాండ్రందరూ వేగంగా పరిగెత్తుకొని పోయి ఒక మండపంలో దూరారు. విశాఖ మామూలుగానే నడుస్తూ మండపం చేరింది మండపం చేరేటప్పటికి ఆమె ముద్దగా తడిసిపోయింది. ఆ మండపంలో అప్పటికే చేరియున్న పరదేశి బ్రాహ్మణులు విశాఖను తప్పుబట్టారు "అలా రాణిలాగా నడిచి తడవకపోతే ఏం? పరిగెత్తుకొని వచ్చి వుంటే తడిచి ఉండేదానివి కాదు గదా!"

విశాఖ ఆ ఊరి మహాధనికుని ఏకైక కుమార్తె. సహజ సౌందర్యానికి తోడు చదువు సంస్కారం కలిగి మిక్కిలి ఆకర్షణీయంగా ఉన్నట్టిది. శాస్త్రాలు చెప్పే ఐదు స్త్రీ సౌందర్య లక్షణాలూ ఆమెకు ఉన్నాయి అంతేకాదు, పైకి చాలా సుకుమారవతిగా కనబడినా శారీరకంగా పురుషులతో సమాన బలాన్ని కలిగి ఉండేది. ధైర్యం కూడా ఎక్కువే ఆ పరదేశి బ్రాహ్మణుల మందలింపు మాటలకు సిగ్గుపడి తలదించుకోలేదు. చిన్నబుచ్చుకొని ముఖవికాసం తగ్గించుకోలేదు వాళ్ళ ముఖాలు వాచిపోయేట్లుగా ఇలా బదులిచ్చింది "సభకు వస్తున్న రాజు పరుగులు తీస్తూ వస్తే అది చాలా అనుచితంగా ఉంటుంది. సన్న్యాసి పరుగెత్తడం కూడా చాలా అనుచితంగా ఉంటుంది. అలాగే స్త్రీ కూడా పరుగెత్తడం అనుచితంగా ఉంటుందని మీకు తెలియదా? నేను గనుక పరుగెత్తుకొని వచ్చి ఉంటే వీళ్ళందరికన్నా ముందు ఇక్కడికి వచ్చి ఉండేదాన్ని"

ఆమె అలా వడ్డిస్తూన్న సమయంలో ఆ బ్రాహ్మణులు ఆమెను పరిశీలనగా చూశారు. ఆమె శిరోజాలను, దంతాల వరుసను, పెదవులను, దేహఛాయను,

యవ్వన సంపదను పరిశీలనగా చూశారు వెదకబోయిన తీగె కాలికి తగినట్లుగా ఆ బ్రాహ్మణులు చాలా ఆనందించారు వారిది శ్రావస్తి శ్రావస్తిలోని మిగారుడనే మహాధనికుని దూతలు వారు. తన ఏకైక కుమారుడైన పుణ్యావర్ధనునికి తగిన వధువును వెదకి పెట్టమని మిగారుడు వాళ్ళను పంపాడు.

కొన్నాళ్ళ తరువాత విశాఖ పుణ్యావర్ధనుల వివాహం మహావైభవంగా జరిగింది అత్తవారింటికి సాగనంపుతూ తండ్రి విశాఖకు కట్నునిలా హితోపదేశం చేస్తూ పది సూత్రాలు చెప్పాడు

1 ఇంటిలోని నిప్పును బైటకు పోనీయకు (ఇంటిలోని వ్యక్తుల లోపాలను బైటవాళ్ళకు చెప్పవద్దు)

2 బైటి నిప్పును ఇంటిలోకి తేవద్దు (ఇరుగు పొరుగువారి గొడవలు వినడానికి ఆసక్తి చూపవద్దు).

3 ఇచ్చేవాళ్ళకే ఇవ్వు.

4 ఇవ్వనివాళ్ళకు ఇవ్వకు.

5 ఇచ్చేవాళ్ళకూ ఇవ్వనివాళ్ళకూ ఇవ్వు. (బీదబిక్కి జనం తీసుకొనిపోయిన వస్తువులను తెచ్చిచ్చినా ఇవ్వకపోయినా వారికి మాత్రం అడిగినప్పుడు లేదనకుండా ఇస్తూ ఉండు).

6. ఆనందంగా కూర్చో

7. ఆనందంగా తిను

8. ఆనందంగా నిదురించు.

9 అగ్నిని ఉపాసించు (భర్తను, అత్తమామలను అగ్నితో సమానంగా చూచుకో - అంటే వారి ఎడల చాలా జాగ్రత్తగా మసలుకో)

10 గృహదేవతలను పూజించు (అత్తమామలే గృహదేవతలు)

విశాఖ అత్తగారింటికి చేరిన కొన్నాళ్ళకు ఆమె జీవితాన్ని మలుపు దిప్పిన ఒక సంఘటన జరిగింది. ఒకనాడు మిగారుడు ఇంటిముంగిట ఒక చక్కని ఆసనం వేసుకొని సుఖాసీనుడై రహదారిలో పోతున్న జనాన్ని వాహనాలను చూస్తూ బంగారు పళ్ళెంలో ఘుమఘుమ వాసనలతో పొగలు గ్రక్కుతున్న వేడివేడి చక్కెర పొంగలిని ఆరగిస్తున్నాడు. విశాఖ ప్రక్కన వినయంగా నిలబడి అతనికి విసనకఱ్ఱ విసురుతూ ఉంది ఆ సమయంలో ఒక బౌద్ధభిక్షువు భిక్ష కోసం వచ్చి వాకిట దగ్గర నిలబడ్డాడు. మిగారుడు నిర్గ్రంధనాధపుత్రుని శిష్యుడు. బౌద్ధభిక్షువులంటే గౌరవం లేదు కాబట్టి ఆ భిక్షువును పట్టించుకోకుండా తన ఆరగింపు పనిలో నిమగ్నమయ్యాడు విశాఖకు వళ్ళు మండింది ఆ మంటలో తండ్రి చెప్పిన సూత్రాలు కనుమరుగయ్యాయి. ఆమె తండ్రి బుద్ధుని భక్తుడు తాను కూడా ఏడేండ్ల వయస్సునుండి బుద్ధుని ప్రవచనాలు వింటూ వచ్చినట్టిది. ఆ భిక్షువునుద్దేశించి "మా మామగారు నిన్నటి పాచిపోయిన అన్నాన్ని తింటున్నాడు. ఇక మీకేమి పెట్తాడు? మరో ఇంటికి వెళ్ళండి'' అన్నది ఆ భిక్షువు వెళ్ళిపోయాడు

కోడలి మాటలు మిగారుడికి పట్టరాని కోపాన్ని తెప్పించాయి "బైటకు నడు ఇక నీవు ఒక క్షణం నా యింటిలో ఉండడానికి వీలు లేదు'' అని అరిచాడు. "పో అంటే పోవడానికి రా అంటే రావడానికి నేనేమీ మీ దాసీదాన్ని కాదు నా నేరమేమిటో ముందు నిరూపించండి ఊరకనే బైటపో అని అరిస్తే లాభం లేదు'' అన్నది చాలా ధైర్యంగా విశాఖ "నేను పాచిపోయిన అన్నాన్ని తింటున్నానని ఆ దారినబోయేవాడికి పచ్చి అబద్ధం చెప్పి నా పరువు తీయడం నేరం కాదా?'' అని మిగారుడు గర్జించాడు "నేను చెప్పింది అబద్ధం కాదు ఈనాడు మీరు బంగారు పళ్ళెంలో భోజనం చేస్తున్నారంటే అది పూర్వజన్మలో మీరు చేసుకొన్న పుణ్యకర్మ పరిపాకం కాదా? పూర్వజన్మలో మీరు చేసుకొన్న పుణ్యఫలాన్ని ఇప్పుడు తింటున్నారు మీరు కాదనగలరా?'' అని ప్రశ్నించింది

మిగారుడు ఇక నోరెత్తలేక పోయాడు నిర్గ్రంధనాధపుత్రుడు కూడా తనకు అనేకసార్లు కర్మ సిద్ధాంతాన్ని బోధించియున్నాడు "పూర్వజన్మ నుండి సంక్రమించిన పుణ్యకర్మఫలమైన సుఖాన్ని అనుభవిస్తూ ఆ మైకంలోనే ఉండిపోరాదు అతిధి అభ్యాగతుల పూజ మొదలగు పుణ్యకర్మలు చేస్తుండాలి" అని ఆయన తనకు అనేకసార్లు బోధించియున్నాడు కోడలు కూడా ఇప్పుడు ఆ విషయాన్నే కొంచం వ్యంగ్యమైన ధోరణిలో జ్ఞాపకం చేసింది. ఆమె మాటలను తాను తప్పు పట్టితే తన గురువుగారి మాటలను కూడా తప్పు పట్టాల్సివస్తుంది అని మిగారుడనుకొని చల్లబడ్డాడు.

తరువాత విశాఖ తన జన్మస్థలానికి ప్రయాణ సన్నాహాలు చేసింది. మిగారుడు ఆమెను బ్రతిమిలాడి ప్రయాణాన్ని విరమింపజేశాడు ప్రయాణాన్ని విరమించుకోవడానికి ఆమె ఒక నిబంధన విధించింది - ధార్మిక విషయాల్లో తనకు పూర్తి స్వేచ్ఛ ఉండాలని మిగారుడు అంగీకరించాడు

ఆ మరునాడు విశాఖ బుద్ధుణ్ణి తన ఇంటికి ఆహ్వానించింది బుద్ధుడు చేసిన ధర్మప్రసంగం విన్నాక మిగారుడు ఆనందం పట్టలేక విశాఖ దగ్గరకు వచ్చి "నీవు నా కోడలు కాదు నన్ను కాపాడిన తల్లివి" అని ఆమె పాదాలకు నమస్కారం చేశాడు. అతడు, అతని భార్య కూడా బుద్ధునికి శిష్యులయ్యారు. ప్రవచనం అయ్యాక విశాఖ బుద్ధునికి ప్రణమిల్లి ఎనిమిది వరాలు కోరింది

1 నేను బ్రతికినంత కాలం భిక్షువులకు వర్షఋుతువులో వస్త్రదానం, 2 శ్రావస్తికి వచ్చే భిక్షువులకు అన్నదానం, 3 శ్రావస్తి నుండి వెళ్ళిపోతున్న భిక్షువులకు అన్నదానం, 4. అస్వస్థులైన భిక్షువులకు పథ్యాహారదానం 5. అస్వస్థభిక్షువుల సేవలు చేసేవారికి అన్నదానం, 6 అస్వస్థభిక్షువులకు ఔషధదానం, 7 అన్నం గంజి దానం, 8. భిక్షుణిలకు స్నానవస్త్రాల దానం - ఇవి చేయడానికి అనుమతి కోరింది. బుద్ధుడు అంగీకరించాడు ఆనాటి నుండి ఆమె భిక్షు

సంఘానికి కల్పవృక్షంలాగా కన్నతల్లిలాగా అయ్యింది. కాలాంతరంలో ఆమె సూచనల మేరకు కొన్ని భిక్షు నియమాలను వినయపిటకంలో చేర్పడం కూడా జరిగింది భిక్షుణిల మధ్య పొరపొచ్చాలు వచ్చినప్పుడు విశాఖయే మధ్యవర్తిగా ఉండి సమస్యలను పరిష్కరించేది.

ఒకనాడు విశాఖ శ్రావస్తిలోని జేతవన విహారానికి బయలుదేరింది. తండ్రి తనకు పెండ్లి కానుకగా ఇచ్చిన అతి విలువైన వస్త్రాన్ని తొలిసారిగా ధరించి వెళ్ళింది. దారి మధ్యలో ఆమె మనస్సు మార్చుకొంది. విహారంలోని బుద్ధుని సన్నిధికి ఇలా ఆడంబరంగా పోవడం బాగుండదని భావించి మామూలు చీర తెప్పించుకొని దాన్ని ధరించి ఆ అతి విలువైన వస్త్రాన్ని చుట్టజుట్టి తన పరిచారిక చేతికిచ్చింది. విహారం నుండి ఇంటికి తిరిగి వస్తున్న సమయంలో పరిచారిక దాన్ని మరచి అక్కడే వదలి పెట్టింది దారి మధ్యలో జ్ఞాపకం వచ్చి జరిగిన పొరబాటును విశాఖకు చెప్పింది "ఆ వస్త్రాన్ని ఆనందులవారు ఇంకా ముట్టని పక్షంలోనే దాన్ని తీసుకొని రా" అని విశాఖ చెప్పి పంపింది. పరిచారిక వచ్చేసరికే ఆనందుడు ఆ అపూర్వమైన వస్త్రాన్ని తీసి బుద్ధునికి చూపాడు "ఇది విశాఖదై ఉంటుంది భద్రపఱచి మళ్ళీ ఆమెకు అందజేయి" అని బుద్ధుడు చెప్పాడు

విశాఖ దాన్ని తీసుకోవడానికి నిరాకరించింది "ఇది ఇక సంఘం సొత్తు నాది కాదు కనుక దీన్ని అమ్మి ఆ వచ్చిన ధనంతో సంఘానికి ఏమి చేయాలో సెలవిస్తే అది నేను చేస్తాను" అని విన్నవించింది బుద్ధుడు ఆలోచించి ఊరికి తూర్పుగా ఒక ఆరామాన్ని కట్టించుమని చెప్పాడు. ఆమె పరమానందం చెందింది మహాధనికులున్న శ్రావస్తి నగరంలో ఆ వస్త్రాన్ని కొనడానికి ఎవరూ ముందుకు రాలేదు అంతటి విలువైన వస్త్రమది! చివరకు విశాఖయే దాన్ని కొనుక్కొంది ఆ వస్త్రం ధరగా సంఘానికి ఇచ్చిన ధనంతో ఒక చక్కని విశాలమైన సుందరమైన ఆరామం పూర్వారామం పేరుతో వెలసింది. ఆ ఆరామ నిర్మాణం వల్ల కలిగిన పుణ్యంలో సగభాగాన్ని విశాఖ తన పరిచారికకు ధారబోసింది పరిచారిక మతిమరుపు

వల్లనే కదా ఆ ఆరామం వెలసింది ! విశాఖ నిర్మించిన ఆ ఆరామానికి ఒక విశిష్టత ఉంది బుద్ధుడు తన 45 ఏండ్ల సుదీర్ఘ ధర్మచక్ర ప్రవర్తన కాలంలో ఆరు వర్షఋతువులను ఆ ఆరామంలో గడిపాడు

ఒకనాటి సమావేశంలో విశాఖను గురించి ప్రస్తావన వచ్చినప్పుడు బుద్ధుడు ఆమెను ప్రశంసిస్తూ క్రింది శ్లోకం చెప్పాడు

**యథాపి పుష్పరాశేః కుర్యాత్ మాలాగుణాన్ బహూన్**
**ఏవం జాతేన మర్త్యేన కర్తవ్యం కుశలం బహు** **4-10**

నేర్పరియైన మాలాకారుడు (expert florist), పుష్పముల రాశినుండి చక్కని పూలదండలు ఎన్నియో చేయునట్లుగానే మానవుడైనవాడు తనకు ప్రాప్తించిన సంపద ద్వారా ఎన్నియో పుణ్యసుమమాలలను విశాఖవలె చేయవచ్చును.



# ఆనందుని ప్రశ్న

జేతవనంలో ఒకనాడు బుద్ధుని ప్రధాన సేవక శిష్యుడైన ఆనందునికి ఒక సంశయం కలిగింది వెంటనే బుద్ధుని దగ్గరకు వెళ్ళి తన సంశయాన్ని వ్యక్తం చేశాడు "లెక్కించడానికి వీలుకాని కల్పాలు ఎన్నో గడిచాయి. కొన్ని కల్పాలు బుద్ధులు అవతరించని అంధకార కల్పాలుగా ఉంటాయి కొన్ని కల్పాలు ఐదుమంది బుద్ధులు అవతరించిన మహాభద్ర కల్పాలుగా ఉంటాయి. అలాంటి మహా భద్రకల్పమే ఇప్పటి కల్పమని పెద్దలంటారు. మీకు ముందు అనేకమంది బుద్ధులు అవతరించారు మీ తరువాత కూడా అనేకమంది బుద్ధులు అవతరిస్తారు మరి వీరందరి ఉపదేశాలు ఒక తీరుగా ఉంటాయా భిన్న భిన్నంగా ఉంటాయా?"

సమాధానంగా బుద్ధుడు క్రింది మూడు శ్లోకాలను చెప్పాడు

**సర్వపాపస్యాకరణం కుశలస్యోపసంపదా**
**స్వచిత్తపర్యవదాపనం ఏతత్ బుద్ధానాం శాసనమ్** **14-5**

పాపకర్మలను చేయకుండుట, కుశలకర్మలను (పుణ్యకర్మలను) చేయుట, చిత్తశుద్ధిని సంపాయించుట - ఇదియే బుద్ధులందరి ఉపదేశం

***క్షాంతిః పరమం తపస్తితిక్షా నిర్వాణం పరమం వదంతి బుద్ధాః***
***నహి ప్రవ్రజితః పరోపఘాతీ శ్రమణో భవతి పరం విహేఠయన్*** **14-6**

క్షాంతి, తితిక్ష కలిగియుండుటే గొప్ప తపస్సు నిర్వాణమే పరమ పురుషార్థము నిర్వాణాభిలాషి అహింసాశీలుడుగా ఉంటాడు హింసించే స్వభావమున్నవాడిని నిర్వాణాభిలాషిగా చెప్పకూడదు

***అనుపవాదో౽ నుపఘాత: ప్రాతిమోక్షే చ సంవర:***
***మాత్రజ్ఞతా చ భక్తే ప్రాంతం చ శయనాసనమ్***
***అధిచిత్తే చ యోగ ఏతద్ బుద్ధానాం శాసనమ్*** **14-7**

ఇతరులను నిందించుట, అపకారమొనర్చుట చేయనివాడు, ప్రాతిమోక్షా సూత్రాలను (భిక్షు నియమాలను) పాటించడం ద్వారా తనను నియమించుకొనువాడు, మితాహార పరిమితిని ఉల్లంఘించనివాడు, ఏకాంతమున శయనించువాడు, ఉన్నతమైన ధ్యాన భూమికలందు మనస్సును పెట్టినవాడు భిక్షువనబడును ఇదియే అందరి బుద్ధుల ఉపదేశం

మరొక దినం ఆనందునికి మరో సంశయం కలిగింది "జాతి గుఱ్ఱాలకు సింధూదేశం ప్రసిద్ధి అలాగే ఉత్తమజాతి ఏనుగులకు, పశువులకు ఆయా దేశాలు ప్రసిద్ధికెక్కాయి. మరి ఉత్తమ మానవులకు ఏ దేశం ఏ కాలంలో ప్రసిద్ధి?"

దీనికి సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

***దుర్లభ: పురుషా జానే యో న న సర్వత్ర జాయతే***
***యత్ర స జాయతే ధీర: తత్ కులం సుఖమేధతే*** **14-15**

ఉత్తమ మానవుడు దుర్లభం. అన్నిచోట్ల కనబడడు. ఏ కులంలో ఉత్తముడు జనిస్తాడో ఆ కులం అతని ప్రభావం వల్ల వర్ధిల్లుతుంది

మరొకనాడు ఆనందుడు జేతవనంలో ఏకాంతంగా కూర్చొని ఇలా ఆలోచించాడు "పుష్పాలు, చెట్లు, మూలికలనుండి పరిమళాలు వ్యాపిస్తాయి. కానీ గాలి వీచిన వైపునకే వ్యాపిస్తాయి గాలికి ఎదురుగా వ్యాపించవు గాలివాటు మీద ఆధారపడకుండా అన్ని దిక్కులకు వ్యాపించే పరిమళం ఏదైనా లోకంలో వుందా?" అని ప్రశ్న లేవదీసుకొని అక్కడ్నుంచి లేచి బుద్ధుని సేవకు వెళ్ళాడు బుద్ధుని చూడగానే ఆయన తన ప్రశ్నకు ఎలా సమాధానం చెప్తాడో వినాలని ఆ ప్రశ్న వేశాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా బుద్ధుడు "స్వార్థచింతనను వీడి కేవలం లోకహితాన్ని లక్ష్యంగా పెట్టుకొని ఆ లక్ష్యసాధనలో భాగంగా దానపారమిత (perfection in giving), శీలపారమిత, వీర్యపారమిత, ధ్యానపారమిత, ప్రజ్ఞాపారమితలను గడించే సాధుజనుల కీర్తిపరిమళాలు అన్ని దిక్కులకు వ్యాపిస్తాయి దేవాది లోకాలకు కూడా వ్యాపిస్తాయి" అని చెప్పి క్రింది రెండు శ్లోకాలను పఠించాడు.

*న పుప్పగంధః ప్రతివాతమేతి*
*న చందనం తగరమల్లికా వా*
*సతాం చ గంధః ప్రతివాతమేతి*
*సర్వాదిశః సత్పురుషః ప్రవాతి* **4-11**

పుష్ప పరిమళాలు గాలికి ఎదురుగా వ్యాపించవు చందనగంధం, అగరుగంధం, మల్లెపుష్పాలగంధం కూడా గాలికి ఎదురుగా పోజాలవు సత్పురుషుల కీర్తి పరిమళాలు మాత్రమే గాలికి ఎదురుగా కూడా పోగలిగి అన్ని దిక్కులూ వ్యాపిస్తాయి.

*చందనం తగరం వాపి ఉత్పలం అథ వార్షికీ*
*ఏతేషాం గంధజాతానాం శీలగంధో ఉ నుత్తరః* **4-12**

చందనం, అగరు, కమలం, మల్లె మొదలగు పరిమళాల కంటే శీలసంపత్తిపరిమళం మిక్కిలి శ్రేష్ఠమైనది



# ఆనందశ్రేష్ఠి

శ్రావస్తి నగరంలో ఆనందశ్రేష్ఠి అనే మహాధనికుడుండేవాడు. 80 కోట్ల ఆస్తిపరుడైనా చాలా పిసినారి ఈ పిసినారితనాన్ని సహించలేక అతని కుమారుడు మూలాశ్రీ "నాన్నా, ఇంత పెట్టుకొని కూడా ఈ పిసినారితనం ఎందుకు?" అని తప్పుపట్టాడు

"మనకున్నది ఎక్కువేమీ కాదు దానధర్మాలు చేస్తే కర్పూరంలా కరిగిపోతుంది ఉన్నదాన్ని పెంచుకొంటూనే వుండాలితప్ప తగ్గించుకోరాదు" అని తన సిద్ధాంతాన్ని ఆనందశ్రేష్ఠి వినిపించాడు. కుమారుడు ఆస్తిని దుబారా చేస్తాడనే సందేహంతో అతనికి తెలియకుండా ఐదు బిందెల బంగారాన్ని ఒక మూల పూడ్చిపెట్టాడు

ఆనందశ్రేష్ఠి చనిపోయాక ఒక బిచ్చగాళ్ళ ముఠాలో వున్న స్త్రీ గర్భంలో ప్రవేశించాడు ఆ స్త్రీ, గర్భం ధరించిన రోజునుండి ఆ ముఠాకు ఆదాయం పడిపోయింది అకస్మాత్తుగా ఆదాయం పడిపోవడంతో ఆ ముఠా నాయకులకు అనుమానం వచ్చి "మన మధ్యలో ఎవడో పరమ దౌర్భాగ్యుడున్నాడు కనుక్కోవాలి" అని ముఠాను విభజన చేసి బిచ్చమెత్తడానికి పంపి పరీక్ష చేశారు ఈ పరీక్షల వల్ల చివరికి దౌర్భాగ్యానికి కారణం ఆ గర్భిణీ స్త్రీ అని తేలిపోయి ఆమెను ముఠా నుండి వెళ్లగొట్టారు

ఆమె శ్రావస్తిలో బిడ్డను ప్రసవించి బిచ్చమెత్తుకుంటూ జీవనం సాగించింది ఆమె ఒక సత్యాన్ని అనుభవం ద్వారా తెలుసుకొన్నది. పరమ అనాకారుడైన తన బిడ్డను కూడా తీసుకొనిపోతే చిల్లిగవ్వకూడా దొరకదు ఒంటరిగా పోతే చాలినంత

లభిస్తుంది. కనుక ఆ అనాకారుణ్ణి ఎక్కడో ఒకచోట వదలిపెట్టి ఒంటరిగానే బిచ్చమెత్తడానికి పోయేది.

ఆ పిల్లవాడు కొంత ఎదిగాక మెల్లగా అతనికి పూర్వజన్మ స్మృతి కలగడం మొదలయ్యింది. ఒకనాడు ఆ అనాకారుడు శ్రావస్తిలో తన పూర్వజన్మకు చెందిన ఇంటిని గుర్తించి లోపలికి వెళ్ళాడు అక్కడున్న వాళ్ళందరూ ఇతణ్ణి చూసి వింతపురుగును చూసి బెదిరినట్లుగా బెదిరినారు "ఇది నా ఇల్లు" అని అతను అరుస్తున్నా పట్టించుకోకుండా అతణ్ణి బైటకు నెట్టివేశారు.

అప్పుడు ఆ దారిన పోతున్న బుద్ధుడు విషయమంతా గ్రహించి మూలాశ్రీని పిలిచి "ఇతడు నీ తండ్రి ఆనందశ్రేష్ఠి" అన్నాడు

బుద్ధుడి మాటలను పరమ ప్రమాణంగా తీసుకొనే మూలాశ్రీ ~~ఈ~~ మాటలు మాత్రం నమ్మలేకపోయాడు. అప్పుడు బుద్ధుడు ఆ పిల్లవాణ్ణి ఐదు బిందెల బంగారాన్ని దాచిన చోటును మూలాశ్రీకి చూపమన్నాడు పిల్లవాడు చూపాడు. పునర్జన్మ ఎంత సత్యమో మూలాశ్రీ గ్రహించి ఆశ్చర్యపోయాడు.

ఆ సందర్భంలో బుద్ధుడు క్రింది శ్లోకం చెప్పాడు.

**పుత్రా మే సంతి ధనం మే ఽ స్తి ఇతి బాలో విహన్యతే**
**అత్మా హి ఆత్మనో నాస్తి కుతః పుత్రః కుతో ధనమ్** 5-3

"నాకు కొడుకులున్నారు, ధనం వుంది" అని ఆసక్తచిత్తులైన అజ్ఞానులు క్లేశములచే బాధింపబడుచున్నారు. తనకు తానే లేనప్పుడు ఇక కొడుకులు, ధనం తనదెట్లవుతుంది?"



# ఉదయి

ఉదయి చాలా చిత్రమైన వ్యక్తి. భిక్షువు అయ్యాడేగానీ భిక్షు నియమాలను పాటించడంలోగానీ, బుద్ధుని ప్రవచన సూత్రాలను అధ్యయనం చేయడంలోగానీ కించిత్ శ్రద్ధను కూడా చూపేవాడు కాదు అతడిని సరిచేయడానికి శారిపుత్రుడంతటి వాడు ప్రయత్నించి సాధ్యం కాదని వదలిపెట్టేశాడు మరీ తలవంపులు తెచ్చే పని ఏదీ అతడు చేయలేదు కనుక భిక్షుసంఘం నుండి బహిష్కృతుడు మాత్రం కాలేదు చదువు శూన్యం, సాధన శూన్యం అయినా డాంబికాలు పలుకడంలో చాలా నేర్పును చూపేవాడు

ఆ ఊరిలో ఒక ఉపన్యాస వేదికనుండి బుద్ధుని ప్రముఖ శిష్యులైన శారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు, మహాకాశ్యపుడు, ఉపాలి* మొ॥వారు అప్పుడప్పుడు ధర్మప్రవచనాలు చేసేవారు కనుక ఆ వేదికను ఎక్కి ఉపన్యసించడానికి చిన్నవాళ్ళెవరూ సాహసించేవాళ్ళు కారు ఆ సాహసం ఒక్క ఉదయికి మాత్రమే సాధ్యమయ్యేది.

---

* శాక్యరాజపుత్రులు ఆనందుడు, అనురుద్ధుడు, దేవదత్తుడు, రేవతుడు మొ॥వారు భిక్షు సంఘంలో చేరదలచి బుద్ధుని దగ్గరకు వచ్చినప్పుడు వారి సేవకుడైన ఉపాలి కూడా వారితో కలసి భిక్షుసంఘంలో చేరడానికి వారి అనుమతితో వచ్చాడు. భిక్షు సంఘంలో ఎవరు ముందు ప్రవేశిస్తారో వారు తరువాత చేరినవారలకంటే పెద్దగా పరిగణించడం జరుగుతుంది - తరువాత చేరినవారు వయస్సులో విద్యలో కులంలో పెద్దవారుగా ఉన్నప్పటికీ శాక్యయువకులు భిక్షుసంఘంలో చేరి తమ అహంకారాన్ని తగ్గించుకోదలచారు కనుక ముందు తమ సేవకుణ్ణి ఉపాలిని చేరమన్నారు ఆ తరువాత వారందరు చేరి అతనికి నమస్కారం చేశారు ఉపాలి క్షురకర్మ చేసే వర్గానికి చెందినవాడు అయినప్పటికీ భిక్షుసంఘంలో ఒక ప్రముఖుడుగా గుర్తింపు పొందాడు వినయ పిటక పాలకుడుగా ఆయన విధులు నిర్వర్తించేవాడు ఈ పుస్తకంలో 41వ కథ కుమార కాశ్యపుని తల్లి కథ ద్వారానూ అతని ప్రాముఖ్యం ఏమిటో పాఠకులకు తెలుస్తుంది

పెద్ద శిష్యులెవ్వరూ ఊరిలో లేని సమయాలు చూచుకొని ఉదయి తన ఉపన్యాసం పెట్టుకొనేవాడు. ధర్మం గురించి ఒక ముక్క కూడా చెప్పేవాడు కాదు అమాయకులైన శ్రోతలు ఆశ్చర్యంతో నోరు తెరచుకొని వినేలా అద్భుతంగా డాంబికాలు పలికేవాడు. "ఒకసారి నేనూ ఉపాలీ అడవిలో పోతున్నాము. ఒక పెద్దపులి గాండ్రిస్తూ పొదనుండి మా వైపునకు దూసుకొచ్చింది నేను మెరుపు మెరిసినంత వేగంతో ఉపాలి ముందుకు పోయి నిలబడి 'బుద్ధం శరణం గచ్ఛామి' అని పులిని చూశాను. అంతే అది గంగిగోవులా అయిపోయి మళ్ళీ పొదలోకి వెళ్ళిపోయింది ఉపాలి అంతటివాడు కూడా ఈ సంఘటనకు ఆశ్చర్యపోయి 'ఆధ్యాత్మిక తేజస్సంపన్నుడవయ్యా' అని నన్ను చాలా మెచ్చుకొన్నాడు. ఒకసారి ఏమయ్యిందంటే నేను జేతవనంలో తథాగతుల వారి కుటీరం ముందున్న రావిచెట్టు క్రింద ధ్యానంలో కూర్చొని 'నైవసంజ్ఞానాసంజ్ఞాస్థాయి' వరకు పోయాను ఇంకా పైకి పోతే మళ్ళీ దిగిరావడం కొంచెం కష్టమవుతుందని ధ్యానాన్ని ఆపి కళ్ళు తెరచి అలానే కూర్చున్నాను ఇంతలో మగధ దేశరాజైన బింబిసారుడు పంపిన ప్రత్యేక రాజదూతలు ఆహ్వాన పత్రికను తెచ్చి నా పాదాల ముందుంచి సాష్టాంగ నమస్కారం చేశారు ఇదేమిటని నేను ఆశ్చర్యపోయి ఆ ఆహ్వాన పత్రికను తెఱచి చూడగా అది తథాగతులవారికి బింబిసారుడు పంపిన ఆహ్వానలేఖ అని తెలిసి వారు చేసిన పొరబాటుకు విచారించి వారిని మందలిస్తూ 'తథాగతులవారిని గుర్తించలేనంతటి మందభాగ్యులా మీరు? ఆయన లోపల కుటీరంలో ఉన్నారు. నేను ఆయన శిష్యపరమాణువును' అని చెప్పాను 'మీ ముఖకాంతిని, తేజస్సును చూచి మిమ్మల్ని తథాగతులనుకొన్నాము క్షమించండి' అని వాళ్ళు మళ్ళీ సాష్టాంగ నమస్కారం చేసి సెలవు తీసుకొన్నారు" ఈ ధోరణిలో ఎప్పటికప్పుడు కల్పించిన వింత సంఘటనల మయంగా అతని ఉపన్యాసం సాగేది

ఒకనాడు ఉదయి వేదిక మీద ఉపన్యాసం ముగించి దిగివస్తుండగా అప్పుడే అక్కడకు వచ్చి చేరిన దూరదేశ భిక్షువులు అతడిని సమీపించి తమ

సంశయాన్ని తీర్చమని వేడుకొని అతను సరే అని తల ఊపాక "అవిజ్ఞప్తికర్మ, రూపస్కంధంలో చేరుతుందా సంస్కారస్కంధంలో చేరుతుందా?" అని చాలా జటిలమైన ప్రశ్న వేశారు వాళ్ళు చాలా జిజ్ఞాసతోనే అడిగారు - అతని సత్తా తెలియక. కొన్ని క్షణాల్లోనే అతడు వట్టి మూర్ఖుడని తేలిపోయాక వాళ్ళు బుద్ధుడి దగ్గరకు పోయి "మీ సన్నిధిలో ఇన్నేండ్లు ఉండీ ఆ ఉదయి అలా మూర్ఖుడుగానే ఎందుకున్నాడు?" అని ప్రశ్నించారు సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు.

**యావజ్జీవమపి చేద్ బాల: పండితం పర్యుపాస్తే**
**న స ధర్మం విజానాతి దర్వీ సూపరసం యథా** 5-5

మూర్ఖుడైనట్టివాడు యావజ్జీవం పండితుని సన్నిధిలో జీవితం గడిపినా ధర్మాన్ని తెలుసుకొనలేడు - వంటకాలకు చాలా సన్నిహితంగా ఉన్న గరిటె ఆ వంటకాల రుచిని గ్రహించగలుగుతుందా? అలానే మూర్ఖుడున్నూ



# కర్షకుడు

ఒక ధనికుని ఇంటికి కన్నం వేసి చోరులు విలువైన వస్తువులను, ధనాన్ని తీసుకొని ఒక పొలం గట్టుకు వెళ్ళి పంచుకొని అక్కడ్నుంచి వెళ్లిపోయారు తొందర వల్ల ఒక వేయి రూకల సంచిని వారు అక్కడ జారవిడిచారు కొంతసేపటికి తెల్లవారింది. ఆ పొలాన్ని దున్నడానికి ఒక కర్షకుడు వచ్చి పనిలోకి దిగాడు

ఆనందుడు వెంటరాగా బుద్ధుడు ఆ పొలం గట్టుమీద నడిచివెళ్తూ ఆ సంచిని చూశాడు "ఆనందా ఇటు చూడు ఈ విషసర్పాన్ని" అన్నాడు.

"అవును బుద్ధదేవా! నిజంగా చాలా విషం వున్న సర్పం ఇది" అన్నాడు ఆనందుడు

ఈ సంభాషణ విన్న రైతు వారిద్దరూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాక కుతూహలంతో వెళ్ళి చూశాడు అక్కడ విషసర్పం లేదు. ధనం సంచి వుంది. పరమానందంగా దాన్ని తీసుకొని ,ఒక పొద దగ్గరకు వెళ్ళి, దాచిపెట్టి మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యాడు.

దొంగతనం జరిగిన ఇంటి యజమాని కొందరిని వెంటబెట్టుకొని దొంగలను పట్టుకొనే ప్రయత్నంలో అడుగుజాడలు, వారూ వీరూ చెప్పిన సమాచారం ఆధారంగా ఆ పొలం దాకా వచ్చాడు అక్కడ గనిమనుండి అడుగుల గుర్తులు పొద వరకు వుండడం కనిపెట్టి ఆ పొదను శోధించి చూశాడు ధనం సంచి కనపడింది ఆ కర్షకుడే దొంగ అని నిర్ణయించి అతణ్ణి బంధించి రాజు ముందు నిలబెట్టాడు కర్షకుడికి మరణశిక్ష పడింది.

రాజభటులు అతణ్ణి వధ్యశాలకు తీసుకొనిపోతుండగా అతడు మాటి

మాటికి "ఆనందా ఇటు చూడు ఈ విషసర్పాన్ని  అవును బుద్ధదేవా నిజంగా చాలా విషం వున్న సర్పం ఇది'' అనడం మొదలుపెట్టాడు

రాజభటులకేమీ అర్ధం కాలేదు.  అతణ్ణి అడిగినా ఏమీ చెప్పడం లేదు ఏడుస్తూ మళ్ళీ అదే సంభాషణ వల్లించడం మాత్రం మానలేదు   రాజుగారి ముందుకు మళ్ళీ అతణ్ణి తీసుకొనిపోయి అతని వింత ధోరణిని వివరించారు. రాజుగారి ప్రశ్నకు కూడా అతడు పిచ్చిగా ఆ సంభాషణే పలుకుతున్నాడు  రాజు ఆలోచించి ఆ కర్షకుణ్ణి వెంటబెట్టుకొని బుద్ధుడున్న విహారానికి వెళ్లాడు

బుద్ధునితో మాట్లాడిన తరువాత ఆ కర్షకుడు దొంగ కాదని తెలిసి అతణ్ణి వదలిపెట్టి బుద్ధునితో "మీ సాక్ష్యం లేకపోతే అతనికి ప్రాణాలు దక్కివుండేవి కావు'' అన్నాడు.

అప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

**న తత్ కర్మ కృతం సాధు యత్ కృత్వా ఽ నుతప్యతే**
**యస్యాశ్రుముఖో రుదన్ విపాకం ప్రతిసేవతే** 5-8

ఏ పని చేసిన తరువాత ఆ పని ఇచ్చిన ఫలితానికి పశ్చాత్తాపంతో తపిస్తూ కన్నీళ్ళు నిండిన ముఖంతో ఏడుస్తూ వుండవలసివస్తుందో అట్టి పని సరియైన పనిగా వుండజాలదు



# గృహపతి చిత్తుడు

బుద్ధుని ప్రథమ శిష్యులలో ఒకడైన మహానాముని ప్రభావంచే గృహస్థుడైన చిత్తుడు ధర్మం వైపు మరలి తన మామిడితోపును ఒక విహారంగా మార్చివేసి దానిని సుధర్ముడనే భిక్షువుకు అప్పజెప్పాడు

సిద్ధార్థుడు జననమొందినప్పుడు ఆ శిశువు లక్షణాలను చూసి భవిష్యత్తులో అతడు చక్రవర్తియైనా అవుతాడు లేదా బుద్ధుడైనా అవుతాడని జోస్యం చెప్పిన ఐదుమంది బ్రాహ్మణులలో ఒకరి కుమారుడే మహానాముడు. తక్కిన బ్రాహ్మణుల కుమారులైన భద్రుడు, వప్రుడు, అశ్వజిత్తు మరియు కౌండిన్యుడు (వికల్పానికి తావు ఇవ్వకుండా సిద్ధార్థుడు బుద్ధుడే అవుతాడు అని జోస్యం చెప్పిన బ్రాహ్మణుడు) ఈ ఐదుగురు సిద్ధార్థుడు ఉరువేలలో కఠోరతపస్సు చేస్తున్న సమయంలో శిష్యులుగా వచ్చి చేరుతారు. కానీ సిద్ధార్థుడు కఠోర తపస్సు నష్టదాయకం అని తెలుసుకొని దాన్ని వదలి మధ్యేమార్గాన్ని చేపట్టినప్పుడు ఈ ఐదుమంది శిష్యులు సిద్ధార్థుడు పతనమైనాడని భావించి ఆ చోటు వదలి వారణాసికి సమీపంలో మృగదావం అనే వనాన్ని తమ తపోభూమిగా చేసుకొంటారు.

సిద్ధార్థుడు గయలో బోధివృక్షం క్రింద బుద్ధుడయ్యాక ఆ ఐదుమందిని అర్హులుగా భావించి వారున్న చోటికి పోయి తాను కనుక్కొన్న ముక్తిమార్గాన్ని బోధిస్తాడు. బుద్ధుని ప్రథమ శిష్యులుగా ఆ ఐదుగురు ప్రసిద్ధికెక్కారు వారిలో ఒకడైన అశ్వజిత్ ప్రభావంచే శారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు సంఘంలో చేరిన విషయం శారిపుత్రుని కథలో (4వ కథలో) పాఠకులు గమనించి ఉంటారు.

ఒకనాడు చిత్తుడు తన ఇంటికి శారిపుత్రుణ్ణి, మౌద్గల్యాయనుణ్ణి భిక్షకు

ఆహ్వానించాడు తన మామిడితోపు విహారాన్ని చూసుకొంటున్న సుధర్ముణ్ణి కూడా ఆహ్వానించాడు శారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు ఇద్దరూ గొప్ప వ్యక్తిత్వ లక్షణాలు కలిగినవారు గనుక సహజంగానే చిత్తుడు వారి ఎడల ప్రత్యేకమైన భక్తి, వినయం, గౌరవం చూపాడు సుధర్ముడికి ఇది బాధ కలిగించింది. 'నేను వారికి సమానుడైన భిక్షువునై వుండీ నా ఎడల ఈ చిత్తుడు వ్యత్యాస వైఖరి ప్రదర్శించాడు 'ఇతను కట్టిచ్చిన విహారంలో ఇక ఒక క్షణం ఉండరాదు'' అనుకొని అక్కడ్నుంచి జేతవనం వెళ్లిపోయాడు

చిత్తుని విహారాన్ని వదలి జేతవనం చేరిన సుధర్ముణ్ణి బుద్ధుడు చెంతకు పిలిచి అతని చర్య సరికాదని చెప్పాడు. శ్రద్ధ, దానం, శీలం మొదలగు సద్గుణాలు కలిగిన చిత్తుణ్ణి అది చిన్నబుచ్చినట్లవుతుందని చెప్పాడు "ఇది నా విహారం, వీరు నా శిష్యులు'' అనే ఆసక్తి పెంచుకోకుండా "నేను గొప్పవాణ్ణి'' అనే అభిమానాన్ని పెంచుకోకుండా వుంటేనే అధ్యాత్మమార్గంలో ముందుకు పోవడం వీలవుతుంది అని హితబోధ చేసి సుధర్ముణ్ణి మళ్ళీ అదే విహారానికి పోయి సాధన చేసుకోమని చెప్పిన సందర్భంలో క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు

**అసద్భావనమిచ్ఛేత్ పురస్కారం చ భిక్షుషు**
**ఆవాసేషు చైశ్వర్యం పూజా పరకులేషు చ** 5-14

**మమైవ కృతం మన్యేతాం గృహి ప్రవ్రజితావుభౌ**
**మమైవాతివశాః స్యాతాం కృత్యాకృత్యేషు కేషుచిత్**
**ఇతి బాలస్య సంకల్ప ఇచ్ఛా మానశ్చ వర్ధతే** 5-15

ప్రశంసనీయ గుణాలు తనయందు లేకపోయినా మూర్ఖభిక్షువు ఇతరుల ప్రశంసలను అపేక్షించుచుండును భిక్షువులలో అగ్రపూజ తనకే జరగాలని కోరుకొనుచుండును ఆరామాల మీద, విహారాల మీద అధికారమును

వాంఛించుచుండును. తనకు సంబంధించని వారినుంచి కూడా పూజా సత్కారాలను అభిలషించుచుండును. తనవల్లనే అన్ని పనులు జరుగుతున్నాయని గృహస్థశిష్యులు, భిక్షువులు భావించవలెనని కోరుకొనుచుండును చిన్న పనులు పెద్ద పనులు అన్నిటియందు వారు తన అదుపు ఆజ్ఞలలో మెలగవలెనని ఆశించుచుండును ఇలాంటి సంకల్పములతో (thoughts) ఆ మూర్ఖుడు తనలో లోభాన్ని (greed), మానాన్ని (pride) పెంచుకొని అధోగతి పాలగును



# వనవాసి తిస్సుడు

శ్రావస్తిలోని ఒక ధనికుని కుమారుడు తిస్సుడు. ఆ ధనికుడు బుద్ధుని ప్రధాన శిష్యుడైన శారిపుత్రుని ఎడల విశేష గౌరవభావం కలవాడై ఆయనను తన ఇంటికి అనేకసార్లు భిక్షకు పిలిచి ధర్మ ప్రవచనాలు కూడా చెప్పించుకొనేవాడు చివరకు తన ముద్దుబిడ్డణ్ణి కూడా శారిపుత్రుడికి అప్పజెప్పాడు.

తిస్సుడు బాల్యం నుండే శారిపుత్రుని దగ్గర చక్కని శిక్షణ పొందినాడు జేతవన విహారం వచ్చేపోయే వాళ్ళతో ఎప్పుడూ సందడిగా ఉండడం చేతనూ, తన పూర్వాశ్రమ బంధువులు, స్నేహితులు చీటికి మాటికి తనను చూడడానికి వచ్చి అనేక కానుకలు సమర్పించిపోతుండడము చేతనూ తిస్సునికి చీకాకు వేసి సుదూరంగా ఒక మారుమూల కుగ్రామంలోని విహారానికి బస మార్చాడు

ఆ చిన్న గ్రామంలో లభించిన భిక్షతో తృప్తిపడి ఏకాంతవాసం చేస్తూ మోక్షోపాయంగా శారిపుత్రుడు బోధించిన ధర్మ విశ్లేషణ పద్ధతులను మననం చేసుకొంటూ తపోజీవనం సాగించాడు

ఆ గ్రామ జనులు ఎవరైనా బోధ కోసం వస్తే ముక్తసరిగా "సుఖీభవ, దుఃఖనిర్ముక్తో భవ" అని చెప్పి పంపించేసేవాడు ఈ రెండు మాటలు తప్ప ఇంకేదీ అతని నోటినుండి ఆ గ్రామ ప్రజలు వినింది లేదు

తన ప్రియశిష్యుడు ఎలా ఉన్నాడో చూడడానికి ఒకనాడు శారిపుత్రుడు మౌద్గల్యాయనుని వెంటబెట్టుకొని ఆ గ్రామానికి వచ్చాడు వారి రాకకు గ్రామ ప్రజలు పొంగిపోయారు బుద్ధుని అగ్రశ్రావకులిద్దరూ ఒకే సమయంలో తమ గ్రామానికి రావడం వాళ్ళను ఆశ్చర్యంలో ముంచివేసింది. ఆ మహదవకాశాన్ని

జారవిడుచుకోరాదని భావించి వెంటనే ఒక సభావేదికను ఏర్పాటు చేసి సాయంత్రం అగ్రశ్రావకుల ప్రవచనాలుంటాయని చుట్టుప్రక్కల పల్లెలకు కూడా వార్త పంపారు

ప్రవచనం వినడానికి వందలమంది గ్రామీణులు సభాస్థలికి వచ్చి ఆసీనులైనారు అందరూ ఉత్కంఠతో ఎదురు చూస్తున్నారు - "శారిపుత్రుడు మొదట ప్రసంగిస్తాడా లేక మౌద్గల్యాయనుడా?"

తీరా ప్రసంగ సమయానికి శారిపుత్రుని ఆజ్ఞ మేరకు వేదిక మీదికి తిస్సుడు పోయి కూర్చున్నాడు శ్రోతలలో కలకలం మొదలయ్యింది నిరాశతో గుసగుసలు మొదలుపెట్టారు "సుఖీభవ ఏం మాట్లాడుతాడని కూర్చోబెట్టారు? ఇక మనం ధర్మ ప్రవచనం విన్నట్టే!" ఇలా గొణుగుడు మొదలయ్యింది

తిస్సుడు భక్తిభావపూరిత సుమధుర స్వరంతో ప్రార్థనా శ్లోకాలు పఠించడం పూర్తయ్యేలోపుగానే గొణుగుడు నిలిచిపోయింది ఆ తరువాత రెండు గంటలపాటు గంగా ప్రవాహంలా అనర్గళంగా సాగిన ఆ మహోపన్యాసాన్ని శ్రోతలు చిత్తరువులవలె కదలక మెదలక ఆలకించారు "ఇంతటి పాండిత్యాన్ని ఎందుకిన్నాళ్ళు దాచిపెట్టుకొన్నాడు?" అని గ్రామీణులు ముక్కు మీద వేలు వేసుకొన్నారు స్కంధాలు, ఆయతనాలు, ధాతువులు, సంస్కృత ధర్మాలు, అసంస్కృత ధర్మాలు, కుశలాకుశలానేజ్య కర్మలు, భూతభౌతికాలు, చిత్తచైత్తాలు, చిత్త సంప్రయుక్త ధర్మాలు, చిత్త విప్రయుక్త ధర్మాలు, నాలుగు ఆర్యసత్యాలు, ద్వాదశాంగచక్రం, సంసారం, నిర్వాణం మొ॥ అనేక విషయాలతో కూడిన అభిధర్మకోశాన్నంతా కాచివడబోసి ఆ సారాన్ని తన రెండు గంటల ప్రవచనంలో తిస్సుడు శ్రోతలకు అందించి వీనుల విందు చేశాడు

జేతవనంలో కొన్నాళ్ళ తరువాత తిస్సుని ప్రస్తావన వచ్చింది అప్పుడు బుద్ధుడు తిస్సుని ప్రశంసిస్తూ ఇలా అన్నాడు · "లాభం-అలాభం, యశస్సు-అయశస్సు, ప్రశంస-నింద, సుఖం-దుఃఖం ఈ సాంసారిక ద్వంద్వాలనుండి బైట

పడినవాడికే నిర్వాణ మార్గ ద్వారం తెరుచుకొంటుంది తిస్సుడు లౌకిక లాభాలయందు విముఖుడైనందువల్లనే పరమార్థాన్ని అందుకోగలిగినాడు లోకహితాన్ని కాంక్షించి శారిపుత్రుడు అతడిని బైటకు లాగినాడు. లేకుంటే తిస్సుని గొప్పదనం ఏమిటో ఎవరికీ తెలిసియుండేది కాదు " చివరగా క్రింది శ్లోకాన్ని కూడా బుద్ధుడు పఠించాడు.

**అన్యా హి లాభోపనిషద్ అన్యా నిర్వాణగామినీ**
**ఏవమేతద్ అభిజ్ఞాయ భిక్షుర్బుద్ధస్య శ్రావకః**
**సత్కారం నాభినందేత్ వివేకమనుబృంహయేత్** **5-16**

లౌకిక లాభాల వైపు తీసుకొనిపోయే మార్గం (ప్రేయోమార్గం) వేఱు. నిర్వాణం వైపు తీసుకొనిపోయే మార్గం (శ్రేయోమార్గం) వేఱు. ఈ విభాగాన్ని బాగుగా తెలుసుకొని భిక్షువుగా ఉన్నవాడు లాభ సత్కార పూజలను అపేక్షించడం మానుకొని ఏకాంతవాసం, నిరాసక్తత ద్వారా వివేకాన్ని పెంచుకొని ముక్తిని పొందవలెను



*Last words of Buddha*

*"All things must decay Be deligent in striving for salvation "*

# శ్రమణ పండితుడు

అతని అసలు పేరు ఎవరికీ తెలియదు పండితుడని పిలుస్తుంటారు అతను మాట్లాడే మాటల్లో చీటికిమాటికి పండితపదం చేరడం వల్ల అతనికి పండితుడనే పేరు లోకులు తగిలించారు సాధారణంగా అతని మాటలు ఇలా ఉండేవి "పండితులు ఏమంటారంటే.. పండితుల కోణం నుండి చూస్తే.. పండితుల భావనను అనుసరించి..." ఇలా ప్రతి వాక్యంలో పండితపదం అతనికి ఒక ఊతపదంగా అయినందువల్ల ప్రజలు ఏకంగా అతనికి పండితుడని పేరిచ్చేశారు

ఒకనాడు అతను భిక్షాటన చేస్తూ రైతులు పొలాలకు నీళ్ళను మళ్ళిస్తున్న తీరును గమనించాడు. మనస్సులో ఇలా అనుకొన్నాడు "జలాలను నేర్పుతో రైతులు తమకు ఇష్టమైన రీతిలో మళ్ళించి పొలాలకు పోనిస్తున్న ఈ దృశ్యాన్ని చూచి పండితుడైనవాడు తెలుసుకొనవలసిన ముఖ్య విషయం ఉన్నది అది ఏమనగా రైతు నీళ్ళను మళ్ళించినట్లు పండితుడు తనను తాను మళ్ళించుకొనవలెను"

కొంతదూరం పోయాక అతనికి కంసాలివాళ్ళు వంగిపోయిన బాణాలను చక్కజేయడం గోచరించింది. "ఈ కంసాలివాళ్ళు వంకరటింకరగా ఉన్న బాణాలను చక్కజేయునట్లుగా పండితుడైనవాడు కుటిలంగా ఉన్న మనస్సును తనకు తానే సరిచేసుకొనవలెను" అని మనస్సులో అనుకొని ఇంకా ముందుకు పోయాడు

కొంతదూరం పోయాక వడ్రంగి పనివారు తమ పనిలో నిమగ్నులై ఉండటం చూచి ఇలా అనుకొన్నాడు "పనికిరాని చెక్కలు అని మనం అనుకొనే చెక్కలు వీళ్ళ చేతిలో పడి పనికివచ్చే అనేకవస్తువులుగా తయారవుతున్న విషయాన్ని పండితుడు గమనించి అశుచిప్రతిమయైన పనికిరాని ఈ దేహాన్ని, నిర్వాణ ఫలాన్ని

అందుకొనేందుకు పనికి వచ్చె నిచ్చెనగా చేసుకోవాలి."

ఈ విధంగా ఆ పండితుడు భావన చేసుకొని సాధనలో తీవ్రతను పెంచుకొన్నాడు మనో వాక్కాయ కర్మలన్నీ కుశల పక్షం వైపునకు మరలేలా జాగ్రత్తలు తీసుకొన్నాడు మనస్సు నుండి కౌటిల్యాన్ని పూర్తిగా కడిగివేసుకొని సరళం చేసుకొన్నాడు దేహనిందను మాని ఆ దేహమనే సాధనం ద్వారా సోపధిశేష నిర్వాణాన్ని (జీవన్ముక్తిని) పొందాడు

అతను కృతకృత్యుడైన విషయాన్ని తెలుసుకొన్న బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు.

**ఉదకం హి నయంతి నేత్తికా ఇషుకారా నమయంతి తేజనమ్**
**దారు నమయంతి తక్షణా ఆత్మానం దమయంతి పండితా:** 6–5

కాలువలు త్రవ్వేవారు నీటిని నడిపిస్తారు. కంసాలి పనివారు బాణాలను చక్కచేస్తారు. వడ్రంగులు కొయ్యలను తమకు కావలసిన తీరులో మలచుకొంటారు - అలాగే పండితుడు తనను తాను నియమించుకొని నిర్వాణం పొందుతాడు

# లకుండక బద్ధియుడు

జేతవన విహారంలోని భిక్షువులలో బద్ధియుడు ఒకడు. అతను చాలా పొట్టిగా ఉంటాడు గనుక లకుండక (పొట్టి) బద్ధియుడని పేరు ఏర్పడింది ఆ విహారంలో ఉండే తక్కిన భిక్షువుల వినోదానికి, హాస్యానికి ఆస్పదం అయ్యాడు బద్ధియుడు మేఘాలు కమ్ముకొని సూర్యుడు కనిపించని రోజుల్లో "లకుండకా, త్రివిక్రమావతారాన్ని చాలించి ఆకాశం నుండి నీ పాదాన్ని తీసుకోవయ్యా! మళ్ళీ సూర్యదర్శన భాగ్యం మాకు కలిగించు" "లకుండకా, ఆ మామిడిపండు కోసిపెట్టవయ్యా, మాకెవ్వరికీ అందడం లేదు" ఇలాంటి హాస్యోక్తులు చాలా అతని మీద ప్రయోగించేవాళ్ళు క్రొత్తగా చేరిన చిన్నవాళ్ళకు కూడా అతనంటే బలే సరదా. అతని నెత్తిన మొట్టికాయ వేసి దాక్కోవడం, చెవులు లాగడం, ముక్కు పట్టుకొని ఊపడం - ఇలా అనేకమైన చిలిపి చేష్టలకు అతడిని ఆస్పదంగా చేసుకొన్నారు అప్పుడప్పుడూ చిన్నవాళ్ళు అతని చుట్టూ చేరి "మామా, ఎలా ఉన్నావు? ఈ జీవితం నీకు ఆనందమేనా? లేక విసుగ్గా ఉందా? విసుగ్గా ఉంటే చెప్పు, పెళ్ళి చేసి పెట్తాము" అని పకపకా నవ్వేవారు

బద్ధియుని ప్రతిస్పందన చాలా హుందాగా ఉండేది ప్రసన్నత ముఖం నుండి మాయమయ్యేది కాదు తన హ్రస్వాకారాన్ని ఇతరులు మాటిమాటికీ జ్ఞాపకం చేస్తున్నా బాధపడేవాడు కాదు "పూర్వ జన్మలో చేసుకొన్న పాపఫలితాన్ని అనుభవిస్తున్నాను" అని మనస్సుకు నచ్చజెప్పుకొనేవాడు కాదు ఆత్మదైన్యదోషాన్ని దగ్గరకు రానిచ్చేవాడు కాదు బుద్ధుని బోధనలను బాగా అవగతం చేసుకొన్నవాడు గనుక దేహం పొడుగైనా పొట్టియైనా అందమైనదైనా అనాకారమైనదైనా-ఏదైనా సరే మూడు దోషాలనుంచి తప్పుకోజాలదు ఏ దేహమైనా అనిత్యమే, అశుచిభాండాగారమే,

దుఃఖాస్పదమే అని సదా చింతన చేసేవాడు  బుద్ధుడు బోధించిన అద్భుతమైన కాయస్మృత్యుపస్థానం సాధన విడువక చేసేవాడు

బద్దియుని క్షాంతిని గురించి ఒకసారి ప్రస్తావనకు వచ్చినప్పుడు బుద్ధుడు బద్ధియుని ప్రశంసించి క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**శైలో యథైక ఘనో వాతేన న సమీర్యతే**
**ఏవం నిందాప్రశంసాసు న సమీర్యంతే పండితాః** **6-6**

ఏకశిలా పర్వతం ఏ గాలికీ చలించదు  ఆ విధంగానే పండితులు నిందాస్తుతులకు చలించరు



# బేలట్ఠసీసుడు

బేలట్ఠసీసుడు జేతవన విహారంలోని ఒక భిక్షువు అతనికి కాలం వృధా కావడం ఇష్టం ఉండదు ప్రజలు ధనాన్ని ఖర్చుపెట్టేటప్పుడు ఎలా ముందు వెనుకలు ఆలోచన చేసి ఖర్చు పెడతారో అలానే బేలట్ఠుడు కూడా కాలం విషయంలో ఆలోచన చేసేవాడు. "ఈ పనిలోకి దిగితే ఇంతకాలం పట్టుతుంది. ఆ కాలాన్ని ఇంకా ఉపయోగకరమైన పనిలో పెట్టడానికి వీలుందా?" ఇలా ప్రతిపని విషయంలోనూ ఆలోచన చేసేవాడు భిక్షాటన విషయంలోనూ అతను ఆలోచన చేశాడు "భిక్షువుగా ఉండేవాడు ప్రొద్దున బయలుదేరి భిక్ష తీసుకొని తిని తిరిగి వచ్చేటప్పటికి మధ్యాహ్నం అవుతున్నది. ఇలా కాలాన్ని వృధా కానివ్వడం ఎందుకు?" అని అతను ఒకే రోజు నాలుగైదు గ్రామాలు తిరిగి దండిగా భిక్ష సంపాయించుకొని వచ్చి ఆ పూటకు తనకు కావలసింది తిని మిగిలినదాన్ని ఎండబెట్టి భద్రం చేసుకొని తరువాత కొన్ని దినాలు భిక్షకు పోవడం మానుకొని ఆ ఎండబెట్టి భద్రం చేసుకొన్నదాన్ని నీళ్లలో నానబెట్టి తినేవాడు

తక్కిన భిక్షువులకు ఇతని పద్ధతి నచ్చలేదు. ఆహార సంచయం (కూడబెట్టడం) భిక్షువులకు తగని పని అని వారు భావించారు అతను భిక్షు నియమాలను ఉల్లంఘిస్తున్నాడని కూడా భావించారు కానీ అప్పటికి ఆహార సంచయాన్ని నిషేధిస్తూ నియమం ఏర్పడలేదు భిక్షు సంఘానికి మొదట బుద్ధుడు ఏ నియమాలూ పెట్టలేదు ఒక్కొక్క నియమం ఆయా సమయాల్లో ఆయా భిక్షువుల అనుచిత ప్రవర్తనలను నిషేధించడానికి పెట్టూ వచ్చాడు క్రమంగా అలాంటి నియమాల సంఖ్య 250కి చేరింది. బేలట్ఠుని అనుచిత ప్రవర్తనను భిక్షువులు బుద్ధునికి చెప్పారు బుద్ధుడు బేలట్ఠుని తప్పు పట్టలేదు "అతను

లోభం వల్ల ఆహార సంచయానికి పాల్పడి ఉంటే అది దోషమై ఉండేది. కానీ కాలాన్ని ఎక్కువ ధ్యానానికి వినియోగించడానికోసం అతను అలా చేశాడు. మనం ఆహార సంచయాన్ని నిషేధిస్తూ ఇంతవరకు నియమం పెట్టలేదు కనుక అతను భిక్షు నియమాలను ఉల్లంఘించినవాడు కాలేదు కానీ మంచి ఉద్దేశంతోనైనా సరే భిక్షువుగా ఉన్నవాడు ఆహార సంచయానికి పాల్పడరాదు. కనుక ఇకమీదట దాన్ని నిషేధిస్తూ నియమం పెట్టుకొందాము'' అని క్రింది శ్లోకాన్ని చెప్పాడు

**యేషాం సన్నిచయో నాస్తి యే పరిఙ్ఞాతభోజనా:**
**శూన్యతో ఽ నిమిత్తశ్చ విమోక్షో యస్య గోచర:**
**ఆకాశ ఇవ శకుంతానాం గతిస్తేషాం దురన్వయా** 7-3

ఎవరికైతే కూడబెట్టే మనస్తత్వం లేదో, ఎవరైతే భోజన విషయంలో మూడు పరిజ్ఞానాలు (ఆహారం యొక్క స్వరూప స్వభావ పరిజ్ఞానం, భౌతికాహార నికృష్టతను గురించిన పరిజ్ఞానం, జిహ్వాచాపల్యసంతృప్తికి కాకుండా ప్రాణధారణ కోసం ఆహారం అనే పరిజ్ఞానం) కలిగి ఉంటారో, శూన్యతా, (emptiness) అనిమిత్తతా, (signlessness) అప్రణిహితా (wishlessness) అనే మూడు ద్వారాలు కలిగిన మోక్షం ఎవరికి గోచరమైనదో అట్టి అర్హతుల గతిని (దేహత్యాగానంతరం వారెక్కడున్నారు? అసలు ఉన్నారా లేరా? ఇలాంటి విషయాలను) కనుక్కోవడం అసాధ్యం. ఆకాశంలో ఎగిరే పక్షుల అడుగు జాడలు గుర్తించడం ఎవరికైనా సాధ్యమా?



# శారిపుత్రుని శిక్షణ

భిక్షుసంఘంలో కొత్తగా చేరిన శ్రామణేరులను (probationers) బుద్ధుడు శిక్షణ కోసం శారిపుత్రుని అధీనంలో ఉంచేవాడు ఆస్రవధర్మాలతో (defilements) వచ్చి చేరిన వారిని అనాస్రవధర్మాలు కలిగినవారిగా చేయాలంటే మాటలు కాదు. సంక్లేశం (impurity) నుండి వ్యవదానానికి (purity) వారి చిత్తాన్ని మలచాలంటే గురువు చాలా శ్రమ పడవలసి ఉంటుంది. అనేకమైన మిధ్యాదృష్టులతో (false views) వచ్చి చేరినవారిలో సమ్యక్‌దృష్టిని కలిగించడం చాలా శ్రమతో కూడిన పనిగా ఉంటుంది ఇంతటి కష్టమైన పనని లోకహితం కోసం శారిపుత్రుడు తన మీద వేసుకొని భిక్షుసంఘంలో వచ్చి చేరిన వారందరినీ తన స్వంత ప్రియపుత్రులులాగా చూచుకొంటూ వారి ఆచరణలను, భావాలను సరైన మార్గంలో పెట్టడానికి నిర్విరామంగా కృషి చేసేవాడు

శారిపుత్రుడి. శిక్షణ కొత్తగా చేరిన కొందరికి చాలా చేదుగా ఉండేది "బుద్ధుని సూత్రాలను వల్లె వేయమంటాడు. సత్కాయదృష్టిని (false view of self) వదిలించుకోవడానికి విశ్లేషణ విచారాన్ని (analysis) చేయమంటాడు, యధేచ్ఛగా చేయి కాలు కదిలించేదానికి కూడా వీలులేనన్ని నియమాలు నెత్తిన రుద్దుతాడు కాసేపు తీరికగా కూర్చోనివ్వడు. ఏదో ఒక పని పెట్తాడు" అని లోలోపల రుసరుసలాడేవారు ఎదురు తిరిగే సాహసం మాత్రం చేసేవారు కాదు శారిపుత్రుని మహోన్నత వ్యక్తిత్వం అలాంటిది

ఒక సోమరి శ్రామణేరుడు శారిపుత్రుని శిక్షణకు తట్టుకోలేక తప్పించుకొనే ఉపాయంగా బుద్ధుని దగ్గరకు వెళ్ళి "శారిపుత్రుడు చీటికి మాటికి నన్ను చెడామడా

తిట్టాడు. నేను భరించలేను. మరో విహారానికి వెళ్ళడానికి నాకు అనుమతి ఇవ్వండి'' అన్నాడు. శారిపుత్రుడెటువంటివాడో బుద్ధునికి తెలియదా? ఆ అవివేకి పచ్చి అబద్ధం చెప్తున్నాడని గ్రహించి ఆ మూర్ఖుణ్ణి అధోగతినుండి తప్పించడానికి బుద్ధభగవానుడు శారిపుత్రుని గుణగణాలను విశదం చేసి ఆ శ్రామణేరుడు చాలా పశ్చాత్తాపపడేలా చేశాడు. చివరకు అతను క్షమాభిక్ష కోరి మళ్ళీ శారిపుత్రుని దగ్గరకే వెళ్ళాడు ఆ సందర్భంలో శారిపుత్రుణ్ణి మనస్సులో పెట్టుకొని బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**పృథ్వీసమో న విరుధ్యతే ఇంద్రకీలోపమస్తాదృక్ సువ్రత:**
**హ్రద ఇవాపేతకర్దమ: సంసారా న భవంతి తాదృశ:** 7-6

కోపం మొదలగు వికారాలకు లోనుగాక పృథివివలె క్షమాశీలుడైనవాడు, తలుపును మృదువుగా వేసిన గట్టిగా వేసినా నిర్వికారంగా ఉండే ద్వారబంధం వలె నిర్వికార చిత్తత అనే మంచి వ్రతమును కలిగినవాడు, బురద లేని నిర్మల కాసారం లాంటివాడు అయిన అర్హతుడు మళ్ళీ సంసార చక్రంలో ఇరుక్కుపోడు.

# తంబదారికుడు

తంబదారికుడు 55 ఏండ్ల పాటు రాజుగారి మరణ దండనను అమలుచేసే మనిషిగా పనిచేసి చాలా వృద్ధుడైపోయినందువల్ల పని నుండి విరమణం పొందాడు ఒకనాడు అతని ఇంటికి శారిపుత్రుడు భిక్షకై వచ్చాడు. ఆ భిక్షువును చూడగానే తంబదారికుడు చాలా ఆదరంతో ఇంటిలోకి ఆహ్వానించి తను చేసి పెట్టుకొన్న గంజిని సమర్పించాడు శారిపుత్రుడు దానిని పరమాన్నం ఆరగించినంత తృప్తితో ఆరగించాడు ఆ పిమ్మట తంబదారికుడు ఆ భిక్షువుతో "మీలాంటి మహాత్ములు పేదవాళ్ళమైన మాబోటివాళ్ళ గృహాలకు కూడా భిక్షకు రావడం మా అదృష్టం ఈ పాపాత్ముణ్ణి కనికరించి నాలుగు ధర్మ వాక్యాలు బోధించండి" అని ప్రాధేయపడినాడు

బుద్ధుని ఉపదేశసారమైన కరుణ, అహింస మొదలగు విషయాలను శారిపుత్రుడు అతనికి చెప్పాడు ఆ ఉపదేశ వాక్యాలు విన్నాక తంబదారికుడు చాలా దీనస్వరంతో "ఈ దివ్యబోధనలు వినడానికి నేను అర్హుణ్ణి కాను" అన్నాడు తన జీవితమంతా ఎలా ప్రాణఘాతకవృత్తిలో గడిచిందో చెప్పాడు శారిపుత్రుడు అతణ్ణి ఊరడిస్తూ "బాధపడకు నీవు స్వచ్ఛందంగా ప్రాణాలు తీయలేదు రాజాజ్ఞ మేరకు నీ వృత్తి ధర్మంగా వధకృత్యం ఆచరించావు గతించిన జీవితాన్ని తలచుకొని కౌకృత్యం (పశ్చాత్తాపం) పాలవుతూ, జీవిత శేషాన్ని గడిపివేయరాదు మిగిలి ఉన్న జీవితాన్ని సదర్ధర్మాచరణం ద్వారా సద్వినియోగం చేసుకొని ఉత్తమ గతికి పోవడానికి ప్రయత్నించాలి" అని ఇంకా హితమైన ధర్మ వాక్యాలు చాలా చెప్పి అతని విషాదాన్ని పోగొట్టి ధర్మాచరణ విషయంలో చాలా ఉత్సాహాన్ని కలిగించి తన విహారానికి వెళ్ళిపోయాడు.

ఆనాటినుండి తంబదారికుడి జీవితంలో నూతనాధ్యాయం మొదలయ్యింది దీర్ఘకాల క్రూర వృత్తి వల్ల తనకు సంక్రమించిన హృదయ కాఠిన్యం, జీవం (Life) ఎడల అగౌరవభావం మొదలగువాటిని క్షాళనం చేసుకొని శారిపుత్రునినుండి తాను గ్రహించిన ధర్మసందేశాన్ని శక్తివంచన లేకుండా ఆచరణలో పెట్టూ జీవించసాగాడు అతనిలో కలిగిన పరివర్తన ఆ ఊరిలో ఒక చర్చనీయాంశంగా కూడా మారింది

అవసానదశలో ధర్మాన్ని ఆశ్రయించిన తంబదారికుడు కొన్నాళ్ళకు మరణించాడు అతని మరణవార్త జేతవన విహారంలోని బుద్ధునికి తెలిసినప్పుడు ఆయన అక్కడున్న భిక్షువులతో "తంబదారికుడు ఇప్పుడు తుషిత దేవలోకంలో దేవశరీరాన్ని పొందియున్నాడు" అన్నాడు భిక్షువులకు చాలా ఆశ్చర్యం వేసింది. దశబలసంపన్నుడైన బుద్ధుని వాక్యాలను వారందరూ ప్రమాణంగా తీసుకొంటారు (దశబలములలో చ్యుత్యుపపత్తి జ్ఞానం ఒకటి. ఈ జ్ఞానం వల్ల జీవుల మరణ జననాల గురించి తెలియడం ఉంటుంది) "ఒక పర్యాయమే ధర్మ సందేశాన్ని వినిన అతడు పాపకర్మభారాన్ని వదిలించుకొని ఎలా తుషితలోకానికి చేరగలిగాడు?" అని వారు విస్మయంతో ప్రశ్నించారు. సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

**సహస్రమపి చేద్వాచః అనర్థపదసంహితాః**
**ఏకమర్థపదం శ్రేయో యచ్ఛ్రుత్వోపశామ్యతి** **8-1**

. నిర్వాణ ధర్మానికి సంబంధించని అర్థంపర్థం లేని మాటలు వేయికంటే ఉపశమనాన్ని కలిగించే అర్థవంతమైన ఒక వాక్యమైనా చాలు కదా !



# అనర్థపృచ్ఛకుడు

అనర్థపృచ్ఛకుడు ఒక చిత్రమైన బ్రాహ్మణుడు అతని అసలు పేరేమిటో ఎవరికీ తెలియదు. "నీ పేరేమిటి?" అని అడిగితే "అనర్థపృచ్ఛక నామధేయుణ్ణి" అని గర్వంగా చెప్పేవాడు. "లోకంలో తెలుసుకోదగినవి రెండే రెండు వర్గాలు. ఒకటి ఉపాదేయవర్గం (తీసుకొనదగినవి), రెండు హేయవర్గం (విడవదగినవి). ఇంకా బాగా ఆలోచిస్తే ఈ రెండింటిలో ఏ ఒకదాన్ని తెలుసుకొని ఆచరించినా చాలు. కనుక ఏకైక వర్గజ్ఞానం మనిషికి చాలు. నా మటుకు నేను అనర్థవర్గ (హేయవర్గ) జ్ఞానాన్ని సంపాయించుకొంటుంటాను. మహాబ్రాహ్మణుణ్ణి కలిసినా, మహాశ్రమణుణ్ణి కలిసినా నా ప్రశ్నలు అనర్థవర్గ జ్ఞాన విషయకంగానే ఉంటాయి. కనుక నా అన్వర్థనామధేయం అనర్థపృచ్ఛకుడు" అని తన పేరు మీద పెద్ద వివరణ కూడా ఇచ్చుకొనేవాడు.

ఒకనాడు, అతడు జేతవన విహారానికి వచ్చి బుద్ధుణ్ణి సందర్శించి "మహాశ్రమణా, మీరు ఎక్కువగా ఉపాదేయ ధర్మాలనే బోధిస్తుంటారు. నా మటుకు నాకు నిషేధముఖంగా ధర్మాలను వినాలని ఉంటుంది. కనుక నా మేలును దృష్టిలో పెట్టుకొని పరిహరించదగిన వాటిని కొన్ని చెప్పండి" అన్నాడు. బుద్ధుడు వెంటనే ఆరింటిని అతనికి చెప్పాడు. 1 సూర్యోదయం తరువాత కూడా నిదురించడం తగదు 2 సోమరితనానికి అలవాటు పడడం తగదు 3. క్రౌర్యం తగదు 4. మద్యపానం తగదు 5 అర్ధరాత్రివేళ నిర్మానుష్యంగా ఉన్న వీధుల్లో పచార్లు చేయడం తగదు 6. కామేషు మిథ్యాచారం (sexual misconduct) తగదు.

తరువాత బుద్ధుడు అతని జీవికను గురించి అడిగాడు "జీవిక (livelihood) అనేది మనిషికి కేవలం శ్రమను ఇచ్చేదిగా ఉండకూడదు అంతో ఇంతో వినోదాన్ని కూడా ఇచ్చేదిగా ఉండాలి. కనుక నేను ద్యూతమును నా జీవికగా తీసుకొన్నాను నేను ప్రశ్నించిన వాళ్ళందరూ ద్యూతాన్ని అనర్ధ వర్గంలోనే చేర్చారు అయినా సరే నేను మటుకు దీన్ని అనర్ధవర్గం జాబితాలో చేర్చలేదు" అన్నాడు ఆ అధిక ప్రసంగి. "గెలుస్తూనే ఉంటావా?" అని బుద్ధుడు ప్రశ్నించాడు "ద్యూతంలో ఎప్పుడూ గెలుస్తూనే ఉండడం ఎవరి తరమూ కాదు నలుడంతటి ద్యూతనిపుణుడు, యుధిష్ఠిరుడంతటి ద్యూతవిద్యావిశారదుడు కూడా ఓటమిని పొందక తప్పలేదు. నా విషయమూ అంతే. గెలవడమూ ఓడడము రెండూ ఉన్నాయి" అన్నాడు ఆ అతివాచాలుడు

బుద్ధుడు ఆ సంభాషణను ముగిస్తూ క్రింది రెండు శ్లోకాలను చెప్పాడు

*ఆత్మా హ వై జిత: శ్రేయాన్ యాచేయమితరా: ప్రజా:*
*దాంతాత్మన: పురుషస్య నిత్యం సంయతచారిణ:*
*నైవ దేవో న గంధర్వో న మార: సహ బ్రహ్మణా*
*జితం అపజితం కుర్యాత్ తథా రూపస్య జంతో:* 8-5,6

ఇతరులను జయించేదానికన్నా తనను తాను జయించడం మంచిది . తనను తాను అదుపులో పెట్టుకొనిన సంయతశీలుణ్ణి దేవతలు కూడా అపజయం పాలు చేయలేరు

# కిస్సాగౌతమి

శ్రావస్తిలోని ఒక ధనికుని కుమార్తె గౌతమి ఆమె చాలా సన్నగా ఉండటం వల్ల కిస్సాగౌతమి అని పేరు వచ్చింది. ఆమెకు వివాహమైన చాలా ఏండ్లకు ఒక మొగపిల్లవాడు పుట్టాడు లేక లేక పుట్టిన బిడ్డ కనుక గౌతమి అల్లారుముద్దుగా అతడిని చూచుకొంటుండగా దోగాడే వయస్సులోనే ఆ బిడ్డ అకస్మాత్తుగా మరణించాడు పంచప్రాణాలూ అతని మీద పెట్టుకొని బ్రతుకుతున్న గౌతమి ఆ దెబ్బను తట్టుకోలేక పోయింది ఆమె మనస్సు వాస్తవాన్ని ఎదుర్కోవడానికి సమ్మతించలేదు "బిడ్డ కేవలం అపస్మారకావస్థలో ఉన్నాడు మరణించలేదు సరియైన వైద్యం చేస్తే బ్రతుకుతాడు" అని కల్పనలో ఆమె మనస్సు గట్టిగా నిలిచిపోయింది మృతశిశువును ఎత్తుకొని వీధుల్లో తిరుగుతూ కనబడినవారినందరినీ "నా బిడ్డకు చికిత్స చేసి బాగు చేయండి నా ఆస్తియంతా ఇచ్చేస్తాను" అని దీనంగా మొరపెట్టుకోసాగింది "పాపం పిచ్చిదైపోయింది" అని అందరూ జాలిపడడం మినహాయించి ఏమీ చేయలేకపోయారు బుద్ధుని గృహస్థ శిష్యుడైన ఒక వృద్ధుడు ఆమెను చూచి "అలవిగాని శోక భారం ఆమెను అలా చేసింది ఆ శోక భారాన్ని తగ్గించి ఆమెను మామూలు మనిషిని చేయగల శక్తి ఒక్క తథాగతులవారికే ఉంది" అని భావించి "అమ్మా, నా వెంటరా. నిన్ను చాలా గొప్ప వైద్యుని దగ్గరకు తీసుకుపోతాను" అని ఆమెను బుద్ధుని సన్నిధికి తీసుకుపోయాడు

కరుణాసముద్రుడైన బుద్ధుడు "అమ్మా గౌతమీ, నీ బిడ్డకు నేను వైద్యం చేస్తాను ఆ వైద్యానికి ముందుగా ఒక పిడికెడు ఆవాలు నీవు ఏ ఇంటినుండైనా పట్టుకరావాలి నీవు పట్టుకవచ్చే ఆవాలు వైద్యానికి పనికిరావాలంటే ఆ ఇంటిలో

ఇంతవరకు ఎవ్వరూ మరణించి ఉండరాదు గుర్తుంచుకో'' అని చెప్పి పంపాడు శ్రావస్తిలోని అన్ని వీధుల్లో అన్ని ఇండ్లకు వెళ్ళి ఆవాల భిక్ష అడిగింది ఎక్కడా ఆమెకు కావలసిన ఆవాలు లభించలేదు మెల్లగా ఆమె వాస్తవాన్ని గుర్తించడం మొదలు పెట్టింది. భుజానికి ఆనించుకొనియున్న తన బిడ్డ కూడా మరణించినాడని ఆమె గుర్తించడం మొదలు పెట్టింది బుద్ధుని అనుగ్రహబలం వల్ల ఆమె భరించరాని పుత్రశోకాన్నుండి బైటపడి అంత్యక్రియలు చేయండని చెప్పి మృతశిశువును ఇంటి దగ్గర పెట్టి నేరుగా జేతవనానికి వెళ్ళి బుద్ధుని ముందు మోకరిల్లింది

దుఃఖోపశమనకారకమైన ధర్మాన్నంతా ఆమెకు బుద్ధుడు బోధించి ఆమె మోహాన్ని (అజ్ఞానాన్ని) పటాపంచలు చేశాడు ఆమె తిరిగి ఇంటికి వెళ్ళలేదు శేష జీవితాన్ని భిక్షుణిగా గడిపింది ఒకనాడు ఆమె దీపం వెలిగిస్తుండగా అది గుప్పుమని ఒక వెలుగు వెలిగి ఠపీమని మళ్ళీ ఆరిపోవడం జరిగింది "లోకంలో ప్రతీదీ ఇంతే'' అనే ఆకస్మిక జ్ఞానోదయం ఆమెకు కలిగి ముక్తురాలయ్యింది కృతకృత్యురాలైన ఆమెను గురించి ఒకసారి ప్రస్తావన వచ్చినప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

***యశ్చ వర్షశతం జీవేదపశ్యన్ అమృతం పదమ్***
***ఏకాహం జీవితం శ్రేయః పశ్యతో ఽ మృతం పదమ్*** 8-15

నిర్వాణాన్ని చూడలేని నూరేండ్ల బ్రతుకు కంటే నిర్వాణాన్ని చూడగల ఒక రోజు బ్రతుకు శ్రేష్ఠము.



# ఏకశాటికుడు

శ్రావస్తి నగరంలో మిగారుడు, సుదత్తుడు మొదలగు మహాధనికులేగాక ఏకశాటికుడులాంటి కటిక దరిద్రులు కూడా ఉండేవారు ఇంటినుండి బైటకు ఆ నగర వీధుల్లోకి వచ్చినప్పుడు నాగరికులు కప్పుకొనే అంగవస్త్రం అతనికి ఒక్కటే ఒక్కటి ఉంది తాను ఆ అంగవస్త్రం కప్పుకొని బైట అడుగు పెట్టే భార్య ఇంటిలోనే ఉండవలసివచ్చేది - ఆమెకు మరో వస్త్రం లేనందువల్ల. ఆమె బైటకు పోయి రాదలిస్తే తాను ఇంటిలోనే ఉండవలసి వచ్చేది కనుక-వారిరువురూ కలిసి ఎప్పుడూ బైటకు వెళ్ళింది లేదు

ఒకనాడు ఏకశాటికుడు అంగవస్త్రాన్ని కప్పుకొని బైటకు వచ్చాడు. ఆ నగరంలోని ఒక కూడలి వద్ద జనం మాట్లాడుకొనే మాటలు ఇతని చెవిలో పడ్డాయి వైశాలినుండి బుద్ధుడు జేతవనానికి నిన్ననే వచ్చాడనీ నేటి సాయంత్రం ప్రసేనజిత్తు మహారాజు ఆయన దర్శనం కోసమై వెళ్తున్నాడనీ అప్పుడక్కడ తప్పక బుద్ధుని ధర్మ ప్రవచనం ఉంటుందని వారి మాటలవల్ల ఏకశాటికుడు గ్రహించాడు.

నగరానికి మరీ దగ్గరగానూ మరీ దూరంగానూ లేని మిక్కిలి యోగ్యమైన స్థలంలో జేతవన విహారం ఉంది. ఏకశాటికుడు జేతవనానికి వెళ్ళే దారిని అడిగి తెలుసుకొని అక్కడికి ప్రయాణమయ్యాడు

ప్రసేనజిత్తు బుద్ధునికి ప్రణమిల్లి తన మనస్సు బాగాలేదనీ వారసుని కోసం ఎదురు చూసిన తనకు మొగపిల్లవాడు గాకుండా ఆడపిల్ల పుట్టిందనీ విచారంగా చెప్పాడు బుద్ధుడు అతని మనస్తాపాన్ని చల్లార్చుతూ స్త్రీల వైశిష్ట్యాన్ని ఉగ్గడించి ఆ పిమ్మట అక్కడ సమావేశమైన శ్రోతలనుద్దేశించి అభ్యుదయ నిశ్శ్రేయస్సులకు సాధనములైన ధర్మాలను బోధించాడు

ఆ ధర్మస్వామి దివ్యోపదేశం తొలిసారిగా వినిన ఏకశాటికుడు పరవశించి పోయాడు సంసార గాఢాంధకారంలో అలమటిస్తున్న తనకు ఆ దివ్యబోధనలు మార్గాన్ని స్పష్టంగా చూపుతున్న ఉజ్జ్వల దీపాలవలె తోచాయి. శ్రోతలు ఇండ్లకు మరలుతూ తాము పట్టుకొచ్చిన కానుకలను తథాగతులవారి పాదాల చెంత ఉంచి వెళ్తున్నారు. "అకించనుణ్ణి (ఏమీ లేనివాడను) నేనేమీ ఇవ్వలేను" అని ఏకశాటికుడనుకొన్నాడు. కొన్ని క్షణాల తరువాత అతనికి తన అంగవస్త్రం జ్ఞాపకం వచ్చింది "దీన్ని ఇచ్చేస్తే ఎట్లా? నాకూ, నా భార్యకూ ఉన్నది ఇదొక్కటే" అనుకొన్నాడు మళ్ళీ కొన్ని క్షణాల తరువాత "అమృతస్య దాత అయిన ఈ ధర్మస్వామికి నాదగ్గరున్న ఈ చిరుకానుకను అర్పించడానికి ఇంత తటపటాయింపు ఎందుకు?" అని ముందుకు పోయి పరమ ప్రీతితో భక్తితో తన అంగవస్త్రాన్ని బుద్ధుని పాదపద్మాలముందు పెట్టి ఉద్వేగం వల్ల బొంగురు పోయిన కంఠంతో "నేను జయించాను, నేను జయించాను, నేను జయించాను" అని గట్టిగా పలుకుతూ అక్కడ్నుంచి నిష్క్రమించాడు

ఆ పలుకులు ప్రసేనజిత్తులో ఆసక్తిని రేకెత్తించాయి రాజ సేవకులను పంపి ఏకశాటికుని వృత్తాంతమంతా తెలుసుకొన్నాడు. కరుణాపరవశుడై ప్రసేనజిత్తు ఏకశాటికుని దారిద్ర్యాన్ని పటాపంచలు చేసే విధంగా అతనికి అనేకమైన కానుకలు పంపాడు.

భిక్షువులు ఈ విషయాన్ని ప్రస్తావించినప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

***అభిత్వరేత కల్యాణో పాపాత్ చిత్తం నివారయేత్***
***తంద్రితం హి కుర్వత: పుణ్యం పాపే రమేత మన:*** **9-1**

పుణ్యకార్యాచరణలో మనిషి తొందరపడవలెను పాపకార్యాల నుండి చిత్తాన్ని నివారించవలెను పుణ్యకార్యాచరణలో సోమరితనానికి చోటిచ్చినచో మనస్సు పాప కార్యాచరణకు మొగ్గు చూపే అవకాశం ఇచ్చినట్లవుతుంది.

# జాగ్రత్త లేని భిక్షువు

జేతవనంలో నిర్లక్ష్యం రూపు దాల్చినట్లుగా కనబడే ఒక భిక్షువు ఉండేవాడు ఆ విహారం తనకు ఆశ్రయం ఇచ్చినట్టిదనే కృతజ్ఞతాభావం కూడా లేనివాడు. విహారంలోని ప్రతి వస్తువునూ తన స్వంత వస్తువును చూచుకొన్నట్లుగా చూచుకోవాలనే జాగ్రత్త లేనివాడు కుర్చీలను, బల్లలను తనకు ఇష్టమైన చోటులో లాగివేసుకొని అక్కడే వదలిపెట్టేసేవాడు అవి ఎండకు ఎండినా, వానకు తడిసినా అతనికి ఏమీ పట్టదు కొన్ని వస్తువులకు చెదలుపట్టి కళ్ళముందరే నాశనమౌతున్నా చూస్తూ ఊరుకొనేవాడు ఇతని నిర్లక్ష్య వైఖరిని సహించలేక అక్కడున్న ఇతర భిక్షువులెవరైనా మృదువుగా మందలిస్తే ఇతడు వాళ్ళకు ఒక పెద్ద ఉపన్యాసం ఇచ్చి పంపేవాడేగానీ వైఖరి మార్చుకొనేవాడు కాదు

"సర్వం అనిత్యం అని బుద్ధభగవానుడు ఘోషించి చెబుతుంటే ఈ కుర్చీలు, బల్లల రక్షణ గురించి మీరెందుకింత ఆరాటం చూపుతారు? పోనీ మీరు చెప్పినట్లే నేను జాగ్రత్త తీసుకొన్నా అవి ఎన్నాళ్ళు నిలుస్తాయి? మేరు. పర్వతమే బూడిద కూడా మిగలకుండా కల్పాంతంలో నశించిపోగా ఇక ఇవి నిలుస్తాయా? ఇవి ఉత్పన్నములైనప్పుడే అనిత్యతాదోషాన్ని అతికించుకొని వచ్చాయి మన జాగ్రత్తలు ఏమి చేస్తాయి? మన దేహాలే క్షణక్షణం మారిపోతూ వినాశాభిముఖంగా పయనిస్తుంటే ఈ అల్ప బాహ్యవస్తువులు చెదలుపట్టి నాశనమైపోతున్నాయని మీకెందుకింత విషాదం? అవయవాలచే ఏర్పడిన ఏ వస్తువైనా సరే వికారాన్ని, చివరకు వినాశాన్ని తప్పించుకోలేవు". - ఈ విధమైన ఉపన్యాసం దంచి పారవేసి వాళ్ళను అదరగొట్టేవాడు.

బుద్ధునికి అతని విషయం తెలిసి ఒకనాడు తన సమ్ముఖానికి పిలిపించుకొని

ఇలా హితబోధ చేశాడు. "ఒక వ్యక్తిగా సంఘం నుండి అనేక ప్రయోజనాలను పొందుతున్నావు. ఆ సంఘం బాగుంటేనే కదా నీ ప్రయోజనాలు కూడా సిద్ధించేది. అందరూ నీలాగే ప్రవర్తిస్తే సంఘం ఏమవుతుంది? వ్యక్తిగత ప్రయోజనాలు పొందితే చాలు, సంఘం ఏమైతేనేమి అనే ధోరణి మంచిది కాదు. నిర్లక్ష్యవైఖరి వల్ల క్రమంగా వ్యక్తిలో పాప సంచయం ఏర్పడుతుంది. దుర్గతికి పోవడానికి బాట వేసుకొన్నట్లవుతుంది. ఇక్కడ నాలుగు కుర్చీలు బల్లలు నష్టమైతే విహారానికి మళ్ళీ అవి వస్తాయి. సుదత్తుడైనా తెచ్చి ఇస్తాడు విశాఖయైనా తెచ్చి ఇస్తుంది. కానీ నీ నిర్లక్ష్యవైఖరి వల్ల నీవు పేర్చుకొన్న పాపభారాన్ని మోయడానికి ఎవరూ సహాయం రారు. నీవొక్కడివే మోయాల్సి ఉంటుంది. కనుక ఇక మీదటైనా జాగ్రత్తపడు" అని క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు.

*మా ఽవమన్యేత పాపం వ మాం తదా గమిష్యతి*
*ఉదబిందు నిపాతేన ఉదకుంభో ఽపి పూర్యతే*
*బాలః పూరయతి పావం స్తోకం స్తోకమప్యాచిన్వన్* 9-6

"ఇదేమంత పెద్ద పాపమైన పనికాదు" అని చాలా నిర్లక్ష్యంతో ప్రవర్తిస్తూ ఉంటే కొంచం కొంచం పాపం చేరుతూ చివరకు అది పెద్ద మూటగా తయారయి నరకంలో పడవేస్తుంది ఒక్కొక్క నీటి బొట్టు కుండలో పడుతూ ఉంటే ఆ కుండ నిండడానికి ఎంత సేపు పట్టుంది ?

# మహాధనుడు

శ్రావస్తిలో మహాధనుడనే వర్తకుడుండేవాడు సరుకులను తరలించుకొని పోవడానికి అతని దగ్గర 500 బండ్లు ఉండేవి ఒకసారి అతను సరుకులెక్కించుకొని కోశాంబికి ప్రయాణమయ్యాడు ప్రయాణానికి ముందు జేతవన విహారానికి వెళ్ళి బుద్ధుణ్ణి సందర్శించి ఆ పిమ్మట అక్కడున్న భిక్షువులతో తన ప్రయాణ వివరాలు చెప్పి కోశాంబికి రాదలచుకొన్న భిక్షువులెవరైనా ఉంటే తనతో రావచ్చుననీ వారికి అన్ని సౌకర్యాలూ కల్పిస్తానని చెప్పాడు. కొందరు భిక్షువులు ప్రయాణానికి సిద్ధమై అతని వెంట బయలుదేరారు

మహాధనుడు చాలా అనుభవం ఉన్న సార్ధవాహుడు గనుక తన ప్రయాణంలో సురక్షిత గ్రామాలను మజిలీలుగా చేసుకొంటూ మూడవ మజిలీగా ఒక అడవి సమీపంలోని గ్రామం చేరాడు మరునాడు ఆ అడవిగుండా పోవలసి ఉంది. కానీ ఆ రాత్రి అతనికి ఒక వార్త అందింది - 500 మంది ఉన్న ఒక పెద్ద బందిపోటు ముఠా తన సరుకును కొల్లగొట్టడానికి అడవిలో కాపువేసి ఉన్నదని అంతమంది ఉన్న ముఠాను ఎదుర్కొనే రక్షకదళం తనకు లేనందువల్ల మహాధనుడు ఆ ప్రయాణాన్ని వాయిదా వేసుకొని శ్రావస్తికి సురక్షితంగా తిరిగి వచ్చేశాడు.

అతనితో పోయిన భిక్షువులు కూడా ప్రయాణం మానుకొని తిరిగి జేతవనానికి వచ్చేశారు "అరె, బలే ఆశ్చర్యం ! కోశాంబికి పోయి అప్పుడే ఎలా తిరిగి రాగలిగారు? మీ దగ్గరేమైనా పాదలేపనవిద్య ఉందా? లేక ఆకాశగమనవిద్య ఉందా?" అని కొందరు వాళ్ళను వేళాకోళం చేశారు

తిరిగి వచ్చిన భిక్షువులు సమయం చూచుకొని బుద్ధుడిని సందర్శించి

తమ ప్రయాణ విఘ్నం ఎలా సంభవించిందో వివరించారు.

ఈ వార్తను బుద్ధుడు ఒక దృష్టాంతంగా తీసుకొని వారికి ఇలా చెప్పాడు "దొంగల మురాకు భయపడి మహాధనుడు ప్రయాణాన్ని మానుకొన్నాడు జీవితేచ్ఛ ఉన్నవాడు విషాన్ని దగ్గరకు రానివ్వడు ఈ సంసారకాననం కూడా క్లేశ తస్కరులచే ఆక్రాంతమై ఉంది. (రాగం, ద్వేషం, మోహం మొదలైన క్లేశములు) కనుక ఇక్కడ రాకపోకలను కట్టిపెట్టి క్షేమదాయకమైన నిర్వాణపురం వైపు మీరు కూడా ప్రయాణం చేయాలి" అని చెప్పి క్రింది శ్లోకాన్ని పఠించాడు

***వణిగివ భయం మార్గం అల్పసార్థో మహాధనః***
***విషం జీవితుకామ ఇవ పాపాని పరివర్జయేత్*** 9-8

భయంకరమైన మార్గాన్ని మందిబలం తక్కువగా ఉన్న మహాధనుడు పరిహరించినట్లుగా, జీవితేచ్ఛ ఉన్నవాడు విషాహారాన్ని పరిహరించినట్లుగా అభ్యుదయ నిశ్శ్రేయసకాముడు పాపాలను పరిహరించవలెను



# వేటగాడు

కోకుడనే వేటగాడు జాగిలాలను వెంటబెట్టుకొని వేటకై అడవికి బయలుదేరాడు అతను మూఢనమ్మకాల మనిషి. దారిలో ఒక భిక్షువు ఎదురయ్యాడు. భిక్షువుల స్థాయి ఏమిటో తెలియని మూర్ఖుడతడు. "ఈ దరిద్రుడు ఎదురు పడ్డాడు నాకు ఈ రోజు వేటలో ఏమీ చిక్కదేమో" అని మనస్సులో అనుకొని ఆ భిక్షువును కొరకొర చూస్తూ వేటకు వెళ్ళాడు

అనుమానం నిజమైనట్లే అనిపించింది అతనికి. ఆనాడు ఎంత శ్రమ పడ్డా ఒక్కగానొక్క జీవాన్ని కూడా చంపిగానీ బంధించిగానీ తీసుకురాలేకపోయాడు "అలాంటి దరిద్రుల ముఖం చూసి బయలుదేరితే జరిగేది ఇంతే" అని తన్ను తాను తిట్టుకొంటూ వట్టి చేతుల్తో తిరుగుముఖం పట్టాడు

దారిలో మళ్ళీ ఆ భిక్షువు ఎదురయ్యాడు కోకుని హృదయంలో కోపాగ్ని భగ్గున మండింది జాగిలాలను ఆ భిక్షువు మీదికి ఉసికొల్పాడు ఆపద్ధర్మంగా భిక్షువు లేడికన్నా వేగమైన పరుగుతో ఒక చెట్టు దగ్గరకు చేరి ఆ చెట్టును తొందర తొందరగా ఎక్కడం మొదలుపెట్టాడు. జాగిలాలతోబాటే తరుముకొని వస్తున్న కోకుడు ఆ చెట్టు క్రిందకు వచ్చి బాణం కొనతో భిక్షువు అరికాళ్ళను నిర్దయగా గుచ్చడం మొదలుపెట్టాడు ఆ బాధ భరించలేక భిక్షువు ఇంకా వేగంగా చెట్టును ఎగబ్రాకే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో అతను కట్టుకొన్న పసుపుగుడ్డ। ఊడి కోకుని మీద పడింది జాగిలాలు పసుపుగుడ్డ వ్యక్తిని శత్రువు గా భావించి పగబట్టియున్నాయి గనుక ఆ గుడ్డచేత కప్పబడిపోయిన కోకుని మీదకు గుడ్డి కోపంతో లఘించాయి జాగిలాల దాడిని తట్టుకోలేక కోకుడు హాహాకారాలు చేస్తూ మరణించాడు. జాగిలాలు కూడా ఈ సంఘటనకు అయోమయం చెంది

అడవిలోకి పారిపోయాయి.

కోకుని దుర్మరణానికి భిక్షువు చాలా వ్యధ చెందాడు అతని మరణానికి కారణం తన వస్త్రమే అయినందులకు అతను చాలా బాధపడ్డాడు కోకుని దుర్మరణ కర్తృత్వంలో భాగం తనకు కూడా ఉందేమో అనే సంశయం కూడా అతణ్ణి పట్టి పీడించింది. నేరుగా బుద్ధుని దగ్గరకు వెళ్ళి జరిగిన విషయాలన్నీ చెప్పి చివరగా తన సంశయాన్ని కూడా తెలిపాడు బుద్ధుడు అతణ్ణి అనునయిస్తూ "నాయనా, నీవు ఈ విషయంలో చింతాకులుడవు కావద్దు నీ దోషమేమీ లేదు. కర్తృత్వంలో నీ భాగస్వామ్యం ఏమీ లేదు. నీ శీలానికి (morality) వచ్చిన మచ్చ ఏమీ లేదు ఆ వేటగాడు నిరపరాధియైన నీకు అపకారం తలపెట్టి తానే నాశనమైపోయాడు. మిక్కిలి ఘోరమైన పాపం, ఫలితాన్ని వెంటనే చూపుతుందనే దానికి ఇది నిదర్శనంగా ఉంది" అని చెప్పి క్రింది శ్లోకాన్ని పఠించాడు

**యో ౨ ప్రదుష్టాయ నరాయ దుష్యతి**
**శుద్ధాయ పురుషాయ అనంగణాయ**
**తమేవ బాలం ప్రత్యేతి పాపం**
**సూక్ష్మో రజః ప్రతివాతమివ క్షిప్తం** **9-10**

శుద్ధవర్తనుడు, కల్మషరహితుడు, అనిందితుడయిన వ్యక్తి ఎడల ఏ మూర్ఖుడైతే అపకారం తలపెట్తాడో ఆ అపకారం అతడికే వచ్చి తగులుతుంది. గాలికి ఎదురుగా దుమ్మును విసిరితే ఆ దుమ్ము విసిరిన వానిమీదకే మళ్ళీ వచ్చి పడుతుంది కదా!

# అహింసావ్రతుడు

శ్రావస్తిలో రత్నాలు సానబెట్టడంలో పేరుకెక్కిన నికషుడుండేవాడు అతనొక చిత్రమైన వ్యక్తి. పెంపుడు పక్షులుగా లోకులు పావురాలను చిలుకలను పెంచుకొంటే అతను ఒక ప్రత్యేకజాతి కొంగను ముద్దుగా పెంచుకొన్నాడు.

ఒకనాడు అతని ఇంటికి అహింసావ్రతుడనే భిక్షువు వచ్చి వాకిట నిలబడినాడు నికషుడు ఆ భిక్షువును సాదరంగా లోనికి ఆహ్వానించి నట్టింట ఒక బల్ల ముందు కూర్చోబెట్టాడు ఇంతలో ప్రసేనజిత్తు పంపిన ఒక రాజసేవకుడు అక్కడికి వచ్చి "నికషా, రాజుగారు దీనిని సానబెట్టడానికి ఇచ్చి పంపారు" అని రక్తవర్ణ కాంతులు వెదజల్లుతున్న ఒక రత్నాన్ని తెచ్చి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు నికషుడు దానిని తీసి బల్ల మీదపెట్టి వంటగదిలో ఉన్న భార్యకు భిక్షువు రాకను తెలియజేయడానికై వెళ్ళి మళ్ళీ నట్టింటికి వచ్చేసరికి బల్లమీద పెట్టిన రత్నం కనిపించలేదు బల్లముందు కూర్చునియున్న భిక్షువు అక్కడే ఉన్నాడు అతని మీద నికషునికి అనుమానం కలిగింది "రత్నం మీరు తీశారా?" అని అడిగాడు "లేదు" అన్నాడు భిక్షువు "మరి ఎవరు తీశారో చెప్పండి" అన్నాడు నికషుడు. ఈ సారి భిక్షువు బదులు పలకలేదు. మౌనం దాల్చాడు "నిన్నే అడిగేది రత్నం ఏమైంది?" అని గద్దించి అడిగాడు నికషుడు. భిక్షువు నోరు విప్పలేదు భిక్షువే దాన్ని తీసి దాచేశాడని నిశ్చయించాడు నికషుడు

"ఒరే దొంగవెధవా, భిక్షువు అనుకొని ఇంటిలోకి పిలిచి నిన్ను కూర్చోబెట్టడం నాది తప్పు" అని నికషుడు ముందు వెనుక ఆలోచించకుండా చాలా కోపంతో ఆ భిక్షువును నాలుగు దెబ్బలు కొట్టి శోధించి చూచాడు రత్నం దొరకలేదు

భిక్షువును గుంజకు కట్టాడు. అతని భార్య వచ్చి వారిస్తున్నా వినక ఆమెను నెట్టివేసి భిక్షువును చావుదెబ్బలు కొట్టడం మొదలు పెట్టాడు. భిక్షువు శరీరం వివిధ భాగాలనుండి రక్తం ధారగా కారడం మొదలయ్యింది. ఇంత జరిగినా అతడు మౌనాన్ని వీడలేదు. ఆ రక్తాన్ని చూచి నికషుని పెంపుడు కొంగ అక్కడికి వచ్చి వాలింది కోపంతో వళ్ళు మరచి ఉన్న నికషుడు దాన్ని బలం కొద్దీ తన్నాడు. ఆ తన్ను యొక్క వేగానికి అది గిలగిల కొట్టుకొని చచ్చిపోయింది. సగం ప్రాణంతో ఉన్న భిక్షువు చాలా హీన స్వరంతో రత్నం ఎక్కడుందో అప్పుడు చెప్పాడు. "రత్నం కొంగ కడుపులో ఉంది" భిక్షువు చెప్పినది వాస్తవమే ఆ పెంపుడు కొంగ, రత్నాన్ని మాంసం ముద్ద అని భ్రమించి గుటుక్కున మ్రింగి వెళ్ళిపోయింది. ఆ విషయం చెబితే కొంగ వెంటనే కోయబడుతుందని అహింసావ్రతుడు విషయాన్ని బైట పెట్టలేదు. అతని అహింసావ్రతం అంత దృఢమైనది !

చచ్చి పడి ఉన్న కొంగను నికషుడు వెంటనే కోసి చూడగా రత్నం లభించింది. భిక్షువును అనుమానించి అవమానించి చిత్రహింస పెట్టినందులకు అతను చాలా బాధపడి భిక్షువు కాళ్ళమీద పడి ఏడుస్తూ క్షమాభిక్ష కోరాడు. భిక్షువు అతణ్ణి ఓదార్చి "నాయనా, ఇందులో నీ అపరాధం ఏముంది? ఇదంతా పూర్వజన్మ నుండి నేను తెచ్చుకొన్నట్టిది నేను నీ మీద కినుక వహిస్తే కదా క్షమాభిక్ష ఇవ్వడం సాధ్యమయ్యేది నీ మీద నాకు కించిత్ కోపం కూడా కలుగలేదు అసలు దోషం నాది. వాకిట దగ్గరే నిలబడి భిక్ష తీసుకొని పోయి ఉంటే నాకింత జరిగేది కాదు. అంతా ప్రారబ్ధం . ఇక మీదట నేనెవరి ఇండ్లలోపలికి పోను" అని ఆ భిక్షువు వెళ్ళిపోయాడు. కానీ బలమైన ఆ దెబ్బల కారణంగా అతడు అస్వస్థుడై కొన్నాళ్ళకు మరణించాడు. అతని అకాలమరణానికి ఖిన్నులై భిక్షువులు అతని మరణానంతర స్థితిని గురించి బుద్ధుణ్ణి అడిగారు.

"అతడు అర్హతుడు. మరణానంతర స్థితి గురించి ప్రశ్నేమున్నది? నిరుపధిశేష నిర్వాణ ప్రాప్తిని పొందినాడు" అని బుద్ధుడు చెప్పి క్రింది శ్లోకాన్ని కూడా పఠించాడు.

***గర్భమేక ఉత్పద్యంతే నిరయం పాపకర్మిణః***
***స్వర్గం సుగతయో యాంతి పరినిర్వాంత్యనాస్రవాః*** **9-11**

పుణ్య పాపాలు ఇంచుమించు సమంగా ఉన్నవాళ్ళు మనుష్య జన్మ ఎత్తుతారు పాపం అధికంగా ఉండేవాళ్ళు నరక జన్మ ఎత్తుతారు. పుణ్యం అధికంగా ఉండేవాళ్ళు దేవలోకాలలో జన్మ పొందుతారు ఆస్రవములు లేనివాళ్ళు ముక్తులవుతారు (ఆస్రవములు నాలుగు 1. కామం (sensuality) 2 భవ (wish to be reborn) 3. దృష్టి (speculative views) 4 అవిద్య

# ఉపాసికలు

గృహస్థులుగా ఉంటూ ధర్మాచరణ కలిగిన వ్యక్తులను ఉపాసకులంటారు. ఉపాసకులుగా ఉన్నట్టివారు నెలకు నాలుగుసార్లు (అష్టమి తిధులు రెండు, పౌర్ణమి, అమావాస్య) విహారాలకు ఆరామాలకు వెళ్ళి తాము పాటించవలసిన పంచశీల మొ నియమాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం, దృఢం చేసుకోవడం పరిపాటి. అలాంటి ప్రత్యేక దినాలకు పోషధములని పేరు

ఒక పోషధ దినంనాడు విశాఖకు ఒక కుతూహలం కలిగింది శ్రావస్తి నగరానికి తూర్పు దిక్కులో విశాలమైన సుందరమైన ఆరామాన్ని బౌద్ధసంఘం కోసం నిర్మించి ఇచ్చిన వదాన్యురాలు విశాఖ. ఆ ఆరామం పేరు పూర్వారామం ఆ పోషధ దినం అక్కడికి వచ్చిన స్త్రీలనందరినీ విశాఖ "ఏ ఉద్దేశం పెట్టుకొని ఇక్కడికి వస్తున్నారు? దాచిపెట్టకుండా చెప్పండి" అని ప్రశ్నించింది. వృద్ధ స్త్రీలను, మధ్య వయస్కులను, యువతులను, కన్యలను అందరినీ ప్రశ్నించింది విశాఖ మీద వారందరికీ అపారమైన గౌరవం ఉంది కనుక ఉద్దేశాలను దాచిపెట్టకుండా చెప్పారు

వారి ఉద్దేశాలను విశ్లేషించి చూస్తే అన్నీ లౌకిక ప్రయోజనాలకు సంబంధించినవిగానే ఉన్నాయి సంసార సముద్రాన్ని దాటాలనే తపనకు సంబంధించిన ఉద్దేశాలు కనబడలేదు. ఆరోగ్యం చేకూరుతుందని కొందరు, సంపదలు కలుగుతాయని కొందరు, సంతానం కలుగాలని కొందరు, మంచి భర్త లభించాలని కొందరు ఇలా రకరకాల లౌకిక ప్రయోజనాలను వాంఛించిన వారలే ఎక్కువ. పోషధ నియమాలు పాటిస్తే అంతరాయాలు తొలగి తమ తమ వాంఛితాలు నెరవేరుతాయని వారి ఆశయం

విశాఖకు చాలా విచారం వేసింది బుద్ధుని దగ్గరకు వెళ్ళి తన పరిశీలనలో తేలిన విషయాన్ని నివేదించింది. బుద్ధుడు కూడా విచారాన్ని వ్యక్తం చేస్తూ ఇలా అన్నాడు. "జన్మ, జరా, వ్యాధి, దుఃఖం, పరిదేవనం, ఉపాయాసం, మరణం-ఈ చక్రంలో జీవులు నలిగిపోతున్నారు. ఈ చక్రంలో నుండి బైటపడే దారిని వెతుక్కోవడం లేదు. అక్కడే ఉంటూ సుఖం పొందాలనుకొంటున్నారు అది వట్టి భ్రమ. ఆ భ్రమ వల్ల పరిభ్రమణాయాసం తప్ప ఒరిగేదేమీ లేదు." చివరగా క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు.

*యథా దండేన గోపాలో గాః ప్రాజయతి గొచరమ్*
*ఏవం జరా చ మృత్యుశ్చాయుః ప్రాజయతః ప్రాణినామ్* 10-7

గొడ్లను కాసేవాడు కట్టితో పశువులను మేతపొలాలకు తోలుకొని పోవునట్లుగా జరా మరణాలు జీవుల ఆయువును తోలుకొనిపోవుచున్నవి.



# బహుబంధికుడు

బహుబంధికుడు శ్రావస్తిలోని ఒకానొక ధనికుడు అతనికి భిక్షువుగా మారాలని ఆశయం తన ఆశయాన్ని భార్యకు తెలిపాడు "మీరు భిక్షువు కావడం నాకు అభ్యంతరం లేదు. కానీ నాదొక చిన్న కోరిక దాన్ని తీర్చి మీరు భిక్షువుగా మారండి. ఏమీ లేదు, అంత విషం నాకిచ్చి వెళ్ళండి చాలు'' అన్నది భార్య బహుబంధికుడు తన ఆలోచనకు స్వస్తి చెప్పాడు. కానీ హృదయంలో ఆశయాన్ని మాత్రం అట్లే ఉంచుకొన్నాడు

చాలా ఏండ్ల తరువాత అతని భార్య మరణించింది ఇక అతనికి కళ్ళెం వేసేవాళ్ళెవరూ లేదు కనుక భిక్షువుగా దీక్ష తీసుకొన్నాడు. దీక్ష తీసుకొనకముందే అతను తన తరువాతి జీవితానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకొన్నాడు సకల సౌకర్యాలతో కూడిన ఒక చక్కని కుటీరాన్ని నిర్మించుకొన్నాడు వంట చేసి పెట్టేందుకు, ఇతరమైన పనులు చేసి పెట్టేందుకు పనిమనుషులను పెట్టుకొన్నాడు జీవితాంతం చక్కగా గడిచిపోవడానికి తగినంత నిధిని కేటాయించి పెట్టుకొన్నాడు భిక్షువయ్యాక కేవలం అతని వేషం మారిందేకానీ జీవన పద్ధతిలో మార్పు రాలేదు.

తక్కిన భిక్షువులకు ఇదంతా చాలా విడ్డూరంగా తోచింది ప్రత్యక్షంలో, పరోక్షంలో అతని జీవిత విధానం మీద చమత్కార బాణాలు వేసి వినోదించేవారు అతను కనిపించినప్పుడు ఎగతాళి మిళితమైన కంఠస్వరంతో "భిక్షుమహారాజుగారూ, తమరు కుశలమేనా?'' అని కాకువుగా పలకరించి నవ్వేవారు

ఇలా కొన్నిసార్లు జరిగాక బహుబంధికునికి చాలా రోషం వచ్చింది "ఏమి త్యాగం చేసివచ్చారని మిడిసిపడుతున్నారు? నాలాగా కోట్లు వదులుకొని

వచ్చారా? గంజికి లేనివాళ్ళంతా భిక్షువులయిందిగాక పైగా ఈ వేళాకోళమా? మహాతపస్వులులాగా భంగిమలు పోతున్నారు! తపస్సేమిటో నేను చేసి చూపుతాను" అని పైగుడ్డ క్రింది గుడ్డ లాగి పారవేసి ఊరికి దూరంగా ఉన్న అడవికి వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళకతను దుమ్మధూళి కమ్మిన దేహంతో, జటలు కట్టిన తలవెంట్రుకలతో, ఉపవాసాలచే కృశించిన శరీరంతో ఒక పిచ్చివానివలె కనబడసాగాడు

బుద్ధునికి అతని విషయం తెలిసి అతనుండే ప్రదేశానికి వెళ్ళి హితబోధ చేశాడు "భిక్షుజీవనం విముక్తిజ్ఞానాన్ని సంపాయించుకోవడానికే గాని రోషాలు, పంతాలు, పట్టింపులు, స్పర్ధలు, పట్టుదలకు ఆటభూమి కాదు దిగంబరత్వం, జటాధారిత్వం, ఉపవాసాలతో కృశించడం, దుమ్ముధూళిలో పొరలడం-ఇవన్నీ మనిషికి శుద్ధినిచ్చేవి కావు. తృష్ణాఛేదనం, సంశయఛేదనం చేసుకొని ముక్తిమార్గంలో పయనిస్తేనే జన్మ సార్థకమయ్యేది " ముగింపుగా క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు

***న నగ్నచర్యా న జటా న పంకం***
***నానశనం స్థండిలశాయికా వా***
***రజో జవీయం ఉత్కుటికప్రధానం***
***శోధయంతి మర్త్యం అవితీర్ణకాంక్షమ్*** **10-13**

దిగంబరుడుగా తిరగడం వల్ల, జటలు ధరించడం వల్ల, బురదను వళ్ళంతా పూసుకోవడం వల్ల, ఉపవాసాల వల్ల, కటికనేలపై పరుండడం వల్ల, పరుండడం అనేది చేయకుండా ఎల్లప్పుడూ కూర్చొని ఉండడం అనే కసరత్తు వల్ల మనిషికి శుద్ధి ఏర్పడదు తృష్ణా సంశయాలను ఛేదనం చేస్తేనే మనిషి నిర్మలుడయ్యేది

# సంతతిసేనాని

సంతతిసేనాని కోసలరాజైన ప్రసేనజిత్తుకు చాలా విశ్వాసపాత్రుడైన సేనాధిపతి. బ్రాహ్మణుడైనా ద్రోణాచార్యునివలె యుద్ధకళలో ఆరితేరినవాడు ఒకసారి కోసలరాజ్య సరిహద్దులో ఒక సామంత దేశం తిరుగుబాటు చేసినప్పుడు దానిని అణచడానికి కోసలరాజు సంతతి సేనానిని పంపాడు సంతతిసేనాని సామ దాన భేద దండోపాయాలను ఆయా సందర్భాలలో సమయోచితంగా ప్రయోగించి కొంతకాలానికి అక్కడ మామూలు పరిస్థితులను నెలకొల్పి తిరిగి వచ్చాడు రాజు అతనికి అపూర్వరీతిలో సన్మాన సత్కారాలు చేసి ఒక వారం దినాలు అతను కొలువుకు రానవసరం లేదనీ విలాసాలతో వినోదాలతో ఆనందించమని అనుజ్ఞ ఇచ్చాడు. నాట్య సంగీత సాహిత్యాలలో మేటియైన ఒక రాజనర్తకిని సేనానిని అలరించడానికోసమై నియమించాడు

సంతతిసేనానికి ఆ ఏడు దినాలు ఏడు క్షణాలుగా గడచిపోయాయి. కర్కశమైన యుద్ధకళలందే తలమునకలుగా సగజీవితం గడిచిన అతనికి రాజనర్తకి చవి చూపిన సుకుమార కళలైన నాట్య సంగీత సాహిత్యాలు చాలా హాయినిచ్చాయి. జీవితంలో ఇంత ఆనందం ఉంటుందని అతను ఊహించినది కూడా లేదు. కానీ రెప్పపాటు కాలంలో అంతా తారుమారయ్యింది మృత్యువుకు చిన్నవయస్సు పెద్దవయస్సు అనే తారతమ్యం లేదు ధనికుడు పేదవాడు అనే పక్షపాతం లేదు ప్రాజ్ఞుడు అజ్ఞుడు అనే వ్యత్యాసం లేదు ఆ రాత్రి మృత్యువు అకస్మాత్తుగా రాజనర్తకిని కబళించింది. ఏడు దినాలు తన ముందు నెమలివలె నాట్యం చేసిన నర్తకి, కోకిలవలె గానం చేసిన నర్తకి, కవిరాజహంసవలె సాహిత్య సౌరభాలను విడమర్చి చెప్పిన నర్తకి ఇప్పుడు నిర్జీవంగా వికారంగా నోరు తెరచుకొని పడి

ఉంది. ఈ ఆకస్మిక పరిణామానికి సంతతి సేనాని విహ్వలుడై పోయాడు లోకమంతా అతనికి శూన్యంలా కనిపించింది. ఆనందంగా ఉందనుకొన్న జీవితం క్షణంలో భరించరాని ఘోరంగా మారిపోవడం తట్టుకోలేకపోయాడు. శత్రుసేనల మధ్య సింహనాదం చేస్తూ వీరవిహారం చేసిన అతను ఇప్పుడొక బేలయై వలవల ఏడ్చాడు.

ఆ రాత్రంతా అతనికి నిద్ర పట్టలేదు పిచ్చెక్కుతుందేమో అని భయం కూడా కలిగింది. మనశ్శాంతికి దారి ఏదని అన్వేషణ మనస్సులో మొదలయ్యింది. ఇన్నాళ్ళు తను ఉపేక్షిస్తూ వచ్చిన బుద్ధభగవానుడు జ్ఞాపకం వచ్చాడు

మరునాడు సంతతిసేనాని జేతవనానికి వెళ్ళి తథాగతుని పాదపద్మాలకు ప్రణమిల్లి "మీరే నాకిక శరణు" అన్నాడు. శోక సాగరంలో కొట్టుకొనిపోతున్న అతణ్ణి కరుణా సముద్రుడైన బుద్ధుడు సముదాయించుతూ ఇలా అన్నాడు. "శోకంతో దుఃఖంతో బాధతో నీవు కన్నీళ్ళు కార్చడం ఇది మొదటిసారి కాదు అనవరాగ్రమైన (మొదలు తుది లేని) ఈ సంసారంలో నీవు లెక్కలేనన్ని జన్మల్లో కార్చిన కన్నీరు మొత్తం మహా సముద్ర జలానికన్నా ఎక్కువేగానీ తక్కువేమీ కాదు ఈ దుఃఖానికి కారణం ఏమిటి అని విచారించి ఆ కారణాన్ని తొలగించితేనే దుఃఖోపశమనం కలిగేది పై పై ఉపాయాలతో తాత్కాలికంగా దుఃఖాన్ని మరచిపోవడం వివేకం అనిపించుకోదు.." ఇలా అతనికి నెమ్మదిగా నాలుగు ఆర్య సత్యాలను, ద్వాదశాంగచక్ర విషయాన్ని ఇంకా ఇతరములైన నిర్వాణ సాధనలను బోధించాడు. విషాదయోగుడైన సేనానికి ఆ విషయాలన్నీ చప్పున అవగాహనకు వచ్చి శ్రేయోమార్గంలో ప్రవేశించినవాడయ్యాడు సాధన తీవ్రత వల్ల కొన్నాళ్ళలోనే అర్హతుడయ్యాడు. అర్హతుడయినా రాజుగారి కొలువులో తన విధులను యధావిధిగా నిర్వహిస్తూ వచ్చాడు

ఒకనాడు భిక్షువులు అతని ప్రస్తావన తీసుకొచ్చి "ఇప్పుడతడు సేనాపతియా,

శ్రమణుడా, బ్రాహ్మణుడా?" అని బుద్ధుణ్ణి ప్రశ్నించారు సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**అలంకృతశ్చేదపి శమం చరేత్**
**శాంతో దాంతో నియతో బ్రహ్మచారీ**
**సర్వేషు భూతేషు నిధాయ దండం**
**న బ్రాహ్మణః న శ్రమణః న భిక్షుః** **10-14**

శమము, దమము, నియమము, బ్రహ్మచర్యము, సర్వభూతదయ ఉన్నవాడు ఏ అలంకారాలు ధరించినా అతణ్ణి బ్రాహ్మణుడని, శ్రమణుడని, భిక్షువనియే చెప్పవలెను.



**Kālāma Sutra**

*Do not believe in anything (simply) because you have heard it*

*Do not believe in traditions, because they have been handed down for many generations*

*Do not believe in anything simply because it is spoken and rumoured by many*

*Do not believe in anything simply because it is found written in your religious books*

*Do not believe in anything merely on the authority of your teachers and elders*

*But after observation and analysis, when you find that anything agrees with reason and is conducive to the good and benefit of one and all, then accept it and live upto it*

# ఉదానం

సిద్ధార్థుడు ఇరవై తొమ్మిదవ ఏట సత్యాన్వేషణకై రాజప్రాసాదం వదలి పెట్టాడు. గంగానది పరివాహక ప్రదేశాల్లో ఆరేండ్లు సంచారం చేశాడు ఆరాదకాలాముడి దగ్గర ఆ పిమ్మట ఉద్రకరామపుత్రుని దగ్గర యోగ విషయాలు తెలుసుకొని ఆచరించి అనుభవానికి తెచ్చుకొన్నాడు. అయినా తృప్తి కలుగలేదు. శరీరాన్ని శుష్కింపజేసే కఠోర తపస్సు చేశాడు ప్రయోజనం కనపడలేదు. అది సరైన పద్ధతి కాదని తెలుసుకొని మధ్యేమార్గాన్ని అవలంబించి అన్వేషణ కొనసాగించాడు చివరకు తన ముప్ఫైఐదవ ఏట బోధివృక్షం క్రింది సంసార దుఃఖోపశమన దాయకమైన పరమ సత్యాన్ని కనుక్కొన్నాడు. నైరంజరా నది ప్రక్కన ఆ వృక్షం క్రింద ఆ పున్నమి రాత్రి మొదటి జామున పూర్వనివేశానుస్మృతి జ్ఞానం కలిగింది రెండవ జామున దివ్యచక్షు జ్ఞానం కలిగింది మూడవ జామున ప్రతీత్యసముత్పాద సత్యం అవగతమైంది నాలుగవ జామున అంటే ఉషోదయ సమయానికి నాలుగు ఆర్యసత్యాల అవగాహన పూర్ణంగా కలిగింది. (దుఃఖం, సముదయం, నిరోధం, మార్గం) సమ్యక్ సంబోధి కలిగిన సిద్ధార్థుడు బుద్ధుడైనాడు. సమస్త జీవుల దుఃఖోపశమనం కోసం బుద్ధత్వాన్ని సాధిస్తానని యెన్నో యుగాల క్రితం దీపంకరుని ముందు చేసిన ప్రతిజ్ఞ నెరవేరింది.

బుద్ధత్వ ప్రాప్తి కలిగిన ఆ దివ్య క్షణంలో బుద్ధుని వదన కమలం నుండి క్రింది రెండు ఉదానములు (words of exultation of the Buddha) అప్రయత్నంగా - వెలువడినాయి

*అనేక జాతి సంసారం సంధావిస్సం అనిబ్బిసం*
*గహకారం గవేసంతో దుఃఖా జాతి పునప్పునం* 11-8

*గహకారక దిట్ఠోసి పున గేహం న కాహసి*
*సబ్బా తే ఫాసుకా భగ్గా గహకూటం విసంఖితం*
*విసంఖారగతం చిత్తం తన్హానం ఖయమజ్ఝగా* 11-9

ఈ దేహమనే గేహాన్ని నిర్మిస్తున్న నిర్మాత ఎవరో తెలుసుకోవాలని అన్వేషణ సాగించాను ఆ నిర్మాత ఎవరో తెలుపగల బుద్ధి (జ్ఞానం) కలుగనందువల్ల లెక్కలేనన్ని జన్మలెత్తుతూ సంసారంలో ఇన్నాళ్ళు పరిభ్రమించాను. మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ ఉండడం అబ్బా ఎంత దుర్భరమైన దుఃఖం!

ఓయీ గృహనిర్మాతా! నిన్ను కనుక్కున్నాను ఇక నీవు నాకు ఇల్లును కట్టలేవు నీ వాసాలన్నీ విరిగినాయి. నీ దూలం ధ్వంసమయ్యింది. నా చిత్తం నిర్వాణం పొందింది. అర్హత్వ ఫలాన్ని నేను అందుకొన్నాను.

గృహనిర్మాత ఎవరో కాదు - తృష్ణయే.



# మహాధనపుత్రుడు

మహాధనపుత్రుడు తల్లిదండ్రుల అతి గారాబం వల్ల చిన్ననాడే పతనం పాలయ్యాడు విద్యార్జన శ్రమ అసలే చేయలేదు ధనాన్ని విచ్చలవిడిగా వినోదాలకు విలాసాలకు వెచ్చించడం మాత్రమే బాగా నేర్చుకున్నాడు. తలిదండ్రులు గతించాక మరీ స్వతంత్రుడైపోయాడు.

అతనికి తగినవాళ్ళే చుట్టూ పోగయ్యారు నట విట విదూషకులు, వందిమాగధులు, ధూర్తులు, జూదరులు మొ వారు అతనికి ఆప్తులైనారు

యవ్వనం గడిచే సరికి సగం ఆస్తి తరిగిపోయింది. మధ్య వయస్కుడుగా ఉన్నప్పుడతనికి తత్త్వ విషయంలో జిజ్ఞాస కొంచం తలెత్తింది. తగిన గురువులే దొరికారు! "తిను, త్రాగు, సుఖంగా బ్రతుకు, అదియే తత్త్వం, అదియే పరమార్థం" అని బోధించే గురువులే అతనికి సరిపోయారు. మధ్యవయస్సు నుంచి వృద్ధావస్థ ప్రవేశ ద్వారం చేరే సరికి మొత్తం ఆస్తి నాస్తి అయ్యింది ఈ పిప్పి వల్ల ఇక లాభం ఉండదనుకొని ఆప్తవర్గ సభ్యులందరూ ఎవరి దారి వాళ్ళు చూచుకొన్నారు. అతను ఒంటరివాడయ్యాడు. చివరకు అప్పులవాళ్ళు ఇల్లు కూడా లాక్కొన్నారు. అతడు వీధిన పడ్డాడు ఆ ఊరివాళ్ళెవరూ అతనిని చేరదీయలేదు

విచక్షణారహితంగా వ్యయం చేయడమే అతను నేర్చిన విద్య. ఇంకేమీ చేతగాదు బ్రతకడానికి పనికివచ్చే కౌశలం ఏదీ అతని దగ్గర లేదు కౌశలాలు లేకపోతే పోనీ కాయకష్టం చేసుకొని బ్రతకడం కూడా చేతగానివాడు భోగపరాయణత్వం వల్ల దేహపటుత్వం కోల్పోయిన పనికిరాని మనిషి, పైగా ముదుసలి. ఎంతటివారినైనా ఆకలిబాధ దైన్యం పాలుజేస్తుంది. అధ్యాత్మ

బలశూన్యుడైన ఆ వ్యసని విషయం చెప్పాలా? బిచ్చమెత్తడం మొదలు పెట్టాడు. బిచ్చగాళ్ళ దగ్గర కూడా బిచ్చమెత్తే దైన్యానికి అతను దిగజారిపోయాడు. బిచ్చగాడిగానే జీవితశేషం గడిపి చివరకు దిక్కులేని శవంగా జీవితాన్ని ముగించాడు. తృతీయ పురుషార్థానికి (కామానికి) మోతాదుకు మించిన ప్రాధాన్యం ఇచ్చి భ్రష్టులైన మూర్ఖుల పేర్ల వరుసలో మొదటి పేరుగా మహాధనపుత్రుని పేరుకు స్థానం లభించింది

బుద్ధుని ప్రధాన సేవకశిష్యుడైన ఆనందుడు ఒక సంభాషణ సందర్భంలో మహాధనపుత్రుని ప్రస్తావన తెచ్చాడు. అప్పుడు బుద్ధుడు క్రింది రెండు శ్లోకాలను పఠించాడు.

**అచరిత్వా బ్రహ్మచర్యం అలబ్ధ్వా యౌవనే ధనం**
**జీర్ణక్రౌంచ ఇవ క్షీయంతే క్షీణమత్స్య ఇవ పల్వలే** 11-10

**అచరిత్త బ్రహ్మచర్యం అలబ్ధ్వా యౌవనే ధనం**
**శేరతే చాపో ఉ తిక్షీణ ఇవ పురాణాన్యనుతన్వత:** 11-11

చిన్న వయస్సులో విద్యను ఆర్జించక ఆ పిమ్మట యౌవనంలో ధనాన్ని ఆర్జించక ఊరక కాలక్షేపం చేసిన మనుషులు చివరకు దైన్యమైన బ్రతుకుకు గురిగాక తప్పదు చేపలు లేని మడుగులోని ముసలి కొంగల బ్రతుకుతో సమానంగా ఉంటుంది వారి బ్రతుకు.

వేగ సంస్కారం ఉన్నంత వరకు దూసుకుపోయి ఆ పిమ్మట నేల మీద పడిపోయిన బాణాలవలె వారి బ్రతుకులు కూడా చివరకు చతికిలబడిన బ్రతుకులౌతాయి గతించిన పాత విషయాలను నెమరు వేసుకొని నిట్టూర్పుతూ ఉంటారు

# ఉపనందుడు

ఉపనందుడు మంచి వక్త  వినయపిటకంలోని 250 భిక్షు నియమాలు అతనికి కంఠతా వచ్చు ముఖ్యంగా అపరిగ్రహం గురించి నొక్కి చేప్పేవాడు “అపరిగ్రహం పాటించాలంటే అవసరాలను సాధ్యమైనంత తగ్గించుకోవాలి. దానివల్ల పరాధీనత, దైన్యం మొ॥ తొలగుతాయి. వ్యక్తి స్వతంత్రుడుగా, నిర్భీకుడుగా జీవించగలుగుతాడు. అల్పేచ్ఛకు మించిన ఐశ్వర్యం లేదు  పరిగ్రహానికి తోబుట్టువులాంటి లోభాన్ని ఒక కంట కనిపెట్టి ఉండాలి.'' ఇలా అతని ఉపన్యాసం మృదుమధురంగా సాగేది. వ్యక్తులను ధర్మపథంలో పెట్టడానికి అవసరమైనవి నాలుగున్నాయి  ఒకటి దానం, రెండవది ప్రియవాదిత్వం, మూడవది అర్థక్రియ, నాలుగనది సమానార్థత  అర్థక్రియ అంటే ఇతరులను ప్రోత్సహించి ఉత్తేజపరచి ధర్మం వైపు త్రిప్పగల కౌశలం. సమానార్థత అంటే తాను బోధించే విషయాలను తన జీవితంలో ఆచరించి చూపడం. ఈ చివరిది, మొదటిది ఉపనందునిలో లేవు ప్రియవాదిత్వం, అర్థక్రియ మాత్రమే ఉన్నాయి  కనుక అతని జీవితం ఒక వైరుధ్య నిలయంగా  మారింది. పరిగ్రహం వద్దని ఇతరులకు బోధిస్తాడేగానీ తన జీవితంలో ఆచరించడు. లభించిందంతా మూటగట్టి చేర్చి పెట్టుకొనే స్వభావం  వర్షరుతువులో తన నివాసంగా ఎక్కువ లభించే చోటునే ఎన్నుకొనేవాడు

ఒక వర్షరుతువును గడపడానికి ఒక గ్రామీణ విహారానికి పోయాడు. “రుతు సమాప్తి సమయంలో ఎన్ని వస్త్రాలు లభిస్తాయి ఇక్కడ?''అని ప్రశ్నించాడు. ఒకటి అని జవాబు వచ్చింది. అతను మౌనంగా అక్కడ తన పాదరక్షలను వదలిపెట్టి మరో విహారానికి పోయి అదే ప్రశ్న వేశాడు  రెండు అని జబాబు ఉపనందుడు అక్కడ తన దండాన్ని (కఱ్ఱను) వదలిపెట్టి  మరో విహారానికి పోయి

అదే ప్రశ్న వేయగా మూడు అని సమాధానం వచ్చింది అక్కడ అన కమండలాన్ని వదలిపెట్టి చివరగా నాలుగు వస్త్రాలు లభించే చోటును వర్షరుతు నివాసంగా ఎన్నుకొన్నాడు రుతువు ముగిశాక ఆ నాలుగు వస్త్రాలను పరిగ్రహించి కమండలం పెట్టిన చోటుకు వచ్చి అక్కడ తన వాటాగా మూడు వస్త్రాలను తీసుకొని దండాన్ని పెట్టిన చోటుకు పోయి రెండు వస్త్రాలను తీసుకొని చివరగా పాదరక్షలు పెట్టిన చోటుకు పోయి ఆ ఒక వస్త్రాన్ని తీసుకొని మొత్తాన్ని ఒక చాకలి మూటలాగా కట్టి స్వీయ నివాసం చేరాడు



ఏహ్యమైన శోచనీయమైన ఇతని ప్రవర్తనకు అసహ్యించుకొని కొందరు ఈ విషయాన్ని జేతవనంలోని బుద్ధునికి తెలియజేశారు ఉపనందునిలాంటి వాళ్ళకు పరిపోయే విధంగా అప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు



**ఆత్మానమేన ప్రథమం ప్రతిరూపే నివేశయేత్**

**అథాన్యమనుశిష్యాత్ న క్లిశ్యేత్ పండితః** **12-2**



మొదట తనను తాను అనురూపమైన నడవడికలో ఉంచుకొని ఆ పిమ్మటనే ఇతరులకు బోధించవలెను అననురూపమైన నడతవల్ల నిందను పండితుడైనవాడు నెత్తికి తెచ్చుకోరాదు



# ప్రధానికుడు

ప్రధానికుడు కొంత వయస్సు పైబడిన భిక్షువు. ఒక వర్ష రుతువులో యువ భిక్షువులను కొందరిని తీసుకొని ఒక వన విహారానికి వెళ్ళాడు భిక్షుసంఘంలో అందరూ సమానులే అయినా వయస్సునుబట్టి లేదా ఇతర గుణ విశేషాలనుబట్టి వ్యవహారంలో నాయకత్వం కొందరికి సంక్రమిస్తుంది. ప్రధానికుడు వయోవృద్ధుడు కనుక ఆ సమూహానికి నాయకుడయ్యాడు

వన విహారం చేరగానే ప్రధానికుడు అందరిని సమావేశపరచి దీర్ఘోపన్యాసం ఇచ్చాడు "ఈ నాలుగు నెలలు మీరు సద్వినియోగం చేసుకోవాలి ఇప్పుడు మీరు స్రోతాపత్తి భిక్షువులు (మార్గంలో ప్రవేశించిన ప్రథమాస్థలో ఉన్నవారు) ఒక నెల తిరక్కముందే రెండవ స్థాయి అయిన సకృదాగామి స్థితిని మీరు పొందాలి. ఆ పై నెలకు అనాగామి స్థితిని చేరుకోవాలి. వర్షరుతువు ముగిసే లోపల అర్హత్వాన్ని సాధించి మీ జీవితాలను ధన్యం చేసుకోవాలి. ఇది మీకేమీ కష్టం కాదు ఏది మంచి పని, ఏది తగని పని, ఏది మంచి ఆలోచన ఏది పాడు ఆలోచన సదా గమనిక కలిగి ఉండండి. యుక్తమేది అయుక్తమేది అనే విషయంలో ఏమరుపాటుకు తావివ్వకుండా సదా గుర్తుంచుకోవడాన్నే తథాగతులవారు స్మృత్యుపస్థానం అంటారని మీకూ తెలిసిన విషయమే ఇకపోతే మీ శరీరంలోని ప్రతి కదలిక మీద మీరు పలికే ప్రతి పలుకు మీద, మీ అంతరంగంలో కదిలే ప్రతి కదలిక సదా కన్ను వేసి ఉంచండి దీని పేరేమిటో నేను మీకు చెప్పబని లేదు మీకు తెలుసుకదా ఈ సాధన విశేషానికి పేరేమిటో? దీన్ని సంప్రజన్యం అంటారు ఈ స్మృతి సంప్రజన్యములు (mindfulness and awareness) చాలయ్యా మనిషి అర్హతుడు కావడానికి జాగ్రత్తగా వినండి. ఒక పోలిక చెబుతాను మనో గృహద్వారం దగ్గర

కాపలాదారులాంటిది స్మృతి దీపం లాంటిది సంప్రజన్యం. దీపం లేకుంటే చీకటిగా ఉంటుంది కాపలాదారు ఉన్నా నేర్పరులైన క్లేశతస్కరులు (రాగద్వేషాదులు) ఆ చీకటిని కవచం చేసుకొని మనోగృహంలో చొరబడి శాంతి ధనాన్ని కొల్లగొడతారు వట్టి దీపం మాత్రమే ఉండి కాపలాదారు లేకపోతే ఇక క్లేశతస్కరులకు నిరాటంకంగా లోపలికి దూరడానికి పెట్టిన దీపంగా అది అయిపోతుంది. కనుక మీరు ఎల్లవేళలా స్మృతి సంప్రజన్యములను జంటగా కలిగి ఉండాలి పిశాచాలు దూరడానికి అవకాశం వెదికేట్లుగా క్లేశతస్కరులు కూడా చిన్న సందు దొరికితే చాలని ఎదురు చూస్తుంటారు. మీరు అణు మాత్రం కూడా సందు ఇవ్వకుండా జాగ్రత్త పడండి నేను మిమ్మల్ని ఒక కంట కనిపెడుతూనే ఉంటాను ఈ నాలుగు నెలలు ఉదాసీనతకు, సోమరితనానికి, వినోదాలకు నేను సహించను భావి అర్హతులారా, ఇక లేవండి నడుములు బిగించండి, పదండి ముందుకు ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః"

వర్షరుతువయ్యాక యువ భిక్షువులు జేతవనానికి తిరిగివచ్చి బుద్ధునికి తమ అనుభవాలను ఇలా చెప్పారుః "ఈ నాలుగు నెలలు ప్రధానికుని నసతోనే మా జీవితం గడిచిపోయింది మమ్మల్ని ధ్యానం చేయండని ఊరక పురమాయించడమే గానీ అతను మాత్రం ఇష్టం వచ్చినప్పుడు పగలనక, రాత్రనక పడుకొని నిదురపోవడం తప్పించి చేసిన ధ్యానం ఏమీ లేదు ఎప్పుడీ వర్షరుతువు ముగుస్తుంది అనే ధ్యానమే చివరకు మాకు మిగిలింది" ఈ గోడు విన్నాక బుద్ధుడు క్రింది శ్లోకాన్ని పఠించాడు

***ఆత్మానం చేత్ తథా కుర్యాద్ యథాన్యమనుశాస్తి***
***సుదాంతో వత దమయేద్ ఆత్మా హి కిల దుర్దమః*** **12-3**

ఇతరులకు బోధించే తీరులోనే తన ఆచరణ కూడా ఉండవలెను తనను తాను నియమించుకొనిన తరువాతనే ఇతరులను నియమములో పెట్టడానికి ప్రయత్నించవలెను తనను తాను నియమించుకోవడమే కదా చాలా కష్టమైన పని

# కుమారకాశ్యపుని తల్లి

సంసార జీవితంలో తనకు విరక్తి కలిగిందనీ, భిక్షుణిగా అనుమతి ఇవ్వాలని భర్తను ప్రాధేయపడి ఒప్పించి ఒక యువతి, దేవదత్తుని అధీనంలో ఉన్న ఒక విహారంలో భిక్షుణిగా చేరింది. దురదృష్టవశాత్ ఆమె అప్పటికే గర్భవతి. కానీ ఆ విషయం గుర్తించకుండా భిక్షుణిగా చేరింది. రెండు మూడు మాసాలు గడిచేసరికి ఆమె గర్భిణి అనే విషయం అందరికీ తెలిసి ఆమెను తీవ్ర అపరాధం చేసినదిగా భావించి విహారం నుండి బైటకు పంపించి వేశారు.

ఆమె బుద్ధుణ్ణి ఆశ్రయించింది. ఈ విచిత్రమైన సమస్య మీద నిర్ణయం తీసుకొనే భారాన్ని బుద్ధుడు ఉపాలికి (వినయ పిటక పాలకుడు), విశాఖకు (గృహస్థ భక్తురాలు) అప్పగించాడు. వారిరువురు అన్ని విషయాలను సాకల్యంగా చర్చించి ఆమెది దోషం లేదని నిర్ధారించారు భిక్షుణిగా చేరకముందే ఆమె గర్భవతియైనందువల్ల ఇప్పుడు ఆమె మీద నేరాన్ని మోపి వెళ్ళిపొమ్మనడం సరిగాదని వాళ్ళిరువురూ నిర్ణయించారు. ఆమె భిక్షుణిగానే కొనసాగింది. నవమాసాల తరువాత ఆమెకు కలిగిన మగశిశువును కోసలదేశ రాజైన ప్రసేనజిత్తు తన సంరక్షణలోకి తీసుకొన్నాడు. కుమారకాశ్యపుడనే పేరు ఆ శిశువుకు పెట్టారు. కుమార కాశ్యపుడు ఏడేండ్ల వయస్సులో తన తల్లి ఒక భిక్షుణి అని తెలుసుకొని తను కూడా అలాగే భిక్షు జీవితంలోకి పోవాలని కోరాడు. ప్రసేనజిత్తు అతణ్ణి బుద్ధునికి అప్పజెప్పాడు బుద్ధుని సాన్నిధ్య భాగ్యం వల్ల అతడు చిన్న వయస్సులోనే అధ్యాత్మికంగా చాలా పురోగతిని సాధించి ఏకాంతవాసానికి అనుమతిని పొంది సుదూరంలోని ఒక అడవికి వెళ్ళి బుద్ధుడు బోధించిన సత్యాలను ఏకాగ్ర చిత్తంతో చింతన చేసి స్వానుభవానికి తెచ్చుకొని పన్నెండేండ్ల తరువాత తిరిగి జేతవనానికి వచ్చాడు.

అధ్యాత్మ తేజో విలసితమైన అతని ప్రసన్న వదనాన్ని చూచి అందరూ ఆహ్లాదం చెందారు అతణ్ణి గురించి గొప్పగా చెప్పుకోవడం మొదలు పెట్టారు. కుమారకాశ్యపుని పేరే ఎక్కడ విన్నా! పూర్వారామంలో ఉన్న కుమారకాశ్యపుని తల్లికి కూడా ఈ వార్త తెలిసింది తన బిడ్డను గురించి అందరూ గొప్పగా చెప్పుకొంటుంటే ఆమె కళ్ళు చెమర్చి జలజల ఆనందబాష్పాలు కారాయి. ఇక ఒక క్షణం కూడా ఆగలేక వేగం వల్ల తడబడుతున్న అడుగులతో జేతవనానికి వచ్చింది కుమార కాశ్యపుడు గర్భంలో ఉండగా తను ఎంత వ్యథను అనుభవించింది, ఎన్ని అనుమానాలకు, అపనిందలకు గురయ్యింది! అదంతా ఇప్పుడసలు స్మరణకు కూడా రావడం లేదు ఆనందంలో ఓలలాడుతున్నది ఆమె మనస్సు

హర్షాతిరేకంవల్ల బొంగురు పోయిన కంఠంతో సజల నేత్రాలతో "నాన్నా, కుమారా" అని ఆప్యాయంగా పిలుస్తూ అతణ్ణి సమీపించింది. ఆమె అలా వస్తున్న క్షణంలోనే కుమారకాశ్యపుని ముఖ కవళికలు మారిపోయాయి. ప్రసన్న వదనం మాయమయ్యింది భ్రుకుటి ముడిపడింది అసహ్యాన్ని ఏవగింపును వ్యక్తం చేసే ముఖమయ్యింది నోరు తెరచాడు మాటలు కావవి వాక్శూలాలే "ఛీ ఛీ నీవొక భిక్షుణివా? బిడ్డా అని పరిగెత్తుకొస్తున్నావు. ఇంత మమకార కశ్మలాన్ని పెట్టుకొన్నదానివి ఇంటి దగ్గరే పడి ఉండక తగుదునమ్మా అని విహారానికి ఎందుకొచ్చి చేరావు? పో పో నీ ముఖం చూస్తేనే నాకు డోకు వస్తున్నది" అని ఛీదరించుకొని అక్కడ్నుంచి చరచరా వెళ్ళిపోయాడు

పురుగును చూసినట్లుగా చూచిన అతని చూపులు, కర్ణ కఠోరమైన అతని కర్కశ వాక్కులు, ఛీదరించుకొని విసవిస వెళ్ళిపోవడము - అంతా హఠాత్తుగా జరగడంతో ఆమె ఒక్క క్షణం విహ్వలురాలైనా మరుక్షణంలోనే పరమ నైరాశ్యాన్ని చెంది "బిడ్డ బిడ్డ అని మన ఆరాటమేగాని ఎవరు బిడ్డ ఎవరు తల్లి? ఈ మాయలో పడి ఇన్నాళ్ళు అసలు విషయానికి దూరమయ్యాను" అనుకొని ఆమె ఆ క్షణంలోనే అన్ని ఆశాపాశాలను పట పట త్రెంచివేసి అర్హతురాలై పోయింది తల్లి

మీద అపారమైన భక్తి, కృతజ్ఞత ఉన్నవాడైనా కుమారకాశ్యపుడు తల్లిని ముక్తురాలిని చేయడానికోసమై అలా ఆ క్షణంలో లేని కారిన్యాన్ని తెచ్చిపెట్టుకొని తన ఆశయసాధనలో సఫలీకృతుడైనాడు

ఒకనాడు భిక్షువులు బుద్ధుని దగ్గర ఆ తల్లి ప్రస్తావన తెచ్చి "దేవదత్తుడు వెళ్ళగొట్టినప్పుడు ఆమె ఇంటి ముఖం పట్టక మిమ్మల్ని ఆశ్రయించి రక్షణ పొంది చివరకు అర్హతురాలు కూడా కాగలిగింది" అన్నారు బుద్ధుడు వారిని వారిస్తూ క్రింది శ్లోకం చెప్పాడు

***ఆత్మా హి ఆత్మనో నాథః కోహి నాథః పరః స్యాత్***
***ఆత్మనైవ సుదాంతేన నాథం లభతే దుర్లభమ్*** 12-4

తనకు తానే రక్షణం ఇతరులెట్లు రక్షణం కాగలరు? తనను తాను చక్కగా నియమించుకొన్నప్పుడు అతి దుర్లభమైన రక్షణము (అర్హత్వాన్ని) పొందడం జరుగుతుంది

# ఆత్మదత్తుడు

బుద్ధుడు తన 80వ ఏట చివరి పర్యటన రాజగృహ నగర సమీపంలోని వేణువన విహారం నుండి పాటలిగ్రామం (అప్పటికి పాటలిపుత్ర నగరం నిర్మితం కాలేదు) దగ్గర గంగానదిని దాటి వైశాలికి ప్రయాణం - ఇలా ప్రయాణం చేస్తుండగా అస్వస్థుడై, ఇక తన పరినిర్వాణానికి నాలుగు నెలల వ్యవధి ఉందని శిష్యులకు చెప్పాడు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ "భిక్షుసంఘం నా నుండి ఇంకా ఏమి ఎదురు చూస్తున్నది? చెప్పవలసినదంతా చెప్పాను ఆచార్యముష్టిని పాటించలేదు. (కొంచెం చెప్పి కొంచెం చెప్పకుండా దాచిపెట్టడాన్ని ఆచార్యముష్టి అంటారు). సంఘం ఇంకా నా మీద ఎందుకు ఆధారపడాలి? ధర్మదీపాన్ని ఆసరా చేసుకొని తరించండి. నేనిప్పుడు చాలా వృద్ధుడను నా కాలం అయిపోయింది. ఎనభై వయస్సులో ఉన్నాను శిధిలావస్థలో ఉన్న పాతబండికి కట్లు కట్టి ఉపయోగించిన విధంగా ఈ శరీరాన్ని ఇంకా కదిలిస్తున్నాను ధర్మాన్నే జ్యోతిగా, ఆశ్రయంగా తీసుకోండి. ఇక దేని మీదా ఆధారపడకండి" అన్నాడు ప్రశాంత గంభీరస్వరంతో.

ఆ ప్రసంగం ఆత్మదత్తుడనే భిక్షువును తీవ్రంగా కదిలించివేసింది. "తథాగతుని పరినిర్వాణం సమీపిస్తున్నది ఇంక నాలుగు నెలలే గడువున్నది ఇక అలసత్వం పనికిరాదు త్వరపడాలి" అనుకొని సాధనల్లో నిమగ్నమయ్యాడు. తథాగతుల సాన్నిధ్యంలో జరిగే సమావేశాలకు పోవడం కూడా మానుకొన్నాడు. సాధనయందే చిత్తాన్ని లగ్నం చేశాడు. ఇలా మూడు నెలలు గడిచాయి. ఒకనాటి సమావేశంలో ఇద్దరు భిక్షువులు తమలో తాము మెల్లగా మాట్లాడుకునే మాటలు బుద్ధుని చెవులకు సోకాయి "పరినిర్వాణ గడియలు సమీపిస్తూంటే దూరదూరం నుండి భిక్షువులందరూ తథాగతుల దర్శనం కోసం పరుగెత్తుకొని

వస్తుంటే మన మధ్యలోనే ఉన్న ఆ ఆత్మదత్తుడు ఎంత అవిధేయత, ఎంత నిర్లక్ష్యం చూపుతున్నాడో ఆశ్యర్యంగా ఉంది. తథాగతులవారి దర్శనానికి అసలు రావడం లేదు.''

ఆత్మదత్తుని విషయంలో వారికి కలిగిన అపార్థాన్ని తొలగించడానికి బుద్ధుడు ఇలా అన్నాడు "నన్ను ఆరాధించేవాళ్ళు, గౌరవించేవాళ్ళు ఆత్మదత్తునిలాగా మెలగాలి రోజూ నా దర్శనానికి వచ్చి పుష్పాంజలి ఘటించి పాదనమస్కారం చేసి వెళ్ళడం నన్నారాధించినట్లు కాదు, గౌరవించినట్లు కాదు ధర్మాన్ని అనుష్ఠించడమే నన్నారాధించడం అవుతుంది, గౌరవించడం అవుతుంది" చివరగా క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు

**ఆత్మనో ఽర్థం పరార్థేన బహునా ఽపి హాపయేత్**
**ఆత్మనో ఽర్థమభిజ్ఞాయ సదర్థప్రసిత: స్యాత్** **12-10**

అన్య విషయములు అవి ఎంత గొప్పవైనప్పటికీ వాటికోసం ఆత్మముక్తిని ఎవరూ నిర్లక్ష్యం చేయరాదు. అన్ని ప్రయోజనాలు ఆత్మముక్తిలో అంతర్భావములు కనుక దాన్ని సాధించడానికే సర్వప్రయత్నములు చేయవలెను



# శుద్ధోదనుడు

సిద్ధార్థుడు బుద్ధుడయిన తరువాత మొదటిసారిగా కపిలవస్తు నగరానికి వెళ్ళినప్పుడు నేరుగా రాజప్రాసాదానికి వెళ్ళలేదు నగరానికి సమీపంలోని న్యగ్రోధారామంలో విడిది చేశాడు మరునాడు భిక్షాపాత్ర చేత ధరించి తక్కిన భిక్షువులతో కపిలవస్తు నగరవీధుల్లో భిక్షాటన చేస్తుంటే అది శుద్ధోదనునికి తెలిసి చాలా బాధపడ్డాడు. బుద్ధుణ్ణి సమీపించి ఇలా అన్నాడు "ఇక్ష్వాకువంశీయుడవైన నీవు ఇలా నగరవీధుల్లో భిక్షాపాత్ర ధరించి తిరగడం నాకు బాధాకరంగా ఉంది క్షత్రియులకందరికీ ఇది తలవంపులు తెచ్చే చర్య. ఇరవైవేలమందికైనా భోజనం పెట్టగల స్తోమత నాకున్నది. నా కుమారుడవై ఉండీ నీవు ఇలా 'భిక్షాం దేహి' అని గడపల ముందు నిలబడడం తగదు "

లౌకిక దృష్టితో చూస్తే శుద్ధోదనుడు చెప్పినది సరియైన మాటే. కానీ సిద్ధార్థునికి బుద్ధునికి మధ్య ఉన్న తేడాను గుర్తించే ప్రజ్ఞ అతనికి లేదు బుద్ధుడు కాకముందు సిద్ధార్థుడు సుక్షత్రియ ఇక్ష్వాకు వంశీయుడే కానీ బుద్ధుడయిన తరువాత ఆ వారసత్వం అంతరించి మరో వారసత్వం సిద్ధార్థుడికి సంక్రమించిన సత్యాన్ని శుద్ధోదనుడు గుర్తించలేదు. కకృచ్ఛంద్రుడు, విపశ్యి, దీపంకరుడు, కశ్యపుడు, కనకముని మొ॥ పూర్వకాలీన బుద్ధుల వారసత్వం సిద్ధార్థునికి బోధివృక్షం క్రింద సంక్రమించింది వారి సంప్రదాయం పాటించడమే తన ధర్మమవుతుంది బుద్ధులెవ్వరూ రాజప్రాసాదాల్లో నివసించలేదు భిక్షాటనే చేశారు అసంఖ్యేయ కల్పాల బుద్ధవారసత్వం గురించి, దానికి తగిన ఆచరణ గురించి బుద్ధుడు శుద్ధోదనునికి వివరించి అతని మనస్తాపాన్ని చల్లార్చిన సందర్భంలో క్రింది రెండు శ్లోకాలు కూడా చెప్పాడు

ఉత్తిష్ఠేత్ న ప్రమాద్యేద్ ధర్మం సుచరితం చరేత్
ధర్మచారీ సుఖం శేతే ఽస్మిన్ లోకే పరత్ర చ 13-2

జాగరూకుడవు కమ్ము ప్రమాదమునకు (అజాగ్రత్తకు) లోనుగాకుము. పూర్వులచే ఆచరింపబడిన ధర్మమును చక్కగా ఆచరించుము. ధర్మాచరణ కలిగినవానికి ఈ లోకంలోనూ పరలోకంలోనూ సుఖం ఉంటుంది.

ధర్మం చరేత్ సుచరితం న తం దుశ్చరితం చరేత్
ధర్మచారీ సుఖం శేతే ఽస్మిన్ లోకే పరత్ర చ 13-3



# సమ్యజ్ఞుడు

వివిధ వృక్షాల ఆవరణ కలిగిన ఒక విహారంలో సమ్యజ్ఞుడు, రేవతుడు అనే ఇద్దరు భిక్షువులుండేవారు. సమ్యజ్ఞుడు బహిర్ముఖుడు (extrovert) రేవతుడు అంతర్ముఖుడు (introvert) ఎవరి పద్ధతి వారిది అనే దృష్టితో ఆ ఇరువురూ సయోధ్యగానే ఉండేవారు.

విహార ఆవరణ విషయంలో సమ్యజ్ఞునికి చాలా పట్టింపు ఒక ఎండుటాకు పడి ఉండడం చూచినా ఊరుకోలేడు. ప్రొద్దస్తమానం ఆ ఆవరణను చాలా శుభ్రంగా అందంగా ఉంచడంలోనే సరిపోయేది అక్కడికి వచ్చే భక్తులు, అతిధులు ఆ ఆవరణను చూచి ఆశ్యర్యపోయే.వాళ్ళు సమ్యజ్ఞుణ్ణి చాలా మెచ్చుకొనేవాళ్ళు.

ఒకోసారి గాలి బాగా వీచి ఆకులు ఎక్కువ రాలడం, ఆవరణ అంతా దుమ్ముతో నిండిపోవడం ఇలాంటివి జరిగినప్పుడు సమ్యజ్ఞుడికి పని భారం ఎక్కువ అయ్యేది ఒకసారి అతనికి ఇలాంటి సమయంలో కొంచెం చిరాకు వేసి విసురుగా రేవతుడున్న చోటికి వెళ్ళి కటువుగా ఇలా అన్నాడు "విహారంలో ఇంత పని పెట్టుకొని ఊరక కూర్చుంటే ఎట్లా? పక్షులకు చెట్టు ఆశ్రయమిచ్చినట్లుగా ఈ విహారం మనకు ఆశ్రయం ఇచ్చింది దీని బాగోగులు పట్టించుకోకుండా ఊరక కూర్చోవడం ధర్మమా? దానివల్ల నిర్వాణం వచ్చేస్తుందా? ఇన్నేండ్లుగా చూస్తున్నాను ఒక్కనాడైనా నీవు సహాయంగా వచ్చింది లేదు ఏమి మనిషివయ్యా!"

ఇంకెవరైనా పృథక్ జనుడైయుంటే (అధ్యాత్మపథంలో ఇంకా కాలుమోపనివాణ్ణి పృథక్ జనుడంటారు ఇంగ్లీషులో worldling) ప్రతిస్పందన తీవ్రంగా ఉండేది

దీర్ఘకాల సాధనవల్ల శాంత గంభీర స్వభావాన్ని దృఢతరం చేసుకొన్నట్టివాడు రేవతుడు ప్రసన్నంగా ఇలా అన్నాడు. "కర్మమార్గంలో నీవు పురోగమిస్తున్నావని ఇన్నాళ్ళు అనుకొన్నాను. నీవు ఇలా చిరాకు పడడం చూస్తుంటే నీవు దారి తప్పుతున్నట్లు అనిపిస్తుంది. వీర్యం (energy, striving) పాలు ఎక్కువై నీలో సమత లోపిస్తున్నట్లు కనిపిస్తున్నది నీవు ధ్యానం అలవాటు చేసుకొనకపోతే సమత్వాన్ని సాధించలేవు. వీర్యం, ధ్యానం ఇదొక జంట. వీటి మధ్య సమరసత్వం ఉండాలి ప్రజ్ఞ, భక్తి ఇదొక జంట వీటి మధ్య సమరసత్వం ఉండాలి ఈ జంటల్లో ఒకటి మరీ ఎక్కువై రెండోది మరీ తక్కువైపోతే నష్టం చాలా ఉంది సమరసత్వం దెబ్బతినడానికి కారణం స్మృతి సంప్రజన్యములు (mindfulness, awareness) లోపించడమే బుద్ధభగవానుడు పరమ కరుణాహృదయుడై బోధించిన స్మృత్యుపస్థాన సూత్రాన్ని నీవు బాగా పరిశీలించు నీ పరిశీలన తరువాత కూడా నేను నీకు దోషిగా కనబడితే చెంపలేసుకొని నీవు చెప్పినట్లే నడుచుకొంటాను."

రేవతుని హెచ్చరిక బాగా పని చేసింది సమ్యజ్ఞుడు ప్రొద్దస్తమానం ఊడ్చి శుభ్రం చేసే పనిని చాలామటుకు తగ్గించుకొని రేవతుని సూచనలను అనుసరించి క్రమంగా పురోగమనం సాధించి చివరకు అర్హత్వాన్ని పొందాడు

సమ్యజ్ఞుని ప్రస్తావన ఒకసారి వచ్చినప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

**యశ్చపూర్వం ప్రమాద్య పశ్చాత్ స న ప్రమాద్యతి**
**స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చంద్రమా** 13-6

స్మృతి సంప్రజన్య రాహిత్యం వల్ల పూర్వం ఎవడు ప్రమాదచిత్తుడై ఉండి పిమ్మట తన తప్పిదాన్ని గుర్తించి స్మృతిసంప్రజన్యములను చేపట్టి అప్రమాదచిత్తు డౌతాడో అట్టివాడు ఈ లోకాన్ని వెలిగింపజేసే ధర్మజ్యోతి లవుతాడు కప్పబడిన మేఘముల నుండి బైటకు వచ్చి చంద్రుడు లోకమంతా వెన్నెల కురిపించును కదా!

# అంగుళిమాలుడు

కోసలరాజు ప్రసేనజిత్ పురోహితుని పుత్రుడు అంగుళీమాలుడు. అతని అసలు పేరు అహింసకుడు గురుకులవాసం కోసం అతడు తక్షశిలలోని ఒక గురువు దగ్గరకు పంపబడినాడు వినయం, సేవాతత్పరత మొ సుగుణాలచే అహింసకుడు గురువు, గురుపత్నికి మిక్కిలి ప్రీతిపాత్రుడైనాడు తక్కిన విద్యార్థులకు ఇది ఈర్ష్యాకారణమైంది అహింసకుని మీద గురువు మనస్సును విరిచివేయడానికి వాళ్ళు చాలా హేయమైన ఒక పథకాన్ని ఆలోచించి దాన్ని తెలివిగా అమలులో పెట్టారు వారి ఎత్తుగడలు వృథా కాలేదు గురువుకు క్రమంగా అహింసకుని మీద ప్రేమ తగ్గిపోతూ ఆ స్థానంలో ద్వేషం పెరుగుతూ వచ్చింది ఇతను విద్యాభ్యాసం ముగించుకొని స్వదేశానికి మరలునప్పుడు ఇతని వెంట తన పత్ని కూడా వెళ్ళిపోతుందనే అనుమానపిశాచం అతనికి పట్టుకొంది అహింసకుణ్ణి సర్వనాశనం చేస్తేగానీ తనకు మనశ్శాంతి ఉండదనుకొన్నాడు ఒకనాడు అతణ్ణి ఆప్యాయంగా దగ్గరకు పిలిచి "నాయనా అహింసకా, నా దగ్గర పరమోత్తమ తారకవిద్య ఉన్నది. మా గురువుగారు దాన్ని నాకిస్తూ ఈ విద్యను ఇంకెవ్వరికీ చెప్పరాదు ఇది నీతోనే అంతరించిపోవాలి' అని కట్టడి చేశారు, 'అట్లెందుకు గురుదేవా విద్య నశించిపోవడం? మీరు నా కిచ్చినట్లు నేను కూడా నా ప్రియశిష్యుడికి ఇచ్చేలా అనుగ్రహించండి' అన్నాను 'వేయి మానవులను సంహరించిన వానికైతేనే ఇమ్మ' అని షరతు పెట్టారు నా గురువుగారి మాటను అతిక్రమించి నేను నరకానికి పోలేను నీకా పరమోత్తమ తారకవిద్య కావాలంటే నీవు వేయిమందిని సంహరించి గుర్తుగా వేయి బొటన వ్రేళ్ళను నాకు చూపవలసియుంటుంది" అని చాలా నమ్మబలికాడు అహింసకునిలో సుగుణాలతో బాటు మితిమీరిన

గురువిశ్వాసం, అతి అమాయకత్వం, కొంచెం మూర్ఖత కూడా ఉన్నాయి. వేయి గోవులతో తిరిగి వస్తానని సత్యకామజాబాలుడు శపథం చేసి అడవికి వెళ్లినట్లుగా ఇతను కూడా వేయి బొటనవ్రేళ్ళతో తిరిగి వస్తానని శపథం చేసి అడవి మార్గం పట్టాడు.

మొదట్లో చేతులు గజగజ వణికినా, గుండె దడదడ కొట్టుకొన్నా, జలజల చమటలు పోసినా క్రమంగా సంహార క్రియ అతనికి అభ్యాసమైపోయింది మనిషిని చంపడం చీపురు పుల్లను విరచడంతో సమానమైపోయింది కొన్నేండ్లు గడిచాయి వేయి సంఖ్య ఇంకా కాలేదు చదివిన చదువు, అబ్బిన సంస్కారం అంతా తారక విద్యా లోభంలో కొట్టుకపోయింది.

ఆ పరమ క్రూరుడు ఒకనాడు అడవి మార్గంలో ఒంటరిగా పోతున్న బుద్ధుణ్ణి చంపడానికి వచ్చి బుద్ధుని అలౌకిక ప్రభావం వల్ల కత్తిని పారవైచి పాదాక్రాంతుడయ్యాడు. అమిత పాపభారాన్ని మోస్తున్న అతని ఎడల బుద్ధుడు అపారకరుణతో అతడు త్వరితగతిన ముక్తుడయ్యే నిర్వాణ ధర్మాన్ని బోధించి తన వెంట తీసుకెళ్ళాడు అంగులిమాలుడు శ్రమణుడై నిర్వాణసాధనలో తీవ్రయత్న శీలుడయ్యాడు కానీ వ్యక్తిలో వచ్చిన మార్పును లోకం గుర్తించదు కదా! పాత జ్ఞాపకాలతోనే వ్యక్తిని లోకం చూస్తుంది ఒకనాడు అంగుళీమాలుడు భిక్షాటనకు పోయిన సమయంలో పాతద్వేషంతో ఎవరో అతని తల పగిలిపోయేటట్లుగా గుండ్రాయితో కొట్టారు అంగుళీమాలుడక్కడికక్కడే మరణించాడు

భిక్షువులు బుద్ధుణ్ణి అడిగారు "అంగుళీమాలుడు ఏ గతికి పోయాడు? పాపభారం వల్ల నిరయానికి పోయాడా? పరివర్తనానంతరం సంపాయించుకొన్న పుణ్యం పైచేయి అయి దివ్యలోకాలకు పోయాడా లేక పుణ్య పాపాలు సమాన బలం కలిగి మళ్ళీ అతను ఈ లోకంలోనే పుట్టాడా?" బుద్ధుడు సమాధానంగా "అతను క్రిందకూ పోలేదు, పైకీ పోలేదు, మధ్యలోనూ నిలువలేదు అతను

నిర్వాణం చెందాడు" అని క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు

**యస్య పాపం కృతం కర్మ కుశలేన పిధీయతే**
**స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చంద్రమా** 13-7

పూర్వం చేసిన పాపాన్ని ఎవడైతే పుణ్యం ద్వారా అణగద్రొక్కుతాడో అతడు ఈ లోకానికి నిర్వాణమార్గం చూపే జ్యోతి అవుతాడు. కారుమబ్బుల నుండి బైటకు వచ్చిన పూర్ణచంద్రునిలాంటి వాడతడు.



# అనాథపిండకుని కుమారుడు

రాజ్యాలేలే రాజులు కూడా అసూయ పడదగినంత ధనవంతుడు అనాథపిండకుడు. ధనం సంపాయించడంలో అతనికి మించినవాడు లేడు. వ్యయం చేయడంలోనూ అతనికి మించినవాడు లేడు భోగానికిగానీ ధర్మానికిగానీ వినియోగింపబడక ఊరక కూడబెట్టబడే ధనం మట్టితో సమానమని అతని భావన బుద్ధుని చూచిన తరువాత ౨తని ధనవ్యయం ఎక్కువ భాగం ధర్మవ్యయం క్రిందనే మారింది.

బౌద్ధభిక్షువులను ఆహ్వానించడం, ఉపన్యాస కార్యక్రమాలు పెట్టించడం, ఊరి జనాన్నంతా రమ్మని స్వయంగా పోయి పిలవడం ఇలాంటి పనుల్లో తలమునకలౌతున్నాడు "ఈ రోజు మహాకాశ్యపులవారి ప్రసంగం ఉంటుంది ఆయన బుద్ధుని ప్రధాన శిష్యుల్లో ఒకడు ఆయన ఉపన్యాసం వింటుంటే ఈ లోకమే మరచిపోతాము'' అని ఒక వీధిలో కొందరినుద్దేశించి అనాథపిండకుడు ఉత్సాహంగా చెప్పుకుపోతుంటే ఒకడు అడ్డు తగిలి "అయ్యా శ్రేష్ఠిగారూ, ఆ ఉపన్యాసాలకు ఊరి జనమంతా ఎందుకులెండి? తమ కుమారరత్నానికి ఒకడికి పెట్టించండి ఆ సభ, చాలు. దానివల్ల ఈ ఊరు బాగుపడితే అదే మాకు పదివేలు'' అన్నాడు

అనాథపిండకుని కుమారుడు కాలనాథుడు ఆ ఊరిలోని అల్లరి యువకులకు నాయకుడు ఎప్పుడూ వాహనాల మీదే తిరుగుతుంటాడు ముందు మూడు వాహనాలు, వెనుక ఐదు వాహనాలు, మధ్యలో కాలనాథుడి వాహనం అమిత వేగంతో వీధుల్లో తిరుగుతుంటాడు. రాజాధికారులు కూడా అతని అల్లరి

చూసీ చూడనట్లుగా పోతుంటారు ఆ రాజ్యానికి కాబోయే రాజు ఇతని స్నేహితుడు కనుక కాలనాధుడు ఆడింది ఆట, పాడింది పాటగా చెల్లిపోతున్నది. అతణ్ణి ఏమి అని అడిగే సాహసం ఎవరూ చేయడం లేదు

కాలనాధుడు చేసే ఇంత రాచకార్యానికి ధనం లేకపోతే కుదరదు జట్టుగాళ్లను అదే పనిగా మేపాలి. వారి విలాసాలకు, వినోదాలకు, విహారాలకు ధనాన్ని నీళ్ల ప్రాయంగా ఖర్చు చేయాలి కాలనాధుడు ఇందులో ఏమీ తీసిపోలేదు కానీ అతనికి స్వంత సంపాదనంటూ ఏమీ లేదు అనాధపిండకుని దగ్గరనుండే తన దిన ఖర్చులకు వందలు వేలు తీసుకొని పోయేవాడు

"నాన్నా ఈ రోజు యువజనమండలి సాహిత్యగోష్ఠి పెట్టుకొన్నాము ఓ నూరు వరహాలు అవసరమౌతుంది" అన్నాడు కాలనాధుడు వీధిలో నిన్న విన్న వెటకారం మాటలు అనాధపిండకుని చెవుల్లో ఇంకా గింగురుమంటున్నాయి "బాబూ, ఈ రోజు నుండి ఒక నియమం పెట్టుకున్నాను 'ఊరక డబ్బు ఎవ్వరికీ ఇవ్వరాదని' నీకు నూరు వరహాలు రోజూ కావాలి కనుక ఒక పని చేయి బౌద్ధ విహారానికి రోజూ వెళ్ళి వచ్చే పని చేస్తూండు ఆ పనికి నూరు వరహాలు రోజూ ముట్టజెప్పుతాను" అన్నాడు అనాధపిండకుడు

కాలనాధుడికి బౌద్ధభిక్షువులంటే ఏమాత్రం గౌరవం లేదు. 'శరణం గచ్ఛామిగాళ్ళు' అని ఎగతాళి చేస్తుంటాడు అయినా ఇప్పుడు దిన ఖర్చులకోసమైనా బౌద్ధ విహారానికి వెళ్ళిరాక తప్పదు వాహనం మీద బయలుదేరాడు

"విహారానికి వెళ్లి వచ్చాను నాన్నా ఏదీ డబ్బులు" అని తండ్రిని అధికారిక స్వరంతో అడిగాడు "నీవు బౌద్ధ విహారానికి వెళ్లి వచ్చావో వేశ్యా గృహానికి వెళ్లి వచ్చావో నాకెలా తెలుస్తుంది? వెళ్లి వచ్చిన దానికి గుర్తుగా బుద్ధుని ప్రవచనాల్లో ఒక దానిని ఒప్పజెప్పి అర్థం వివరించి చెప్పగలిగావంటే నూరేమిటి వేయి వరహాలు రోజుకిస్తాను వెళ్లు" అన్నాడు తండ్రి

కాలనాధుడు మళ్లీ విహారానికి వెళ్లాడు. అక్కడ బుద్ధుని ప్రవచనం సాయంకాలం జరుగుతుందని తెలిసింది. అంతదాకా అక్కడే వేచి ఉండి ఉపన్యాస సమయానికి, ముందు వరుసలో కూర్చున్నాడు. బుద్ధవచనాన్ని ఏకాగ్రంగా విన్నాడు. బుద్ధుడు అర్థంగాని అయోమయ ప్రసంగం చేయడం లేదు ఎంత మందమతికైనా చక్కగా అర్థమయ్యే రీతిలో పరమ గంభీరమైన విషయాలను బోధిస్తున్నాడు అంగుళీమాలుండంతటివాడు బుద్ధుని వాగమృత ప్రవాహంలో కొట్టుకొనిపోగా కాలనాధుడొకలెక్కా? అతడు ఆ రాత్రి ఇంటికి కూడా వెళ్లలేదు. విహారంలో ఒకమూల కూర్చొని తాను విన్న పరమ సత్యాలను ధ్యానం చేస్తూ ఉండిపోయాడు.

మరునాడు అనాధపిండకుని ఆహ్వానం మన్నించి అతని ఇంటికి బౌద్ధ సంఘమంతా కదిలింది కాలనాధుడూ వారితోనే కలిసి ఇంటికి బయలుదేరాడు వారికి చేయవలసిన పూజా సత్కారాలన్నీ అయ్యాక తన కుమారుని సంగతి అనాధపిండకునికి జ్ఞాపకం వచ్చి అతని వైపు చూచాడు ఒక వృద్ధ భిక్షువుకు చాలా వినయంగా విసనకఱ్ఱను విసురుతూ సేవించడం కనబడింది "హమ్మయ్య, బుద్ధిమంతుడు అయ్యా"డనుకొని వేయి వరహాల సంచిని అతనికివ్వబోయాడు "నాన్నగారూ ఆ సంచిని మీదగ్గరే ఉంచండి. నేను నిన్న విన్న బుద్ధవచనానికి వెల కట్టుతున్నారు. మీ మొత్తం ఆస్తి అంతా ఒకచోట కుప్పపోసి తూచినా బుద్ధుని ఒక్క వాక్యానికి సమం కాజాలదు వేయివరహాలు ఎరజూపి నన్ను సంసారకూపం నుండి పైకి లాగి బుద్ధుని పాదపద్మాల ముందు పడవేశారు. ఆ ఒక్క మేలు చాలు, ఇంత మేలు లోకంలో ఏ తండ్రీ ఏ తనయుడికీ చేసి ఉండలేదు" అన్నాడు.

అనాధపిండకుడు పరమానందభరితుడై బుద్ధుని పాదపద్మాలకు మళ్లీ మోకరిల్లాడు "అనాధపిండకా, లెమ్ము ఇప్పుడు నీ కుమారుడు స్రోతాపత్తి

ఫలాన్ని పొందినవాడైనాడు అతని విషయంలో నీకిక విచారం వలదు" అని క్రింది శ్లోకాన్ని పఠించాడు.

**పృథివ్యా ఏకరాజ్యాత్ స్వర్గస్య గమనాద్ వా**
**సర్వలోకాధిపత్యాద్ వా స్రోతాపత్తిఫలం వరమ్ 13-12**

పృథివియందు ఏకచ్ఛత్రాధిపత్యం కంటెనూ, స్వర్గంలో ఇంద్రపదవి కంటెనూ, సర్వలోకాధిపత్యమైన బ్రహ్మపదవి కంటెనూ స్రోతాపత్తి ఫలము గొప్పది.



---

Note పది సంయోజనాల్లో (*fetters*) మూడింటిని (సత్కాయదృష్టి = *self-illusion*, శీలవ్రతపరామర్శ = *clinging to mere rites and ceremonies*, విచికిత్స = *doubt*) ఛేదించినవాడు స్రోతాపన్నుడు

# ఏరకపత్రుడు

ఏరకపత్రుడు చాలా ధనికుడు ఆ ధనాన్ని వారసత్వంగా పొందడానికి ఒకే ఒక కుమార్తె మాత్రమే ఉంది. ఆమెకు పెండ్లీడు వచ్చింది. ఏరకపత్రుడు ఆలోచనలో పడ్డాడు "ఎలాంటివాడికి ఇచ్చి పెళ్ళి చేస్తే తన కుమార్తె జీవితం బాగుంటుంది?" అని ఆలోచన మొదలు పెట్టాడు తనకు సరితూగే ధనికులతోగానీ, మించిన ధనికులతోగానీ సంబంధం చేయాలనే ఆత్రం అతనికి లేదు సాధారణంగా ధనికులు ధనమదం తలకెక్కినవాళ్ళుగా ఉంటారు ధనం చేత లభించే అనేక దుర్వ్యసనాలకు బానిసలై ఉంటారు కానీ వాళ్ళలోనూ అక్కడక్కడ కొందరు చాలా ఉత్తములు, యోగ్యులుంటారు పేదవాడికిచ్చి వాణ్ణి నూత్నధనికునిగా చేస్తే అందులోనూ అపాయం ఉంది తటాలున ధనికులైన పేదవాళ్ళకు ఆ ధనానికి తగిన సంస్కారం అబ్బడానికి చాలా ఏండ్లు పట్టుంది ఇలా పరిపరి విధాలుగా ఆలోచన చేసి అతను ఒక నిర్ణయానికి వచ్చాడు అధ్యాత్మిక వాసన ఉన్నవాడికి ఇస్తే తన కూతురు జీవితం క్షేమంగా ఉంటుందని భావించాడు. అధ్యాత్మిక వాసనను గుర్తించడం ఎలా? కాంతివంతమైన దేహమా? మంచి పోషకాహారాన్ని తినేవాడికీ అది ఉంటుంది బాహ్య చిహ్నాలా? డాంబికులు చాలా మంది ఆ చిహ్నాలు ధరించి ఉంటారు. చివరగా కొన్ని ప్రశ్నలు తయారు చేసి పెట్టుకొన్నాడు తన కుమార్తెను అడగడానికి వచ్చిన యువకులను ఒకరికి వేసిన ప్రశ్నలు మరొకరికి వేయకుండా ఉండడానికోసం చాలా ప్రశ్నలు తయారు చేసి పెట్టుకొన్నాడు

చాలా మంది యువకులు అతని యక్ష ప్రశ్నలకు నిలవలేకపోయారు ఉత్తరుడనే యువకుడు తన అదృష్టాన్ని పరీక్షించుకొనడానికి ప్రశ్నలపత్రుని ఇంటికి వెళ్ళాడు. వారణాసికి బుద్ధుడు వచ్చినప్పుడల్లా విధిగా ఆయన ప్రసంగాలను విని

చింతన చేసిన యువకుడు ఉత్తరుడు. అతనికి అదృష్టం కలిసివచ్చింది. ఆనాడు ప్రశ్నలపత్రుడడిగిన ప్రశ్నలు తను సులభంగా సమాధానం ఇవ్వగల ప్రశ్నలే.

"స్వతంత్రుడని ఎవరిని చెప్పవచ్చు?" అని మొదటి ప్రశ్న.

"ఇంద్రియాలను తన వశంలో పెట్టుకొన్నవాణ్ణి స్వతంత్రుడనవచ్చు" అని ఉత్తరుడు జవాబిచ్చాడు

'కుబేరుని ధనరాశికి సమానమైన ధనరాశియైనా సరే అది అంతా పిడికెడు మట్టితో ఎప్పుడు సమానమవుతుంది" అని చాలా తేలిక ప్రశ్న రెండవ ప్రశ్న "దానానికి, భోగానికి వినియోగించకుండా కూడబెట్టినప్పుడు" అన ఉత్తరుని జవాబు

"మామూలు మూర్ఖుడెవడు? పండిత మూర్ఖుడెవడు?" అని మూడవ ప్రశ్న 'పండిత మూర్ఖుడికి చాలా తెలుసు అని భ్రమించేవాడు మామూలు మూర్ఖుడు పదాలు అర్థాన్ని తెలపడానికి వాడబడే వట్టి సంకేతాలనే ప్రాథమిక విషయాన్ని కూడా గమనించక పదాలకు పర్యాయపదాలు తెలుసుకొంటూ దాన్నే జ్ఞానార్జనగా భ్రమించేవాడు పండిత మూర్ఖుడు" అని ఉత్తరుని సమాధానం.

చివరి ప్రశ్నగా "ఒక కల్పం ఎన్ని సంవత్సరాల పరిమితి కలిగి ఉంది? ఇప్పటికి ఎన్ని కల్పాలు గడిచాయి?" అని అడిగాడు. ఉత్తరుడు సమాధానమిస్తూ "మీరడిగిన ప్రశ్నకు జవాబు అంకెల్లో చెప్పడం సాధ్యం కాదు. ఊహాచిత్రం ద్వారా చెబుతాను పదిమైళ్ళ పొడవు వెడల్పు ఉండే ఏకశిలను ఊహించండి. మన వారణాసి పట్టురుమాలుతో నూరేండ్లకొక పర్యాయం ఆ శిలను అలవోకగా స్పృశిస్తూ ఉంటే ఆ శిల ఆ స్పర్శలకు పూర్తిగా అరిగిపోవడానికి పట్టే కాలం కంటే కల్పం యొక్క కాలం ఎక్కువే. ఇక మీ ప్రశ్నలో రెండవ భాగానికి సమాధానంగా మరొక ఊహాచిత్రం చూపుతాను. గంగానది ఇసుకరేణువులెన్ని ఉన్నాయో అన్ని గంగానదులను ఊహించండి ఆ అన్ని గంగానదుల మొత్తం ఇసుక రేణువులు

ఎన్ని ఉంటాయో అన్ని కల్పాలు ఇప్పటికి గడిచాయి" అన్నాడు ధీమాగా ఈ ఊహాచిత్రాలు అతను ఈవరకే బుద్ధుని ఉపన్యాసాల్లో వినియున్నాడు. ఏరకపత్రుడతనిని తగిన అల్లుడుగా భావించి కుమార్తెనిచ్చి వివాహం చేశాడు

ఒకనాడు ఉత్తరుడు సకుటుంబంగా బుద్ధుని ప్రసంగం వినడానికి వెళ్ళాడు. కొంత ఆలస్యమైనందువల్ల వీళ్లు ఉపన్యాస స్థలానికి సకాలంలో చేరలేకపోయారు వీళ్ళు చేరిన సమయంలో బుద్ధుని వదనకమలం నుండి విన్న శ్లోకమిది.

**కృచ్ఛ్రో మనుష్యప్రతిలాభః కృచ్ఛ్రం మర్త్యానాం జీవితమ్**
**కృచ్ఛ్రం పద్ధర్మశ్రవణం కృచ్ఛ్రో బుద్ధానాం ఉత్పాదః** **14-4**

మనుష్యజన్మ దుర్లభం మానవ జీవితం దుర్లభం. సద్ధర్మ శ్రవణ భాగ్యం దుర్లభం. బుద్ధత్వ ప్రాప్తి దుర్లభం

# అసంతుష్టుడు

జేతవన విహారంలోని ఒక యువక భిక్షువును చదువు కోసం మరో విహారానికి పంపడం జరిగింది. ఆ సమయంలోనే ఆ యువక భిక్షువు తండ్రి చనిపోయాడు అతడు ప్రాణం వదలే ముందు తన తమ్మునికి నూరు కార్షాపణములు అప్పగించి వాటిని విహారంలోని తన కొమారునికి అందచేయవలసినదిగా కోరాడు

యువక భిక్షువు చదువు ముగించుకొని జేతవన విహారానికి వచ్చిన వెంటనే అతని పినతండ్రి జరిగిన విషయాలు చెప్పి నూరు కార్షాపణములను అతని ముందర ఉంచాడు

"సన్న్యాసికి కార్షాపణములతో పనేముంది? నాకవసరం లేదు ఈ పైకం మొత్తం మీ ఇష్టం వచ్చినట్లుగా ఖర్చు చేసుకోండి" అన్నాడు యువక భిక్షువు.

"ఇప్పుడు అవసరం అనిపించకపోవచ్చు కానీ భవిష్యత్తులో ఎప్పుడో 'ఆ డబ్బు ఇప్పుడు చేతిలో ఉంటే బాగుండేది కదా' అనిపించవచ్చు అలా అనిపించినప్పుడు నిస్సంకోచంగా నాకు వార్త పంపు నీకు వీటిని తెచ్చిస్తాను" అని పినతండ్రి వెళ్ళిపోయాడు

కొన్నాళ్ళు గడిచింది యువక భిక్షువు మనస్సులో నూరు కార్షాపణములు గలగలలాడడం మొదలు పెట్టింది "అంత పైకాన్ని అనాలోచితంగా తిరస్కరించానే" అని తనను తానే తిట్టుకోవడం మొదలుపెట్టాడు కానీ పినతండ్రికి వార్త

పంపలేదు. ఆయన ముందర లోకువైపోతానేమో అనే అహం అడ్డు వస్తున్నది. పోనీ మనస్సును కార్షాపణములనుండి మరలించగలుగుతున్నాడా అంటే అదీ చేతగావడం లేదు. చచ్చిన ఎలుకతో వ్యాపారం మొదలుపెట్టి క్రమంగా కోటీశ్వరుడైన ఎలుకశెట్టి కథ అతనికి జ్ఞాపకం వస్తుంది. నూరు కార్షాపణములకు తెలివితేటలు జోడిస్తే ఎంతైనా సంపాయించి ధనికుడు కావచ్చు కదా అనే ఆలోచనలు అతని మనస్సును ఆక్రమించాయి

ఇలా కౌకృత్యం (పశ్చాత్తాపం) పాలవడం వలన అతను క్రమంగా కృశించిపోవడం జరిగింది. అతను అలా కృశించి పోవడానికి కారణమేమిటి అని అక్కడి భిక్షువులు ఆలోచించారు. పూర్వాపరాలు తెలిసిన కొందరు అతని రుగ్మత ఏమిటో పసిగట్టారు. బుద్ధునికి విషయం చెప్పారు

బుద్ధుడు అతణ్ణి తన సమ్ముఖానికి పిలిపించి ఇలా అన్నాడు : "నీకు భిక్షుజీవితం మీద విరక్తి కలిగినట్లుంది. మరి గృహస్థ జీవితానికి వెళ్తావా? అంత పెట్టుబడి నీదగ్గరుందా? కాయకష్టమే ప్రధానమైన పెట్టుబడిగా ఉండే వ్యవసాయంలోకి దిగినా నీకు నూరు కార్షాపణములు చాలవు కదా! ఒక జత ఎద్దులు కొనాలి, నాగలి కాడి మేడి వగైరా కొనాలి, పాఱ, గడ్డపాఱ, కత్తి, కొడవలి మొ. పనిముట్లు కొనాలి. ఫలం చేతికి రావడానికి ఓ నాలుగు నెలలు పట్టుంది. అంతవరకు ఇల్లు గడవాలి. పాత్రలు, బియ్యం, పప్పు, ఉప్పు, గుడ్డలు ఇలా ఎంతో వ్యయం భరించాలి. నూరు కార్షాపణములు ఏ మూలకు? పోనీ తెలివితేటలు ఉపయోగించి నీవు నూరును కొన్ని ఏండ్లలో కోటిగా చేస్తావనుకో! దానివలన నీవు తృప్తి పొందగలవా? ధనం వలన తృప్తిని పొందడం ఎండమావుల్లో నీటిని త్రాగడం ఒకటవుతుంది. అది అసాధ్యం" ముగింపుగా క్రింది రెండు శ్లోకాలను కూడా చెప్పాడు.

న కార్షాపణవర్షేణ తృప్తిః కామేషు విద్యతే
అల్పాస్వాదా దుఃఖాః కామా ఇతి విజ్ఞాయ పండితః 14-8

అపి దివ్యేషు కామేషు రతిం స నాధిగచ్ఛతి
తృష్ణాక్షయరతో భవతి సమ్యక్ సంబుద్ధశ్రావకః 14-9

కార్షాపణవర్షం వలన మానవుడు కామములను పూర్తిగా తీర్చుకోలేడు కామములు అల్పసుఖాన్ని, బహుళ దుఃఖాన్ని ఇస్తుందని తెలుసుకొన్న బుద్ధిమంతుడు దేవలోక సుఖాల మీద కూడ వాంఛను వదలిపెట్టాడు తృష్ణను నాశనం చేయడం మీదనే మనస్సును పెట్టాడు.



# సంబహుళ భిక్షువులు

"ఏది సుఖము?" అనే అంశం మీద చర్చ చేయడానికి చాలా మంది భిక్షువులు ఒక చోట గుమికూడి చర్చల్లోకి దిగారు చర్చకు శ్రీకారం చుట్టూ ఒక భిక్షువు ఇలా అన్నాడు. "ధనమూలమిదం జగత్ అనే సూక్తి అక్షరాల సత్యం ధనం సాక్షాత్తుగా సుఖం కాకపోయినా సుఖానికి కారణంగా ఉంటున్నది ధనం వల్ల సుఖం కలుగుతున్నది అంటే సుఖం ధనం యొక్క కార్యమైందన్నమాట కార్యకారణాలకు అభేదం చెప్పుకోవచ్చు కనుక ధనమే సుఖము అని ప్రతిపాదిస్తున్నాను."

మరొక భిక్షువు లేచి ఆ ప్రతిపాదనను ఇలా ఖండించాడు "మీరు చెప్పినది హేతుబద్ధంగా లేదు ధనానికి సుఖానికి నియత సంబంధం లేదు. ధనికులుగా ఉన్నవాళ్ళలో చాలా మంది దుఃఖితులుగానూ, ధనం లేని అకించనులు చాలామంది సుఖితులుగానూ ఉండడం లోకంలో ప్రత్యక్షంగా కనబడుతున్నది కనుక మీ హేతువు నిలవదు. ఇక నా ప్రతిపాదన వినుడు సుఖమని దేన్ని అంటున్నాము? అనుకూలమైన వేదననే (వేదనా = feeling) కదా మనం సుఖమనేది. సుఖం లేకపోవడమంటే ఏమిటి? ప్రతికూల వేదనలకు లోను కావడమే కదా! అనారోగ్యంతో ఉన్నవాడు ప్రతికూల వేదనలతో సతమతమవుతూ సుఖం లేనివాడుగా ఉంటాడు కనుక ఆరోగ్యమే సుఖమని నేను ప్రతిపాదిస్తున్నాను"

మరొక భిక్షువు లేచి ఇలా అన్నాడు "నేను ఎవరి ప్రతిపాదనలను ఖండించడానికిగానీ సమర్థించడానికి గానీ లేచి నిలబడలేదు 'అవివాద పరమా హి శ్రమణస్య ధర్మాః' అని తథాగతులవారు సెలవిచ్చియున్నారు కనుక నేను వాదము చేయను నాకు తోచినది మీ ముందుంచుతాను, వినండి ఇంద్రియార్థ

సన్నికర్షం వలన కలిగే అనుకూల వేదనలు, ప్రతికూల వేదనలు సర్వప్రాణి సాధారణ ధర్మాలు. మానవుడి విషయం ఆలోచించేటప్పుడు మనం ఆ స్థాయినుండి గాక ఇంకొంత పై స్థాయినుండి ఆలోచించాలి. మానవుడు బుద్ధిజీవి భావాలలో తృప్తిని వెదుక్కొనే జీవి గుంపులో గోవిందా అయిపోవడానికి ఇష్టపడడు. వైశిష్ట్య సంపాదనలో సుఖాన్ని వెదుక్కొంటాడు వారి వారి అభిరుచిని బట్టి వైశిష్ట్య సంపాదనకు కళలనుగానీ, పరిశోధనారంగాన్ని గానీ, పాండిత్యాన్ని గానీ అధికార రంగాన్ని గానీ దేన్నో ఒకదాన్ని పట్టుకొని ఆత్మతృప్తికై ప్రయత్నిస్తుంటాడు. ఈ అంశాన్ని తీసివేస్తే మానవులకు, తిర్యక్కులకు మధ్య ఉన్న భేదం అంతరించిపోతుంది''

మరొక భిక్షువు లేచాడు. వాదం చేయడానికి కాదు. ఆ చర్చ విసుగనిపించి అక్కడ్నుంచి లేచి తన కుటీరానికి వెళ్ళడానికి తన కుటీరానికి వెళ్ళడానికి ముందు బుద్ధుని కుటీరానికి వెళ్ళి ఊడలమట్టి క్రింద జోరుగా జరుగుతున్న చర్చ విషయం తెలియజేశాడు. అది విని బుద్ధుడు క్రింది శ్లోకం చెప్పి ఊరుకున్నాడు.

**సుఖో బుద్ధానాం ఉత్పాద: సుఖా సద్ధర్మదేశనా**
**సుఖా సంఘస్య సామగ్రీ సమగ్రాణాం తప: సుఖమ్** **14-16**

సమస్త జీవుల హితం కోసం అవతరించే బుద్ధుల అవతారం సుఖమైనట్టిది వారు చేసే సద్ధర్మోపదేశం సుఖమైనట్టిది. సంఘంలో సామరస్యం సుఖమైనట్టిది. సామరస్యంతో ఉండి చేసే తపస్సు సుఖమైనట్టిది



# నదీజలాల వివాదం

రోహిణి నదికి ఒకవైపు శాక్యులు, మరో వైపు కోలియులు ఉండేవారు ఈ రెండు తెగల మధ్య సంబంధ బాంధవ్యాలు, పరస్పర సహాయ సహకారాలు, ఇచ్చిపుచ్చుకోవడాలు ఉంటుండేవి ఒక సంవత్సరం వర్షాలు సరిగా పడకపోవడం వల్ల రోహిణి నదిలో నీళ్ళు తగ్గిపోయాయి ఇరువైపుల ఉన్న పంట పొలాలకు సరిపోయేటంత నీళ్ళు ప్రవహించడం లేదు రెండు తెగలకు అప్పుడు తలెత్తింది వివాదం అది చిలికి చిలికి గాలివాన లాగా మారింది. తాడోపేడో తేల్చుకోవడానికి రెండు వర్గాలు మహారోషంతో కయ్యానికి తలపడ్డాయి

బుద్ధునికి ఈ దారుణ పరిణామాలు తెలిసి హుటాహుటిన కపిలవస్తు నగరానికి వచ్చి ఆ రెండు తెగల మధ్య సామరస్యాన్ని నెలకొల్పాడు నదీజలాల వాటా విషయంలో కయ్యానికి దిగి ఆ నదీజలాలకన్నా ఎక్కువ రక్తాన్ని చిందించడం అవివేకం అని వారందరికీ నచ్చజెప్పి ఇరువర్గాలకు ఆమోదకరమైన రీతిలో ఆ వివాదాన్ని పరిష్కరించాడు

ఆ వివాదాన్ని పరిష్కరిస్తున్న సందర్భంలో చేసిన హితోపదేశంలో క్రింది మూడు శ్లోకాలు కూడా ఉన్నాయి

**సుసుఖం వత జీవామో వైరిష్వవైరిణః**
**వైరిషు మనుష్యేషు విహరామో ఉ వైరిణః** 15-1

శత్రుభావం లేనివాళ్ళమై శత్రుత్వ భావం కలిగినవాళ్ళ మధ్య కూడా మేము సుఖముగా జీవించగలుగుచున్నాము.

**సుసుఖం వత జీవామ ఆతురేష్వనాతురా:**
**ఆతురేషు మనుష్యేషు విహరామో ౨ నాతురా:** 15-2

శారీరక మానసిక బాధలతో తపిస్తున్న జనుల మధ్య మేము ఆ బాధలు లేనివారమై సుఖముగా జీవిస్తున్నాము

**సుసుఖం వత జీవామ, ఉత్సుకేష్వనుత్సుకా:**
**ఉత్సుకేషు మనుష్యేషు విహరామ అనుత్సుకా:** 15-3

ఇంద్రియవిషయలోలుర మధ్య ఆ లోలత లేనివారమై సుఖముగా జీవిస్తున్నాము



# ప్రసేనజిత్

ఒకనాడు ప్రసేనజిత్ సుష్టుగా భోజనం చేసి బుద్ధుని ప్రవచనం వినడానికి వచ్చాడు అమితాహార సేవనం వలన అతనికి కూర్చున్న వెంటనే నిద్ర ముంచుకొచ్చింది ప్రవచనం మీద మనస్సును పెట్టలేకపోయాడు కునికిపాట్లు మొదలయ్యాయి ఇది గమనించిన బుద్ధుడు మితాహార సేవనం వలన కలిగే ప్రయోజనాలు, అమితాహార సేవనం వలన నష్టాల గురించి వివరించాడు ఆ సందర్భంలో క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు

***ఆరోగ్యం పరమో లాభః సంతుష్టిః పరమం ధనమ్***
***విశ్వాసం పరమా జ్ఞాతిః నిర్వాణం పరమం సుఖమ్*** **15-8**

ఆరోగ్యానికి మించిన లాభం లేదు సంతుష్టికి మించిన ధనం లేదు. విశ్వాసపాత్రుడైన మిత్రునికి మించిన ఆత్మబంధువు లేదు నిర్వాణానికి మించిన సుఖం లేదు

* * *

ప్రసేనజిత్ కోసల దేశరాజు ఇతని సోదరి విదేహిని మగధరాజైన బింబిసారునికిచ్చి మైత్రి చేసుకొన్నాడు కానీ బింబిసారుని కుమారుడు, తన మేనల్లుడూ అయిన అజాతశత్రు తన తండ్రిని చెరలో ఉంచి సింహాసనం ఎక్కిన తరువాత సమస్యలు ప్రారంభమయ్యాయి అజాతశత్రుకు విస్తరణకాంక్ష ఎక్కువ. తన రాజ్యానికి హద్దుగా మరో భూభాగం ఉంటే సహించలేడు కోసల రాజ్యం, సరిహద్దు రాజ్యం అజాతశత్రు బంధుత్వాన్ని కూడా లెక్కబెట్టకుండా కోసల మీదికి దండెత్తాడు యుద్ధంలో ప్రసేనజిత్తు పరాజితుడై స్వాతంత్ర్యాన్ని కోల్పోయాడు

ఆ దిగులుతో వేళకు ఆహారం తీసుకోవడం కూడా మానివేసి మంచం పట్టాడు. ఈ విషయం బుద్ధునికి తెలిసి చెంతనున్న భిక్షువులకు క్రింది శ్లోకం చెప్పాడు.

***జయో వైరం ప్రసూతే దుఃఖం శేతే పరాజితః***
***ఉపశాంతః సుఖం శేతే హిత్వా జయపరాజయౌ*** **15-5**

జయం పొందినవానికి విరోధులు ఎక్కువ కావడం మొదలయి అతను అశాంతి జీవితం పాలవుతాడు. అపజయం పొందినవాడు అవమాన దుఃఖంతో బాధపడుతుంటాడు. జయ పరాజయ భావాలను వదలిపెట్టిన ఉపశాంతుడు సుఖముగా జీవిస్తాడు

# ఒక కర్షకుడు

మగధదేశంలో పర్యటిస్తూ ఒకనాడు బుద్ధుడు ఆళవి అనే కుగ్రామం చేరాడు ఆ మారుమూల గ్రామవాసులకు కూడా బుద్ధుడెవరో తెలుసు చక్రవర్తులు, రాజులు, మంత్రులు, కోటీశ్వరులు ఇంకా పెద్ద పెద్ద పండితులు - వీరందరూ కూడా బుద్ధుని ముందు చాలా వినయంగా చేతులు కట్టుకొని నిలబడతారని తెలుసు. అంత గొప్పవాడు స్వయంగా తానే తమ గ్రామానికి రావడం వారికెంతో ఆనందాన్ని, సంభ్రమాన్ని కలిగించింది.

సాయంకాలం ప్రవచనం మొదలయ్యే సమయానికి అక్కడికి ఒక కర్షక యువకుడు పరుగెత్తుకొంటూ వచ్చి కూర్చున్నాడు అతని వాలకం చూస్తే ఆ రోజంతా పస్తున్నవాని వలె కనపడుతున్నాడు నిజమే, ఆ రోజు ప్రొద్దుటినుండి అతను భోజనం చేయలేదు. తప్పిపోయిన ఎద్దును వెదకటానికి ప్రొద్దున బయలుదేరినవాడు దాన్ని వెదకి పట్టుకురావడానికి ఇంతసేపు పట్టింది. అతను ఊర్లోకి అడుగుపెట్టగానే బుద్ధుని రాక విషయం తెలిసి ఆదరాబాదరా ఇంటికి వెళ్ళి ఎద్దును కట్టివేసి ముఖం అయినా కడుక్కోకుండా పరిగెత్తుకొని సమావేశ స్థలం చేరాడు

బుద్ధుడు అతణ్ణి చూచాడు ప్రవచనం మొదలుపెట్టలేదు. ఆ ఊరి పెద్దను దగ్గరకు పిలిచి ఆ కర్షకుని విషయం ప్రస్తావించి అతనికి భోజనం పెట్టి తీసుకురమ్మని చెప్పాడు అంతదాక ప్రవచనం మొదలుపెట్టడం ఉండదని కూడా చెప్పాడు. బుద్ధుని ఆదేశాన్ని ఒక గొప్ప అనుగ్రహంగా తీసుకొని ఆ గ్రామపెద్ద కర్షకుణ్ణి తన ఇంటికి తీసుకొనివెళ్ళి చక్కగా భోజనం పెట్టి ఆ పిమ్మట అతణ్ణి

వెంటబెట్టుకొని సమావేశస్థలిని చేరినాడు ఆ తరువాతనే బుద్ధుడు ప్రవచనం మొదలుపెట్టాడు

ప్రవచనం అయ్యాక బుద్ధుణ్ణి శిష్యులడిగారు "ఆ యువకుడు భోజనం చేసి వచ్చినదాక ప్రవచనాన్ని ఎందుకు ఆపారు?" సమాధానంగా బుద్ధుడు ఇలా అన్నాడు · "ఆకలి బాధతో ఉన్నవాడికి పరమ గంభీరమైన ధర్మదేశనం తలకెక్కదు. ఆకలి బాధను మరపించే వినోద ప్రసంగం కాదు గదా మనం ఇస్తున్నది! అతని ముఖం చూస్తే స్రోతాపత్తి ఫలాన్ని పొందగల అర్హుడుగా కనపడినాడు అదే సమయంలో అతని ముఖంలో ఆకలి బాధ కూడా గోచరించింది. కనుక అలా చేయవలసివచ్చింది." ముగింపుగా క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు

**జిఘత్సా పరమో రోగః సంస్కారః పరమం దుఃఖమ్**
**ఏతద్ జ్ఞాత్వా యథాభూతం నిర్వాణం పరమం సుఖమ్** **15-7**

అన్నమనే ఔషధాన్ని తప్పనిసరిగా తీసుకొనవలసిన మొండి రోగమే ఆకలి. దుఃఖమనగా ఈ పంచస్కంధాలే (రూప, వేదనా, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానస్కంధాలు). దీన్ని సరిగా తెలుసుకొన్న ప్రజ్ఞావంతులు నిర్వాణాన్ని పరమ సుఖంగా భావిస్తారు.

# సేవకశ్రమణుడు

బుద్ధుడు తన చివరి పర్యటనను 80వ ఏట రాజగృహ నగర సమీపంలోని వేణువనం నుండి మొదలు పెట్టాడు గంగానదిని దాటి వ్రజ గణతంత్రదేశంలో అడుగిడి పర్యటిస్తూ వైశాలి నగరం చేరాడు. బుద్ధుడు ఆ నగరానికి వచ్చిన వెంటనే ఆమ్రపాలి ఆయనను దర్శించి భిక్షకు ఆహ్వానించింది. కొంతసేపటికి వ్రజ పరిపాలకులైన లిచ్ఛవి రాజకుమారులు కూడా దర్శనానికి వచ్చి భిక్షకు ఆహ్వానించారు ఆమ్రపాలి ఇంటికి భిక్షకు వెళ్ళేట్టుగా మాట ఇవ్వడం జరిగిందని బుద్ధుడు చెప్పాడు తమ ఆలస్యానికి రాజకుమారులు విచారించి బుద్ధునికి ఆతిధ్యం ఇచ్చే గౌరవాన్ని దక్కించుకొన్న ఆమ్రపాలి మీద ఈర్ష్యపడుతూ నిరాశగా తిరిగి వెళ్ళిపోయారు

వైశాలినుండి మల్ల గణతంత్ర దేశానికి బుద్ధుడు వెళుతుండగా ఒకచోట తీవ్ర అస్వస్థతకు గురియైనాడు పరినిర్వాణ సమయం ఆసన్నమౌతున్న విషయం అందరికీ తెలిసి విచారగ్రస్తులైనారు దిగులుగా ఉన్న భిక్షువులను చూసి "దిగులుపడవలసిన పని లేదు ధర్మాన్ని ఆసరాగా తీసుకొని ఆత్మవిశ్వాసంతో నిర్వాణ మార్గంలో పురోగమించండి" అని చెప్పి బోధిపక్షీయ ధర్మాలను ముప్పై ఏడింటిని (శ్రద్ధ, ప్రజ్ఞ, వీర్యం (energy), ధ్యానం, స్మృతి మొ ) మళ్ళీ వాళ్ళకు బోధించి సంఘ నిర్వహణ విషయంలో కూడా సూచనలు ఇచ్చాడు "తరచుగా సమావేశాలు పెట్టుకోండి సమావేశాల్లో ఏకాభిప్రాయ సాధనకు కృషి చేయండి. వినయ పిటకంలోని భిక్షు నియమాలను పాటించండి అవసరమైన పక్షంలో యుక్తమైన మార్పులు చేసుకోవడానికి వెనుకాడకండి సంఘాన్ని సంఘంలోని పెద్దలను గౌరవిస్తూ వారి మాటకు విలువనిస్తూ ఉండండి రాగద్వేషాలకు

తావివ్వకండి'' అని ఇంకా చాలా విషయాలు బోధించాడు

ఆ సమయంలోనే క్రొత్తగా చేరిన ఒక శ్రమణుడు బుద్ధునికి చాలా భక్తితో సేవలు చేస్తూ ఆనందునికి సహాయంగా నిలిచాడు. ఒకానొక సందర్భంలో ఆ సేవక శ్రమణుడికి బుద్ధుడు క్రింది మూడు శ్లోకాలను చెప్పాడు

**సాధుదర్శనమార్యాణాం సన్నివాసః సదా సుఖః**
**అదర్శనేవ బాలానాం నిత్యమేవ సుఖీ స్యాత్** **15-10**

సాధుజనుల దర్శనం మంచిది వారి సాన్నిధ్యం మంచిది. మూర్ఖజనులతో సంబంధం పెట్టుకోకుండా ఉండడం మంచిది

**బాలసంగతిగతిచారీ హి దీర్ఘమధ్వానం శోచతి**
**దుఃఖో బాలైః సంవాసో మిత్రేణైవ సర్వదా**
**ధీరశ్చ సుఖసంవాసో జ్ఞాతీనామివ సమాగమః** **15-11**

మూర్ఖుల సహవాసం వలన దీర్ఘకాలం శోకానికి గురి కావలసి ఉంటుంది శత్రువుల వలన దుఃఖం కలిగినట్లుగానే మూర్ఖుల సహవాసం వలన కూడా దుఃఖం కలుగుతుంది సజ్జన సాంగత్యం బంధుజనుల సాంగత్యం వలె సుఖాన్నిస్తుంది

**తస్మాద్ధి ధీరం చ ప్రాజ్ఞం చ బహుశ్రుతం చ**
**ధుర్యశీలం వ్రతవంతమార్యం**
**తం తాదృశం సత్పురుషం సుమేధసం**
**భజేత నక్షత్రపథమివ చంద్రమా** **15-12**

నక్షత్ర మార్గాన్ని చంద్రుడు అనుసరించునట్లు ధీరుడు, ప్రాజ్ఞుడు, పండితుడు, శీలసంపన్నుడు, వినయవంతుడు, మేధావి అయినట్టి సత్పురుషుణ్ణి సాధన మార్గంలో ప్రవేశించినవాడు అనుసరించవలెను.



# భిక్షుకుటుంబం

శ్రావస్తి నగరానికి చెందిన ఒక కుటుంబంలోని యువకుడు ఏదో కారణం వల్ల మామూలు జీవితం మీద విరక్తి చెంది ఒక విహారంలో చేరి సన్న్యాసదీక్షను తీసుకొన్నాడు. అతను అలా ఇల్లు వదలి సన్న్యాసుల్లో కలిసిపోవడం తండ్రికి గానీ తల్లికి గానీ ఇష్టం లేదు. వారికి అతను ఏకైక సంతానం అతను ఇంట్లో లేని వెలితిని తట్టుకోలేక తండ్రి కూడా భార్యకు చెప్పకుండానే అదే విహారానికి వెళ్ళి సన్న్యాసదీక్ష తీసుకొన్నాడు. కొడుకూ, భర్తా లేని ఇల్లు ఆమెకు ఇల్లులా అనిపించలేదు. ఒంటరి జీవితాన్ని భరించలేక ఆమె కూడా అదే విహారానికి వెళ్ళి భిక్షుణిగా మారిపోయింది. ఇలా ఆ కుటుంబం మొత్తం విహారం పాలయ్యింది.

ఈ ముగ్గురికి ప్రవేశం కల్పించి ఆ విహారం చిక్కుల్లో పడింది వీళ్ళు అక్కడ భిక్షువులుగా నడుచుకుంటే సమస్య ఉండేది కాదు. కానీ అక్కడ కూడా కుటుంబ సభ్యుల్లాగే కలిసి మెలిసి ఉండేవారు. కలిసి భోజనం చేయడం "అమ్మా, నాన్నా, అబ్బాయ్ రమణా" అని పాత సంబోధనలతో పిలుచుకోవడం వగైరా వ్యవహారం ఇతర భిక్షువులకు వెగటనిపించింది

ఆ సమయంలోనే బుద్ధుడు తన పర్యటనలో భాగంగా ఆ విహారానికి రావడం జరిగింది. కొందరు భిక్షువులు గుంపులుగా ఆయన దగ్గరకు వెళ్ళి "కుటుంబ భిక్షువుల" వ్యవహారం పూస గ్రుచ్చినట్లుగా వివరించారు. బుద్ధుడు ఆ ముగ్గురిని తన సమ్ముఖానికి పిలిపించి వారితో ఇలా అన్నాడు "భిక్షువులయ్యాక భిక్షు ధర్మాలను పాటించాలి. మీరు ఇక్కడ కూడా ఒక కుటుంబం లాగా కలిసి ఉండడం బాగా లేదు ఇష్టులను చూడలేక ఉండడం దుఃఖమే అనిష్టులను

చూస్తూ ఉండడం కూడా దుఃఖమే దుఃఖ నిర్మూలన కోసమే మీరు దీక్ష తీసుకొన్నారు కుటుంబం లాగా కలిసి ఉండడం దుఃఖ నిర్మూలనకు శాశ్వత పరిష్కారం కాదు '' ముగింపుగా క్రింది శ్లోకాలను కూడా పఠించాడు

***అయోగే యుంజన్నాత్మానం యోగే చాయోజయన్***
***అర్థం హిత్వా ప్రియగ్రాహీ స్పృహయేదాత్మానుయోగినమ్*** **16-1**

ఏ భిక్షువైతే చేయకూడని పనులను చేస్తున్నాడో, చేయవలసిన పనులను చేయకుండా ఉన్నాడో, పరమ పురుషార్థ సాధనాలను (శీల, సమాధి, ప్రజ్ఞలు) వదలిపెట్టి విషయ సుఖాలను అపేక్షిస్తున్నాడో అట్టి భిక్షువు మోక్షఫలాన్ని ఆశించడం అనేది గొంతెమ్మ కోరికే అవుతుంది

***మా ప్రియై: సమాగచ్ఛ అప్రియై: కదాచన***
***ప్రియాణాం అదర్శనం దు:ఖం అప్రియాణాం చ దర్శనమ్*** **16-2**

ప్రియమైనవాళ్ళ సహవాసం కూడదు అప్రియమైనవాళ్ళ సహవాసమూ కూడదు. ప్రియమైనవాళ్ళను చూడలేని పరిస్థితి ఎదురైనప్పుడు బాధ కలుగుతుంది అప్రియమైనవాళ్ళను విధిలేక చూస్తూ ఉండవలసిన పరిస్థితి కూడా బాధగానే ఉంటుంది

***తస్మాత్ ప్రియం న కుర్యాత్ ప్రియాపాయో హి పాపక:***
***గ్రంథా: తేషాం న విద్యంతే యేషాం నాస్తి ప్రియాప్రియమ్*** **16-3**

ప్రియమైనవాళ్ళ వియోగమే దుఃఖం. కనుక ప్రియంగా ఎవరినీ భావించవద్దు ఎవరికైతే ప్రియాప్రియములు లేవో వారే బంధనాలు లేనివారవుతారు

# అతుల ఉపాసకుడు

అతులుడు ఒక ఉపాసకుడు - అంటే గృహస్థుడుగా ఉంటూ త్రిరత్న శరణు పొంది పంచశీల మొదలగు నియమాలను పాటిస్తున్నవాడు ఒకనాడు అతడు కొందరు స్నేహితులను వెంటబెట్టుకొని జేతవనానికి పోయాడు

మొదట రేవతుడనే భిక్షువును కలిసి ధర్మసందేశాన్ని వినిపించుమని కోరాడు. రేవతుడు మౌనం వహించాడు అతులుడు రెండవసారి మూడవసారి కూడా కోరాడు. రేవతుడు మౌనం వీడలేదు ఇక ఆయన ముందర కూర్చొని ఉండడం వీళ్లకు ఎబ్బెట్టుగా తోచి అక్కడ్నుంచి లేచి శారిపుత్రుడున్న చోటికి వెళ్ళారు రేవతుణ్ణి కోరినట్లే శారిపుత్రుణ్ణి కూడా కోరారు - ధర్మాన్ని వినిపించమని

మొత్తం అభిధర్మ పిటకాన్ని ఈ చివర్నుండి ఆ చివరదాక వాళ్ళకు చెప్పే ప్రయత్నం చేశాడు శారిపుత్రుడు స్కంధాలు, ధాతువులు, ఆయతనాలు, చిత్త చైత్తాలు, భూత భౌతికాలు, కుశలాకుశలానేజ్యకర్మలు, సంస్కృతాసంస్కృత ధర్మాలు, నాలుగు ధ్యానాలు, నాలుగు సమాపత్తులు, ముప్పై ఒక్క లోకాలు - ఇలా అన్ని విషయాలను స్పృశిస్తూ దీర్ఘోపన్యాసం ఇచ్చాడు వింటున్నంతసేపు అంతా అర్థమైనట్లే అనిపించింది. కానీ ఉపన్యాసం పూర్తయి లేచివచ్చాక చూచుకొంటే వీళ్ళకంతా గజిబిజి అయిపోయినట్లనిపించింది ఇంత దూరం వచ్చింది గజిబిజి చేసుకోవడానికి కాదు గదా అనుకొని వాళ్ళందరూ ఆనందుని దగ్గరకు వెళ్ళారు. ఆయన వీళ్ళకు కేవలం కొన్ని మాతృకలు (పట్టికలు) మాత్రమే చెప్పారు బలములు ఐదు, ప్రహాణములు నాలుగు, స్మృత్యుపస్థానములు నాలుగు, పారమితలు ఆరు, భూమికలు పది అని కొన్ని పట్టికలు, వాటి పేర్లు చెప్పి "ఎనభైనాలుగువేల ఉపదేశ వాక్యాల

సారమంతా మీకు చెప్పాను" అని ముగించాడు

చివరకు అతులుడు బుద్ధుని దగ్గరకు వెళ్ళి "మేము ధర్మాన్ని వినడానికి వస్తే ఇక్కడ ఒక భిక్షువు ఏమీ చెప్పకుండా మౌనం దాల్చాడు మరొక భిక్షువు మరీ విపులంగా విషయాలు చెప్పి మా తలలను గజిబిజి చేసేశాడు ఇంకొక భిక్షువు మరీ సంగ్రహం చేసి చెప్పడంతో మా తలలకేమీ ఎక్కలేదు" అని వాపోయాడు బుద్ధుడు అతుల్ణి ఉద్దేశించి క్రింది శ్లోకాలు చెప్పాడు

**పురాణమేతద్ అతుల నైతద్ అద్యతనమేవ**
**నిందంతి తూష్ణీమాసీనం నిందంతి బహుభాణినమ్**
**మితభాణినమపి నిందంతి నాస్తి లోకే ఉ నిందిత:** 17-7

అతులా, ఇది క్రొత్తేమీ కాదు. ఎప్పట్నుంచో వస్తున్న పద్ధతే మౌనంగా ఉంటేనూ నిందిస్తారు. అధికంగా మాట్లాడితేనూ తప్పు పట్టారు మితభాషిలోనూ ద్వేషం చూస్తారు లోకంలో నిందకు గురికానిదెవరు ?

**న చాభూత్ న చ భవిష్యతి న చైతర్హి విద్యతే**
**ఏకాంతం నిందిత: పురుష: ఏకాంతం వా ప్రశంసిత:** 17-8

ఎల్లప్పుడూ ప్రశంసింపబడేవాడు, ఎల్లప్పుడూ నిందింపబడేవాడు ఏ కాలంలోనూ ఉండడు

# షడ్వర్గీయ భిక్షువులు

రాజగృహ నగర సమీపంలోని వేణువన విహారంలో బుద్ధుడు ఒకసారి విడిది చేసిన సమయంలో ఆ విహారంలో షడ్వర్గీయులనబడే ఆరుగురు భిక్షువులుండేవారు వాళ్ళు ఆరుగురు ఎప్పుడూ కలిసి ఉండేవారు భిక్షకు పోయినా కలిసే వెళ్ళేవారు తిరిగి వస్తున్నప్పుడూ కలిసే వచ్చేవారు ఒకసారి ఆరుగురూ కలిసి ఒక చోటకు ఆహ్వానం మీద భిక్షకు పోయారు భిక్షకు ఆహ్వానించినవాళ్ళు వీరికి వస్త్రదానం, పాదుకాదానం కూడా చేశారు ఆ పాదుకలు కొయ్యతో చేసినట్టివి. ఆరుగురు భిక్షువులూ విహారానికి తిరిగివచ్చాక ఆ కొయ్యచెప్పులతో నడవడం అభ్యాసం చేయడానికోసం వాటిని తొడుక్కొని బుద్ధుని కుటీరానికి పోయే దారిలో పరచిన పలకరాళ్ళ మీద టకటక శబ్దం పుట్టిస్తూ నడక అభ్యాసం మొదలుపెట్టారు

బుద్ధుడు వారిని తన చెంతకు పిలిచి ఇలా మందలించాడు. "నిశ్శబ్దాన్ని ప్రేమించవలసిన భిక్షువులు కదా మీరు! మరి మీరే ఇలా శబ్దాన్ని పుట్టిస్తే ఎలా? తక్కిన భిక్షువులకు ఇది విఘ్నం కాదా? వారి పరన ధ్యానాలకు ఇది విక్షేపం కాదా? మీరు చేసే చప్పుడు మీ చెవులకు చాలా ఆనందంగా ఉండవచ్చు కానీ మీ చుట్టూ ఇతరులున్నారు కదా! వారికి మీ గోల రుచించకపోవచ్చు ఇతరుల ఏకాగ్రతకు, ప్రశాంతికి, నిశ్శబ్దరుచికి మీరు భంగం కలిగించడం సరికాదు ఆ కొయ్యచెప్పులు తొడుక్కొని తిరక్కండి"

ఆ సమయంలో చేసిన ఉపదేశంలో ప్రసక్తానుప్రసక్తంగా క్రింది నాలుగు శ్లోకాలు కూడా ఉన్నాయి

కాయప్రకోపం రక్షేత్ కాయేన సంవృత: స్యాత్
కాయదుశ్చరితం హిత్వా కాయేన సుచరితం చరేత్ 17-11

దేహాన్ని, దైహికచేష్టల్ని అకుశల (చెడు) కర్మల నుండి రక్షించుకొని కుశల (మంచి) కర్మల్లో పెట్టవలెను

వచ: ప్రకోపం రక్షేద్ వాచా సంవృత: స్యాత్
వచో దుశ్చరితం హిత్వా వాచా సుచరితం చరేత్ 17-12

మన: ప్రకోపం రక్షేద్ మనసా సంవృత: స్యాత్
మనోదుశ్చరితం హిత్వా మనసా సుచరితం చరేత్ 17-13

కాయేన సంవృతా ధీరా అథ వాచా సంవృతా:
మనసా సంవృతా ధీరా: తే వై సుపరిసంవృతా: 17-14

# అజ్ఞాతబ్రాహ్మణుడు

శ్రావస్తికి సమీపాన ఒక గ్రామంలో ఉన్న అజ్ఞాత బ్రాహ్మణుడికి శ్రమణులంటే చాలా గౌరవం. ఆ ఊరికి భిక్షకు వచ్చే భిక్షువులు ఆ ఊరి పొలిమేరలో ఉన్న తటాకం వద్ద కూర్చొని భిక్షను ఆరగించి వెళ్లడం సాధారణంగా జరిగేది అజ్ఞాత బ్రాహ్మణునికి ఒక ఆలోచన తట్టింది తటాకం ఒడ్డులో ఉన్న చెట్టు క్రిందనే భిక్షువులు ఆసీనులు కావడం చాలా సార్లు చూచాడు ఆ స్థలాన్ని చాలా శుభ్రంగా అందంగా ఉంచాలని బ్రాహ్మణునికి ఆలోచన పుట్టి కొందరు మనుష్యులను పనిలోకి తీసుకొని ఆ ప్రదేశాన్ని చక్కగా చదును చేయించి ఆ చోటులో నాలుగు రాతి తిన్నెలను కూడా అమర్చాడు భిక్షువులు ఈ నూతన సౌకర్యానికి బ్రాహ్మణునికి ధన్యవాదాలు తెలిపారు.

కొన్నాళ్ళ తరువాత అతనికి మరొక ఆలోచన వచ్చింది "ఆ చోట్లో ఎండ తగలకుండా నీడను ఇచ్చే పెద్ద రావి చెట్టు ఉన్నది కానీ చినుకులు పడితే భిక్షువులు తడవాల్సిందేనా? అలా ఎందుకు జరగాలి?'' అనుకొని మళ్ళీ కొందరు మనుష్యులను పనిలోకి తీసుకొని కావలసిన వస్తువులను క్రయం చేసి గాలివానకు కూడా చక్కగా తట్టుకొని నిలబడగల ఒక పందిరిని నిర్మించాడు భిక్షువులకు ఇది మరీ సౌకర్యం అయ్యింది ఆ పందిరినే సభాస్థలిగా కూడా వారు మార్చుకుని జిజ్ఞాసువులైన కొందరు గ్రామీణులకు ధర్మబోధ చేయడం మొదలుపెట్టారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక బ్రాహ్మణునికి ఇంకా పెద్ద ఆలోచన వచ్చింది "అనాధపిండకులు, విశాఖలు, ప్రసేనజిత్తులు, బింబిసారులేనా విహారాలు నిర్మించేది? నేనెందుకు నిర్మించరాదు? వాళ్ళ స్తోమతకు తగినట్లు వాళ్ళు పెద్దవి నిర్మిస్తే నా స్తోమతకు తగినట్లు ఒక చిన్న విహారాన్ని నేనూ నిర్మిస్తాను'' అనుకొని పనిలోకి

దిగాడు అతని త్యాగనిరతికి ముగ్ధులై ఇతర గ్రామీణులు కూడా ఆ నిర్మాణ కార్యంలో భాగం పంచుకొన్నారు భిక్షువులు కొందరు అక్కడే స్థిరంగా ఉండడానికి కావలసిన అన్ని సౌకర్యాలతో అందమైన ఒక చిన్న విహారం ఆ తటాకం ఒడ్డున వెలసింది. దాన్ని సంఘానికి అంకితం చేసే సందర్భంలో ఆ బ్రాహ్మణుడు బుద్ధభగవానుణ్ణి ఆహ్వానించాడు. అతని ఆహ్వానాన్ని మన్నించి బుద్ధుడు ఆ గ్రామానికి వచ్చాడు నూతనంగా నిర్మితమైన ఆ విహారాన్ని బుద్ధునికి చూపి దాని నిర్మాణం వెనుక ఉన్న అంచెల క్రమాన్ని బ్రాహ్మణుడు వివరంగా చెప్పాడు. బుద్ధుడు అతణ్ణి మిక్కిలి కొనియాడి ఇలా అన్నాడు "చిత్తదోషాలను తొలగించి దాన్ని పవిత్రం చేసే సాధనల్లో దానం ఒకటి అంతే కాదు, మనిషిని పట్టి పీడిస్తున్న మమత్వరోగాన్ని క్రమంగా తగ్గించే ఔషధంగా కూడా దానం పని చేస్తుంది మొదట గడ్డిపోచతో ఐనా సరే మొదలుపెట్టి దాన గుణాన్ని అభ్యాసం చేసుకొంటూ వస్తే చివరకు తన శిరస్సునైనా దానం చేయగల స్థాయికి మనిషి చేరుకొంటాడు". ప్రశంసా వాక్యాలకు ముగింపుగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

***అనుపూర్వేణ మేధావీ స్తోకం స్తోకం క్షణే క్షణే***
***కర్మారో రజతస్యేవ నిర్ధమేత్ మలమాత్మనః*** **18-5**

వెండి, బంగారు మొదలగు లోహాలనుండి మలినాన్ని కంసాలి నేర్పుతో క్రమక్రమంగా తీసివేసే విధంగా బుద్ధిమంతుడు చక్కని పద్ధతిని అవలంబించి తన మనోమాలిన్యాలను కొంచం కొంచం క్రమంగా వదిలించుకొని విశుద్ధుడౌతాడు



*"Go out and preach monks, out of compassion for sentient beings and out of concern for the world Bring benefits, happiness and caring to gods and men No two of you should go to the same place Preach the Dharma with reason and eloquence so that it will be good at the beginning, middle and end (ఆది కల్యాణం, మధ్య కల్యాణం, అంత్య కల్యాణం)*

# అసూయాపరుడు

వీధికుక్కలు కొన్ని ఉంటాయి. దారిలో పోయేవాళ్ళందరూ వాటికి దొంగలుగా కనపడతారేమో! ఊరక మొరుగుతుంటాయి మనుష్యుల్లోనూ అలాంటి వాళ్ళున్నారు. వాళ్ళకు ప్రతిదీ దోషంగానే కనబడుతుంది. గుణాలను కూడా దోషంగా చూడలేకపోతే వాళ్ళకు నిదరపట్టదు జగమంతా వాళ్ళకు దోష అద్వైతంగా కనబడుతుంది ఈ రకం మనుష్యులను దృష్టిలో పెట్టుకొనే కాబోలు భర్తృహరి నీతిశతకంలో "జాడ్యం హ్రీమతి గణ్యతే" అనే శ్లోకం చెప్పాడు.

హ్రీ, అపత్రాప్యం అనేవి సుగుణాలు. అకృత్యాల విషయంలో తానే సిగ్గుపడి చేయకఉండడాన్ని హ్రీ అంటారు. ఇతరులు చూస్తే ఏమనుకొంటారో అనే సంకోచం, లోకభీతి వల్ల చేయక ఉండడాన్ని అపత్రాప్యం అంటారు ఇవి మనిషిని దుర్మార్గంలోనికి పోనీయక ఆపే కళ్ళెములు ఇవి బాగా ఉన్నవాణ్ణి చూచి అసూయాపరుడు "వాడు వట్టి జడుడు" అని జడత్వదోషాన్ని హ్రీ అనే సుగుణస్థానంలో ఆరోపిస్తాడు వ్రతశీలుణ్ణి డాంబికుడని తప్పు పట్టాడు. బాహ్యా అంతశ్శౌచాలు చక్కగా పాటించేవాణ్ణి కపటి అని అంచనా వేస్తాడు శూరత్వాన్ని క్రూరత్వంగా చిత్రిస్తాడు. సరళస్వభావుణ్ణి బుద్ధిలేనివాడని తీర్మానిస్తాడు చెవులకింపుగా మాట్లాడే మధురభాషణుణ్ణి దేబిరింపు మాటలవాడని నిర్ణయిస్తాడు తేజస్విగా ఉన్నవాణ్ణి గర్వి అంటాడు వాక్కౌశలంతో పదిమందిని అలరించేవాణ్ణి వదరుబోతు అంటాడు క్షమాశీలుణ్ణి అశక్తుడని ప్రచారం చేస్తాడు అసూయ అనే దుర్గుణం చేత కళంకితం చేసి చూడబడని సుగుణం లోకంలో ఒక్కటి కూడా లేదని భర్తృహరి శ్లోకాన్ని ముగిస్తాడు

ఈ శ్లోకానికి సరిపోయే ఉదాహరణగా ఉన్న ఒక భిక్షువును దారిలో పెట్టడానికి బుద్ధుడు అతణ్ణి తన సమ్ముఖానికి పిలిపించి బ్రహ్మవిహారాలను (sublime states) అతనికి వివరించి చెప్పి ఆ బ్రహ్మ విహారాల ధ్యానం ద్వారా అసూయా దోషాన్ని పోగొట్టుకొనుమని అతనికి ఉపదేశించాడు. (సుఖితుల ఎడల మైత్రి, దుఃఖితుల ఎడల కరుణ, పుణ్యాత్ముల ఎడల ముదితము, పాపాత్ముల ఎడల ఉపేక్ష ఈ నాలుగింటికి బ్రహ్మవిహారాలని పేరు) ఆ సందర్భంలో క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు.

***పరవద్యా ఽ నుదర్శినో నిత్యం ఉద్ధ్యానసంజ్ఞిన:***
***ఆస్రవాస్తస్య వర్ధంతే ఆరాద్ స ఆస్రవక్షయాత్*** **18-19**

ప్రాద్దస్తమానం ఇతరులలో దోషాలు చూడడమే పనిగా పెట్టుకొని వారిని కించపరుస్తూ మాట్లాడేవానిలో ఆస్రవాలు వృద్ధి చెందుతూ ఉంటాయి అతడు ఆస్రవక్షయానికి (అర్హత్వానికి) దూరమైపోతూ ఉంటాడు.

కామము (sense desires), భవము (becoming), దృష్టి (false views), అవిద్య (ignorance) - వీటికి ఆస్రవములు (defilements) అని పేరు.



# సుభద్రుడు

బుద్ధుని సుదీర్ఘ పర్యటనలో చిట్టచివరి దినం హిరణ్యావతి నదిని దాటి ఉత్తరమల్ల గణతంత్రదేశంలో అడుగు పెట్టడంతో మొదలయ్యింది. నదిని దాటాక ప్రయాణం చేస్తూ కుశీనగరికి సమీపంలోని ఉపవర్తనవనంలో విశ్రమించాడు అక్కడ రెండు సాలవృక్షాల మధ్య భూమిపై ఆనందుడు బుద్ధునికి శయ్య ఏర్పాటు చేశాడు బుద్ధుడు ఉత్తరం దిక్కుగా శిరస్సును పెట్టుకొని కుడివైపునకు తిరిగి పడుకొన్నాడు పరినిర్వాణం తరువాత తన దేహాన్ని అగ్నికి ఆహుతి చేయవలసినదిగా ఆనందుణ్ణి ఆదేశించాడు. అవశేషాలను ఏమి చేయాలని ఆనందుడు ప్రశ్నించగా ఆ విషయాలను భిక్షువులు పట్టించుకోనవసరం లేదని గృహస్థ భక్తుల ఇష్టానికి వదిలిపెట్టుమని బుద్ధుడు చెప్పాడు గతాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకొని తన జీవితంలో ముడిపడిన నాలుగు అతి ముఖ్య ప్రదేశాలను పేర్కొన్నాడు (జన్మస్థలమైన కపిలవస్తు, సమ్యక్ సంబోధిని పొందిన చోటైన గయ, ధర్మచక్రప్రవర్తనం ప్రారంభించిన పుణ్యభూమి వారణాసి, పరినిర్వాణ స్థలమైన కుశీనగరి. ఈ నాలుగు ప్రదేశాలు తరువాతి కాలంలో ప్రపంచవ్యాప్త బౌద్ధులకందరికీ పరమ పవిత్ర పుణ్యక్షేత్రాలయినాయి.)

"బుద్ధుడు ఇక రేపటివరకు ఉండడు" అన్న వార్తను విని శోకాకులుడై కుశీనగరికి చెందిన సుభద్రుడనే పరివ్రాజకుడు చాలా ఆతురతతో సాలవృక్షాల వనానికి వేగంగా వచ్చి "తథాగతుల దర్శనానికి అనుమతి ఇవ్వండి నా సందేహనివృత్తిని చేయగల జ్ఞానభాస్కరుడు ఆయనొక్కడే" అని ఆనందుణ్ణి ప్రాధేయపడినాడు "భగవానుణ్ణి ఈ సమయంలోనూ అలసటపాలు చేయడం బాగుండదు" అన్నాడు ఆనందుడు వీరి సంభాషణను వినిన బుద్ధుడు ఆ

జిజ్ఞాసువును తన చెంతకు తీసుకొని రమ్మని ఆనందుణ్ణి ఆదేశించాడు సుభద్రుడు చెంతకు వచ్చి సాష్టాంగ నమస్కారం చేసి ఇలా అన్నాడు "నా పరివ్రాజక జీవితంలో నేను గోశాలుణ్ణి, అజితకేశకంబళిని, సంజయుణ్ణి, పూర్ణకాశ్యపుణ్ణి, పకుధకాత్యాయనుణ్ణి, నిర్గ్రంథనాథపుత్రుణ్ణి చూచియున్నాడను వీరందరూ సత్యాన్ని యథాతథంగా కనుక్కొన్నవాళ్ళేనా? నిజమైన శ్రమణ నాయకులేనా?"

"ఈ జిజ్ఞాసతో పని లేదు సిద్ధాంత భేదాలు, వ్యవహారశైలి భేదాలు ఎన్ని ఉండినా ఫరవాలేదు ఎక్కడైతే ఆర్య అష్టాంగ మార్గం (excellent eightfold way) ఆచరింపబడుతున్నదో అట్టిచోట నీవు నిజమైన శ్రమణులను చూడగలవు మధ్యేమార్గమైన అష్టాంగ మార్గాన్ని ఆశ్రయించి తరించుము" అన్నాడు సుగతుడు ప్రసన్న గంభీరంగా. సుభద్రుడంత వరకు తలలో పెట్టుకొన్న పనికిమాలిన జిజ్ఞాసలను వదిలించుకొని బుద్ధుని శరణుజొచ్చి శ్రమణుడైనాడు బుద్ధుడు బ్రతికుండగా సంఘంలో చేరిన చిట్టచివరి భిక్షువు సుభద్రుడు. సుభద్రునికి చేసిన ధర్మదేశనంలో క్రింది శ్లోకాలు కూడా ఉన్నాయి

***ఆకాశే చ పదం నాస్తి శ్రమణో నాస్తి బహి:***
***ప్రపంచాభిరతా: ప్రజా నిష్ప్రపంచాస్తథాగతా:*** **18-20**

ఆకాశంలో కాలిబాటలుండవు అష్టాంగమార్గానికి భిన్నమైన మార్గాల్లో శ్రమణులుండరు ప్రజలు బంధాలనే (తృష్ణ = craving, మానం = pride, దృష్టి = false views) ఇష్టంగా తీసుకొని ఉంటారు బుద్ధులైనట్టివారు బంధముక్తులై ఉంటారు

***ఆకాశే చ పదం నాస్తి శ్రమణో నాస్తి బహి:***
***సంస్కారా శాశ్వతా న సంతి నాస్తి బుద్ధానామింగితమ్*** **18-21**

హేతుప్రత్యయసాపేక్షములై ఏర్పడిన సంస్కారములు (conditioned things)

శాశ్వతములు కావు. బుద్ధులు బంధనాలచే చాలితులు కానట్టివారు

(అష్టాంగ మార్గం: 1. సమ్యక్ దృష్టి, 2 సమ్యక్ సంకల్పం, 3 సమ్యక్ వాక్కు, 4. సమ్యక్ కర్మ, 5 సమ్యక్ ఆజీవం (livelihood), 6 సమ్యక్ వ్యాయామం (effort), 7. సమ్యక్ స్మృతి, 8 సమ్యక్ సమాధి (concentration) వీటిలో 3, 4, 5 శీలం అవుతుంది 6, 7, 8 సమాధి అవుతుంది మొదటి రెండు ప్రజ్ఞ అవుతుంది కనుక శీల సమాధి ప్రజ్ఞలు లేని చోట అధ్యాత్మికత, ముముక్షుత, శ్రేయోభిలాషత ఉండవు).



*తాపాత్ ఛేదాత్ చ నికషాత్ సువర్ణమివ పండితైః*
*పరీక్ష్య భిక్షవో గ్రాహ్యం మద్వచో న తు గౌరవాత్*

*తన చేతికి వచ్చింది అసలు బంగారమా కాదా తేల్చుకోడానికి కంసాలి దాన్ని కాల్చి, విరిచి, రుద్ది పరీక్షించే విధంగా నా వాక్యాలను ఓ భిక్షువులారా, నా మీద గౌరవంతో కాకుండా మీ అనుభవం అనే కొలిమిలో పెట్టి పరీక్ష చేసి నిలబడితే తీసుకోండి లేదంటే విసిరికొట్టండి*

*- గౌతమబుద్ధుడు*

# హత్తకుడు

హత్తకుడు భిక్షువయ్యాడు భిక్షువు అవడం ఎందుకంటే అహంకార మమకారాలను తగ్గించుకొంటూ అధ్యాత్మ మార్గంలో పురోగమించడానికి కొన్ని విషయాలలో అహంకార మమకారాలను వదలుకొని వేరే విషయాల్లో వాటిని పెంచుకోవడానికి కాదు కానీ మనస్సు ఒకదాన్ని వదలి మరో దాన్ని పట్టుకొని వేలాడుతూ "అహంతా మమతలను" అట్టే పెట్టుకోవడమో వృద్ధి చేసుకోవడమో చేస్తుంది. హత్తుకుని విషయంలో ఇదే జరిగింది శిరోముండనం చేసుకొని భిక్షువు అయ్యాడే కానీ భిక్షువుకుండవలసిన నిగర్వం, నిరహంకారం, నిర్మమత అలవరచుకోలేదు పైగా పెంచుకోవడంలోనే నిమగ్నుడయ్యాడు అతనిలో ఉన్న ఒక కౌశలం (skill) కూడా దీనికి తోడయ్యింది అతని మేధస్సు పాదరసంలా పని చేసే మేధస్సు జ్ఞాపకశక్తి కూడా బాగానే ఉంది ఈ కౌశలం బాగా వినియోగంలోకి వచ్చే తర్కవిద్యలో అతనికి రుచి ఎక్కువ తర్కశాస్త్రంలో ఉండే వాద, జల్ప, వితండ, ఛల, జాతి, నిగ్రహస్థానాల గురించి చక్కగా అధ్యయనం చేశాడు ఈ అధ్యయనంతో బాటు అతనికి తన ఎడల ఆధిక్యతా భావం, ఇతరుల ఎడ న్యూనతా భావం పెరుగుతూ వచ్చాయి. తాను అధికుడనే విషయం లోకం కూడా గుర్తించాలని ఆరాటం మొదలయ్యింది. ఇతరులను వాదంలో ఓడగొట్టి విజయం పొందితేనే కదా గుర్తింపు వచ్చేది! వాదానికి తనతోటి భిక్షువులెవ్వరూ సుముఖంగా లేరు "ఈ వాదాలు మాకెందుకయ్యా? శ్రద్ధతో సాధన చేసుకొంటున్నాము. సత్ఫలితాలు పొందుతున్నాము సంశయ చిత్తం ఉంటే కదా వాదానికి దిగే అవసరం కలిగేది" అని అతనిని నిరాశపరచేవారు

స్వయూథ్యులతో (తన వారితో) వాదానికి ఆస్కారం లేకపోయేసరికి అతను ఇతర శ్రమణశాఖలకు చెందిన భిక్షువులను సవాలు చేసి వాదానికి రమ్మనేవాడు. వాళ్ళలోనూ చాలా మంది వాదానికి విముఖులై ఇతని సవాలును ఉపేక్షించి ఊరుకునేవారు "నన్ను చూస్తేనే వాళ్ళు అదిరిపట్టారు నా సవాలుకు నిలువలేక తోక ముడిచి పారిపోయారు'' అని విజయగర్వంతో పదిమందికీ తన గొప్పను చెప్పుకొనేవాడు తర్కంలో ఇతనికన్నా రెండాకులు ఎక్కువ చదివిన వాడెవడైనా తారసపడి వాదంలో ఇతని నోరు మూయించి పంపితే దాన్ని మరో విధంగా చిత్రించి వాదంలో తానే నెగ్గినట్లు చెప్పుకొని ఎదుటివాణ్ణి ఒక చవటగా, ఇంద్రియలోలుడిగా, కుతార్కికుడిగా ప్రచారం చేసేవాడు. ఈ విధంగా హత్తకుడు ఆత్మవికత్థన (తనను తాను పొగుడుకోవడం) దోషానికి పరనింద దోషానికి పాల్పడుతూ భిక్షుమార్గం ఉత్తర దిశగా ఉంటే దక్షిణ దిశగా చాలా దూరం వెళ్ళిపోయాడు ఇతనిని మళ్ళీ దారిలో పెట్టడానికి బుద్ధుడు చేసిన ఉపదేశంలో క్రింది రెండు శ్లోకాలు కూడా ఉన్నాయి

***న ముండకేన శ్రమణో ఉవ్రతో ఉ లీకం భణన్***
***ఇచ్ఛాలాభసమాపన్నః శ్రమణః కిం భవిష్యతి*** **19-9**

సత్‌శీలము, తపస్సు, సత్యవాక్కు లేనివాడు ముండనం చేసుకొన్నంత మాత్రాన భిక్షువు కాలేడు. ఇచ్ఛాదృష్టి లాభదృష్టి పెట్టుకొన్నవాడు శ్రమణుడెలా అవుతాడు?

***యశ్చ శమయతి పాపాని అణూని స్థూలాని సర్వశః***
***శమితత్వాద్ధి పాపానాం శ్రమణ ఇత్యుచ్యతే*** **19-10**

సూక్ష్మమైన పాపాలను, స్థూలమైన పాపాలను అన్నింటిని ఎవడైతే శమింపజేయగలుగుతాడో అతడే శ్రమణుడనబడుతాడు

# నానాభిక్షువులు

జేతవన విహారంలో నానా దృక్పథాలు కలిగిన భిక్షువులుండేవారు వారిలో శీలవ్రతపరామర్శకుడొకడు. కొన్ని విధినిషేధాలను, కొన్ని ఆచారపద్ధతులను పెట్టుకొని అదియే పరమార్థమని భావించేవాడు ఎటువంటి గుడ్డను కట్టుకోవాలి? మోకాలికి ఎన్ని అంగుళాల క్రిందకు ఎలా కట్టుకోవాలి? ఆహారాన్ని తినేటప్పుడు ఏ దిక్కువైపు కూర్చొని ఎలా తినాలి? ఎంగిలాకును ఎలా మడతపెట్టి ఎలా తీసుకు వెళ్ళాలి? వస్తువులను ఇచ్చేటప్పుడు తీసుకొనేటప్పుడు హస్తాన్ని ఏ భంగిమలో ఉంచాలి? ఇలాంటివాటిని అతను పరమార్థంగా భావించేవాడు

మరొక భిక్షువు గ్రంథ పఠనమూ, ధారణమే పరమార్థంగా తీసుకొని శ్రుతిధరుడు కాగలిగితే చాలు, అది మోక్షంతో సమానమనే భావనలో పడి ద్వాదశాంగ సమన్వితమైన ఆగమ పఠనంలోనే లగ్నమయ్యాడు (సూత్ర, గేయ, వ్యాకరణ (expository answers), గాథ, ఉదాన, ఇత్యుక్త, అవదాన, జాతక, వైపుల్య, అద్భుతధర్మ, ఉపదేశ, నిదాన - ఇవి ద్వాదశాంగములు)

మరొక భిక్షువు వ్యవహారం ఫరవాలేదుగానీ అతని బండి ఒకచోట ఆగిపోయింది ఆగిపోయిన చోటునే గమ్యస్థానంగా భ్రమించి నిలిచిపోయాడు. ధ్యానావస్థల్లో అతను ఐదవ ధ్యానస్థాయియైన ఆకాశానంతాయతనాన్ని అందుకొని దాన్నే పరమార్థంగా భావించి కృతకృత్యభావాన్ని పెంచుకొన్నాడు దానికి పైన విజ్ఞానానంతాయతనం, దానికి మీద అకించనానంతాయతనం, ఇంకా పైన నైవసంజ్ఞానాసంజ్ఞాయతనం, ఆ పైన సంజ్ఞావేదనీయ నిరోధం అనే స్థాయిలు ఉన్న విషయం అతనికి తట్టలేదు

మరొక భిక్షువు "అనాగామి ఫలం సాధించాను కదా ఇంకేమి సాధించాలి? చాలు'' అనే భావనలో పడిపోయాడు పది సంయోజనాలలో (fetters) ఐదింటిని ఛేదించినవాడు అనాగామి మరణానంతరం అతను ఇక తిరిగి రావడం అనేది ఉండదు. దివ్యలోకాల్లో ఉద్భవించి అట్నుంచి నిర్వాణపదం చేరుకుంటాడు. సత్కాయదృష్టి, విచికిత్స, శీలవ్రతపరామర్శ, కామరాగ, వ్యాపాద - ఈ ఐదు సంయోజనాలను త్రెంచివేసినవాడు అనాగామి కానీ ఇంకా త్రెంచవలసినవి ఐదున్నాయి. రూపరాగ, అరూపరాగ, మాన, ఔద్ధత్య, అవిద్య - ఈ ఐదింటిని కూడా త్రెంచివేసినవాడు అర్హతుడవుతాడు

ఒకనాటి భిక్షు సమావేశంలో బుద్ధుడు కృత్యకృత్య భావనలో పడి ఉన్న ఆ భిక్షువులకు కనువిప్పుగా క్రింది రెండు శ్లోకాలను చెప్పాడు

*న శీలవ్రతమాత్రేణ బహుశ్రుతేన వా పున:*
*అధవా సమాధిలాభేన వివిచ్యశయనేన వా*
*స్పృశామి నైష్కర్మ్యసుఖం అపృధగ్జనసేవితమ్*
*భిక్షో! విశ్వాసం మాపాదీ: అప్రాప్త ఆస్రవక్షయమ్* **19-16, 17**

శీలవ్రతమాత్రంచేగానీ (mere morality and external ascetic observances), గొప్ప పాండిత్యంచేగానీ, సమాధి లాభంచేగానీ, ఏకాంతవాస మాత్రంచేగానీ, 'పృథగ్జన దుర్లభమైన అనాగామి ఫలం నేను అందుకొన్నాను' అనే భావంచేగానీ భిక్షువైనవాడు తృప్తిపడి నిలిచిపోరాదు. ఆస్రవక్షయ స్థాయియైన అర్హత్వం సాధించేవరకు ఓ భిక్షువులారా మీరు విశ్రమించరాదు

# మార్గజిజ్ఞాసువులు

శ్రావస్తి నగరానికి తూర్పు ద్వారం దగ్గరి పూర్వారామంలోని భిక్షువులు కొందరు బుద్ధుని దర్శనార్థం జేతవనానికి బయలుదేరాలనుకొన్నారు జేతవనం నగరానికి మరో దిక్కులో ఉన్నది. వారందరూ కలిసి వెళ్ళాలనుకొన్నారు కానీ ఒక వివాదం తలెత్తింది "ఏదారిగుండా పోవాలి?" అని ఒకడు రాజమార్గాన్ని ప్రతిపాదించి ఆ దారి గుణవిశేషాలను ఉగ్గడించాడు. రాజమార్గం కనుక శుభ్రంగా, విశాలంగా ఉంటుందని చెప్పాడు. మరో భిక్షువుకు ఆ ప్రతిపాదన రుచించలేదు రాజమార్గం కనుకనే శ్రేష్ఠం కాదన్నాడు. జనసంచారం ఎక్కువగా ఉంటుంది. వాహనాల రాకపోకల రొద ఎక్కువగా ఉంటుంది ప్రశాంతంగా నడవడం కుదరదు అది ఎన్నో విక్షేపాలకు నిలయంగా ఉంటుందని ఒక సందుగొందుల దగ్గరి దారిని ప్రతిపాదించి ఆ దారి గుణవిశేషాలను ఉగ్గడించాడు. మరొక భిక్షువుకు అది సమ్మతంగా లేదు సందుగొందుల దారి దగ్గరే అయినప్పటికీ ఆ దారి పామరజన ఆవాసాలగుండా పోతుంది గనుక వద్దన్నాడు వెళ్ళితే రాజమార్గం లేకుంటే పొలం గట్లమీద ప్రశాంతంగా నడుస్తూ రెండింతల ప్రయాణం ఏదో ఒకటి తేల్చుకోండని ముగింపు ప్రతిపాదన చేశాడు వారి చర్చలను బాగా ఆలకించిన ఒక ధనిక ఉపాసకుడు (గృహస్థ భక్తుడు) ఇలా అన్నాడు . "మీ చర్చల వల్ల ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఇప్పుడు మీరందరూ నా వాహనంలో జేతవనానికి వెళ్ళి మూడు దారుల్లో ఏ దారి మంచిదో తథాగతులవారిని అడిగి తెలుసుకోండి "

వారందరూ ఆ ఉపాసకుని వాహనం ద్వారా జేతవనం చేరి బుద్ధుణ్ణి దర్శించారు ఆయన వారినుద్దేశించి చేసిన ఉపదేశం విన్నాక ఏ దారి మంచిదనే

ప్రశ్నను వేయడానికి ఎవరూ సాహసించలేదు.

*మార్గాణామష్టాంగికః శ్రేష్ఠః సత్యానాం చ చత్వారి పదాని*
*విరాగః శ్రేష్ఠో ధర్మాణాం ద్విపదానాం చ చక్షుష్మాన్* 20-1

సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్, సమ్యక్ కర్మాంత, సమ్యక్ ఆజీవ, సమ్యక్ వ్యాయామ, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి - ఈ ఎనిమిది అంగములతో కూడిన మార్గము శ్రేష్ఠమైన మార్గము. దుఃఖసత్యం, సముదయసత్యం, నిరోధసత్యం, మార్గసత్యం - ఈ నాలుగు ఆర్య సత్యములు సత్యములలో శ్రేష్ఠమైనవి అన్ని ధర్మములలో (elements of existence) తృష్ణారాహిత్యం (నిర్వాణం) శ్రేష్ఠమైనది మనుష్యులలో ప్రజ్ఞాచక్షువు శ్రేష్ఠుడు

*ఏష ఏ మార్గో నాస్త్యన్యో దర్శనస్య విశుద్ధయే*
*ఏతం హి యూయం ప్రతిపద్యధ్వం మారస్యైష ప్రమోహనః* 20-2

దర్శన విశుద్ధికి దీనికంటే అన్యమైన మార్గం లేదు కామము (sense desire), అరతి (aversion to holy life), క్షుత్పిపాస (hunger and thirst), తృష్ణ (craving), స్త్యానమిద్ధ (sloth and torpor), భీరుత (fear), విచికిత్స (doubt), మర్ష-స్తంభ (detraction and obstinacy) లాభ (gain), శ్లోక (praise), సత్కార (honour), యశ (fame), ఆత్మ వికత్థన (extolling oneself), పరావమన్యన (contempt for others) - ఈ మహా సైన్యాన్ని మీ మీదికి నడిపిస్తూ దండెత్తివచ్చే మారుణ్ణి మీరు అష్టాంగమార్గం అనుసరించడం ద్వారా తికమక పాలు చేసి విజయం సాధిస్తారు

*ఏతం హి యూయం ప్రతిపన్నా దుఃఖస్యాస్తం కరిష్యథ*
*ఆఖ్యాతో వై మయా మార్గ ఆజ్ఞాయ శల్యసంస్థానమ్* 20-3

ఈ మార్గాన్ని అనుసరించడం ద్వారా మీరు దుఃఖాన్ని శాశ్వతంగా

అంతమొందించగలరు. కామము (sense desires), భవము (becoming) దృష్టి (false views), అవిద్య (ignorance) అనే ఆసవములను (defilements) పెకలించి వేసే మార్గాన్ని స్వయంగా నేను తెలుసుకొన్నవాడై మీకు చెబుతున్నాను

***యుష్మాభిః కార్యం ఆతప్యం ఆఖ్యాతారస్తథాగతాః***
***ప్రతిపన్నాః ప్రమోక్షంతే ధ్యాయినో మారబంధనాత్*** **20-4**

తథాగతులు (బుద్ధులు) మార్గాన్ని చూపించడం వరకే చేయగలరు. మార్గంలో పయనించే ప్రయత్నమంతా మీరే చేయవలసి ఉంటుంది శమధాన్ని (tranquility) విపశ్యనను (insight meditation) అభ్యాసం చేసేవారు మారుని బంధాల నుండి విముక్తులవుతారు

# బాలిక

ఆళవి దేశంలో బుద్ధుడు సంచారం చేస్తూ ఒక గ్రామంలో ధర్మప్రవచనం చేశాడు అది ఒక కుగ్రామం ఆ గ్రామంలో అందరూ పద్మశాలీలు చిన్నలు పెద్దలు అందరూ ప్రవచనం వినడానికి వచ్చారు

అన్నిచోట్ల ప్రసంగించినట్లే అక్కడ కూడ ప్రసంగిస్తూ జన్మ, మరణం, దుఃఖం, నిర్వాణం-ఇలాంటి విషయాలను చక్కగా పసిపిల్లలకు కూడా అర్థమయ్యే రీతిలో వివరించాడు బుద్ధుడు అక్కడున్న శ్రోతలు ఎందరు ఆ విషయాలను పట్టుకోగలిగారో తెలియదుగానీ పదేండ్ల బాలిక సునీత చక్కగా విషయాలను గ్రహించింది ప్రవచనం ముగిశాక అందరూ బుద్ధుని పాదాలకు నమస్కరించి వెళ్తుంటే తాను కూడా అలానే నమస్కరించింది. "నీ పేరేమిటమ్మా" అని బుద్ధుడు ఆమెను పలకరించి పరిశీలనగా చూశాడు కొంచెం బిడియంగానే పేరు చెప్పింది

"మంచి పేరే. చూడమ్మా. మళ్ళీ మీ ఊరికి ఎప్పుడొస్తానో నాకు తెలియదు ఇప్పుడు నీవు విన్న విషయాలను బాగా ఆలోచన చేస్తూ వుండు. ఏ పని చేస్తున్నా సరే ప్రతి క్షణం ఈ విషయాల మీద చింతన చేస్తూ వుండు మళ్ళీ నేనిక్కడికి రావడం జరిగితే కొన్ని ప్రశ్నలు నిన్నడుగుతాను ఇప్పుడు పేరేమిటి? అని అడిగితే ఎలా బదులిచ్చావో అలానే ఆ ప్రశ్నలకు కూడా బదులు చెప్పాలి జ్ఞాపకం పెట్టుకొంటావా." బుద్ధుడు ఇలా ఆ చిన్నపిల్లను ఇంతసేపు పలకరించడం అందరికీ విడ్డూరమనిపించింది.

దూదినుండి ఏకులు చేస్తున్నా, ఏకులనుండి దారం తీస్తున్నా, దారాలను

వస్త్రంగా అల్లుతున్నా ఆ బాలిక బుద్ధుని ప్రవచన విషయాల చింతన మరచిపోలేదు.

మూడేండ్ల తరువాత మళ్లీ బుద్ధుడు ఆ గ్రామానికి రావడం జరిగింది. ప్రవచనం అయ్యాక శ్రోతలు ఒక్కొక్కరూ నమస్కరించి వెళ్తున్నారు సునీత కూడా నమస్కరించింది. బుద్ధుడు ఆ బాలికను గుర్తుపట్టాడు. ప్రశ్నల విషయం జ్ఞాపకం చేశాడు. "అడగండి చెబుతాను" అని సునీత సమాధానమిచ్చింది

ప్రశ్న . నీవెక్కడనుండి వచ్చావు?

జవాబు . నాకు తెలియదు

ప్రశ్న : నీవెక్కడికి వెళ్తున్నావు?

జవాబు నాకు తెలియదు.

ప్రశ్న · నీకు తెలియదా?

జవాబు · తెలియకేం తెలుసు.

ప్రశ్న నీకు తెలుసా?

జవాబు నాకు తెలియదు.

ఈ ప్రశ్న-జవాబుల మర్మం అక్కడెవ్వరికీ అర్థం కాలేదు. బుద్ధుడేమడిగాడో ఏమోగానీ ఆ పిల్ల అలా తలబిరుసుతనంగా జవాబులివ్వడం బాగా లేదని అక్కడి శ్రోతలనుకొన్నారు.

"నీ జవాబులు ఇక్కడి వాళ్ళకు అర్థమయ్యేలా వివరించి చెప్పమ్మా" అన్నాడు బుద్ధుడు "నేను ఇంటినుండి వచ్చినసంగతి మీకు తెలుసు మీ ప్రశ్న దానికి సంబంధించినదిగా వుండదు. ఏ పూర్వజన్మ నుండి వచ్చావో తెలుసా అని మీ ప్రశ్నకు అర్థం తెలియదని జవాబిచ్చాను నీవెక్కడికి వెళ్తున్నావని మీరడిగారు అంటే భవిష్యజ్జన్మ విషయమడిగారు. తెలియదన్నాను. నీకు తెలియదా? అని మళ్ళీ ప్రశ్నించారు మరణం అనేది నిశ్చయం అని తెలియదా అని మీ ప్రశ్నకు

అర్థం చెప్పుకుని మరణమనేది నిశ్చయమే నాకు తెలుసు అని జవాబిచ్చాను. నీకు తెలుసా? అని మళ్ళీ అడిగారు. ఎప్పుడు ఎక్కడ ఎలా అనే విషయం నీకు తెలుసా అని మీరడిగినట్లుగా అర్థం చేసుకొని తెలియదు అన్నాను" అని సునీత వివరణ ఇచ్చింది.

"సంసారమనే వలనుండి బైటపడి నిర్వాణమనే గగనంలో విహరిస్తున్న శకుంత పక్షిలాంటిదానివమ్మా నీవు" అని బుద్ధుడు ఆ బాలికను ప్రశంసించి క్రింది శ్లోకం పఠించాడు

**అంధభూతో ఽ యం లోకః తనుకో ఽ త్ర విపశ్యతి**
**శకుంతో జాలముక్త ఇవాల్పః స్వర్గాయ గచ్ఛతి** 13-8

వలలో చిక్కుకుపోయిన పక్షులు అధికం తప్పించుకొన్నవి స్వల్పం. అలాగే ప్రజల్లో గ్రుడ్డివాళ్ళు ఎక్కువ. చూపు వున్నవాళ్ళు తక్కువ. చూపు వున్నవాడు నిర్వాణపురం చేరగలడు.

# దారి తప్పిన భిక్షువులు

బద్దియ అనే అటవీ ప్రాంతంలో ఉన్న ఒక విహారంలోని భిక్షువులకు సరైన మార్గదర్శకుడు లేకపోవడం వల్ల వాళ్ళలో చాలా మంది అసలు విషయాన్ని మరచిపోయి అనవసరమైన విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడం మొదలుపెట్టారు

అది అటవీ ప్రదేశం కనుక అక్కడి భిక్షువులకు పాదరక్షలు వేసుకొనే అనుమతి ఇవ్వడం జరిగింది. కొందరు భిక్షువులు పోటాపోటీగా తమ తమ పాదరక్షలకు రోజుకొక అలంకారం చేయడంలో నిమగ్నమయ్యారు కొత్త కొత్త అలంకార పద్ధతులు కనిపెట్టడంలోనే మనస్సుకు ఎక్కువ పని ఇవ్వడం మొదలు పెట్టారు. వింత వింత పుష్పాలను, ఆకులను పాదరక్షల అలంకారం కోసం సేకరించడంలోనే వారికి ఎక్కువ కాలం సరిపోయేది.

మరికొందరికి పాదరక్షల అలంకరణకన్నా భిక్షా పాత్రల అలంకరణ శ్రేష్ఠంగా తోచి వాటి అలంకరణ కోసమే మనస్సును, దేహాన్ని ఎక్కువ పనిలో పెట్టడం ప్రారంభించారు మరి కొందరికి వస్త్రాల అలంకరణ మీద దృష్టి పడింది ఇక్కడ అలంకరణకు పెద్ద అవకాశం లేదు ఎవరికీ పనికిరాకుండా పారవేసిన చీలికలు పేలికలు సేకరించి అతుకులు వేసుకోమని బుద్ధుడి శాసనం కానీ ఈ అలంకారప్రియులు ఆ శాసనంలో కూడ ఒక చిల్లిని కనిపెట్టారు ఒక క్రొత్త మేలిరకమైన వస్త్రాన్ని సంపాయించడం, ఆ పిమ్మట దాన్ని వీళ్ళకు కావలసిన రీతిలో కత్తిరింపులు వేయడం, ఆ కత్తిరింపులను లాంఛనం పాటించడం కోసం ఒక దిబ్బలో వేయడం, మళ్ళీ వాటిని తీసుకొచ్చి ఆకర్షణీయమైన రీతిలో కట్టుకొని తొడుక్కోవడం. ఈ తంతు నడపడానికి ఎంతో కాలం వ్యయమైపోతున్న సంగతి కూడా వీరికి గుర్తుకు రావడం లేదు

కొందరికి ఇదంతా నిరుపయోగమైన వ్యాపకంగా కనబడింది. ప్రజల దృష్టిని తమ వైపు త్రిప్పుకోవడానికి సరిపోయే సత్తా వీటిలో లేదని భావించి వేరే పద్ధతుల మీద దృష్టిని పెట్టారు భిక్షువులకు ప్రజలతో సంబంధం ఏర్పడేది ముఖ్యంగా ధర్మోపన్యాసాలు ఇచ్చేటప్పుడే. కనుక అప్పుడు వారి దృష్టిని తన మీద స్థిరంగా ఉంచాలంటే మాటలకన్నా కరచరణాది విన్యాసం, హావభావప్రకటనాచాతుర్యం ఉండాలి వక్తగా రాణించాలంటే ఇది చాలా అవసరమని ఒక భిక్షువు అదేపనిగా కరచరణాది కదిలికల అభ్యాసం, హావభావ ప్రకటన అభ్యాసం మొదలుపెట్టాడు ఈ విషయంలోనే మరొకడు మరో కోణాన్నుండి ఆలోచించి వేరే అభ్యాసం మొదలుపెట్టాడు ప్రజలను తన్మయులను చేసి కదలకుండా ఉంచేది సంగీతమే కనుక ఆ అభ్యాసం మొదలుపెట్టాడు పాటలు, పద్యాలు, కీర్తనలు, నామావళి మొదలగునవి ఆయా బాణీలలో పాడే అభ్యాసం ప్రారంభించాడు. మరొకడు ఇదంతా లాభం లేదనుకొని తానొక విలక్షణమైన వక్తగా, జనాకర్షణ వక్తగా తయారు కావాలనుకొని హాస్యకథల వేటలో పడ్డాడు నువ్వుగింజలను బాగా వేయించి చేనులో చల్లిన అతిమూర్ఖుని కథలాంటి కథలను పెక్కింటిని సేకరించడం మొదలుపెట్టాడు

బుద్ధుడు పర్యటన చేస్తూ బద్దియకు వచ్చినప్పుడు అక్కడి భిక్షువుల పోకడలను గమనించి వారిని మందలించాడు. రాగము, ద్వేషము, మానము, అవిద్య, విచికిత్స మొదలగు క్లేశాలను నిర్మూలించుకోవడం వదలిపెట్టి, ఇలాంటి అల్పవిషయాలకు ప్రాధాన్యం ఇవ్వడం తగదని మందలించి క్రింది రెండు శ్లోకాలు పఠించాడు.

***యద్ధి కృత్యం తద్ అపవిద్ధం అకృత్యం పున: కుర్య:***
***ఉన్మలానాం ప్రమత్తానాం తేషాం వర్ధంత ఆస్రవా:*** **21-3**

చేయవలసినవి చేయకుండా చేయకూడనివి చేస్తూ ఉన్న గర్విష్ఠులు,

అజాగరూకులు చిత్త మాలిన్యాన్ని పెంచుకుంటూ ఉంటారు

**యేషాం చ సుసమారబ్ధా నిత్యం కాయగతా స్మృతి:**
**అకృత్యం తే న సేవంతే కృత్యే సాతత్యకారిణ:**
**స్మరతాం సంప్రజానానాం అస్తంగచ్ఛంత్యాస్రవా:** **21-4**

ఈ దేహము అనిత్యమైనది, అశుచికి ఆకరమైనది, దుఃఖమునకు నిలయమైనది అనే సత్యాన్ని ఎవరైతే సదా జ్ఞప్తిలో పెట్టుకుంటారో వారు చేయవలసిన పనులను చక్కగా చేస్తూ చేయకూడనివాటిని చేయకుండా ఉండే జాగరూకులౌతారు స్మృతి (mindfulness), సంప్రజన్యం (introspection) అనే జంట సాధనాలను ఎవరైతే కలిగి ఉంటారో వారిలో చిత్తదోషాలు (ఆస్రవములు = mental intoxicants) అంతరించిపోతాయి

# వామన బద్దియుడు

వారణాసిలోని న్యగ్రోధవనవిహారం నుండి కొందరు భిక్షువులు బుద్ధుని దర్శనం కోసం జేతవనానికి వచ్చారు. ఆయన వారితో సంభాషిస్తున్న సమయంలో లకుండక (వామన) బద్దియుడు అటువైపు రావడం జరిగింది. వారణాసి భిక్షువులందరూ అతణ్ణి కుతూహలంగా చూడసాగారు. బుద్ధుడు వారితో "ఆ పోయేది ఎవరనుకొంటున్నారు? తల్లిని తండ్రిని చంపి ఇనుమంత దుఃఖం కూడా లేకుండా తిరుగుతున్నవాడు" అన్నాడు

వారణాసి భిక్షువులలో కొందరికి ఆ సంధాభాష అర్థం కాలేదు బద్దియ భిక్షువును గురించి వాళ్ళు చాలా వినే ఉన్నారు అతని ఆకారం, తక్కినవాళ్ళు అతడిని ఆట పట్టించే తీరు, అతని సౌమ్యత మొదలగు విషయాలన్నీ చాలా వినియున్నారు కనుకనే అతను అటు వెళ్తుంటే కుతూహలంగా అతని మీద చూపులు నిలిపి పరిశీలనగా చూచారు అతను తలిదండ్రులను నిర్దయగా చంపి రావడం మతి ఉన్నవాడెవడూ నమ్మలేని మాట. బుద్ధుడు సంధా భాషను ప్రయోగించాడు. ఆ ప్రయోగం వెనుక దాగిన అర్థాన్ని స్పష్టం చేసి చెప్పమని వారు తథాగతుణ్ణి ప్రాధేయపడినారు బుద్ధుడు తన భావాన్ని స్పష్టపరుస్తూ ఇలా అన్నాడు "బద్దియుడు తృష్ణ అనే తల్లిని, మానం (Conceit, Pride) అనే తండ్రిని హతమార్చి దుఃఖం లేకుండా చేసుకొన్న అర్హతుడు. అంతేకాదు శాశ్వతదృష్టి ఉచ్ఛేదదృష్టి అనే ఇద్దరు రాజులను, వారి అనుచరుడైన రాగమును కూడా హతమార్చి వారి రాజ్యమును (అధ్యాత్మ ఆయతనములు, బహిర్ధాఆయతనములు అంటే ఇంద్రియములు, ఇంద్రియ విషయములు అని అర్థం) కూడా రూపుమాపినట్టి

అనఘుడే (పాపరహితుడు) ఆ బుద్ధియుడు పులి లాంటి సంశయం ఐదవదిగా ఉన్న నీవరణపంచకాన్ని (hindrances) ధ్వంసం చేసిన అర్హతుడతడు. (కామచ్ఛంద (desire for sense pleasures), వ్యాపాద (ill-will, anger, hatred), స్త్యాన మిద్ధ (sloth and torpor), ఔద్ధత్య కౌకృత్య (restlessness and worry), విచికిత్స (doubt) - ఇవి పంచ నీవరణములు.

**మాతరం పితరం హత్వా రాజనొ ద్వే క్షత్రియా**
**రాష్ట్రం సా నుచరం హత్వా అనఘో యాతి బ్రాహ్మణః**
**మాతరం పితరం, హత్వా రాజానొ ద్వే చ శ్రోత్రియా**
**వ్యాఘ్రం చ పంచమం హత్వా అనఘో యాతి బ్రాహ్మణః** **21-5,6**

# వగ్గుముదాతీర భిక్షువులు

వ్రజ దేశంలో ఒకప్పుడు కరువు ఏర్పడింది. ఆ కరువు దెబ్బ భిక్షుసంఘానికి కూడా తాకింది. దేశం సుభిక్షంగా ఉంటేనే కదా అధ్యాత్మ జీవితానికి అంకితులైనవాళ్ళకు లోటు లేకుండా జరిగేది !

ఆ కరువు కాలంలో వ్రజ దేశంలోని భిక్షువులు చాతుర్మాస్య నియమ వాసానంతరం గుంపులు గుంపులుగా జేతవనానికి వచ్చారు చాలా మంది శుష్కించిన శరీరాలతో కనపడ్డారు వగ్గుముదానదీ తీరం నుండి వచ్చిన భిక్షువుల గుంపు మాత్రం పుష్టిగా ఆరోగ్యంగా కనిపించింది ఆ నదీతీర ప్రాంతమూ కరువు తాకిడికి గురియైనట్టిదే కానీ ఆ భిక్షువుల్లు మాత్రం యుక్తిగా తగినంత ఆహారాన్ని, కానుకలను సంపాయించి పుష్టిగా తిరిగివచ్చారు

వాళ్ళు కొంత అపరిపక్వ చిత్తులు కనుక కష్టాలను ఎదిరించే స్థైర్యం లేక యుక్తికి దిగారు. లౌకిక జీవనంలో యుక్తిని పెద్దగా తప్పుబట్టరు గానీ ఆధ్యాత్మిక జీవనానికి అంకితులైనవాళ్ళు శరీర పోషణ కోసం తమ స్థాయికి తగనట్టి యుక్తిని పన్నడం దోషమే. చాతుర్మాస్య నివాసంగా వగ్గుముదా తీరానికి పోయిన వెంటనే వారందరూ సమావేశమై ఒక ఆలోచన చేశారు "మనం సామాన్య భిక్షువులుగా కనబడితే భిక్ష దొరకడం ఈ కరువు కాలంలో కష్టమే. కనుక మనం ఒకరినొకరు సంబోధించుకొనేటప్పుడు మన మామూలు పేర్లు ఉపయోగించకుండా ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సూచించే పేర్లను వాడుకొందాము మనలో పెద్ద వయస్సు ఉన్నవాళ్ళను సంబోధించేటప్పుడు అర్హత్ బదంత్ అని పిలుస్తాము మరి కొందర్ని అనాగామి బదంత్ అని పిలుచుకొందాము మిగిలిన వాళ్ళను సకృదాగామి బదంత్ అని పిలుస్తాము ఈ సంబోధనలతో మనం వ్యవహరించుకొంటుంటే మన సమూహాన్ని

చాలా విశిష్ట వ్యక్తులతో కూడిన సమూహంగా ప్రజలు భావించి మనకు కావలసినవన్నీ భక్తితో సమర్పించుకొంటారు. ఇంతకన్నా మనకు వేరే ఉపాయం లేదు."

ఈ ఉపాయాన్ని వాళ్ళు చాలా చక్కగా అమలులో పెట్టారు. గంభీర వదనాలతో అదొక రకమైన కంఠస్వర విన్యాసంతో వారు ఒకరినొకరు అలా సంబోధించుకొంటుంటే ప్రజలు "ఆహా! ఎందరు మహానుభావులు ఒకచోట చేరి చాతుర్మాస్యం పాటిస్తున్నారు! మన అదృష్టమే అదృష్టం" అని ఆ భిక్షువులకు ఏ లోపం రాకుండా ఆ నాలుగు మాసాలూ చూచుకొన్నారు.

జేతవనం చేరాక వాళ్ళలో కొందరు తమ యుక్తిని ఒక ఘనకార్యంగా చెప్పుకోవడం మొదలుపెట్టారు వాళ్ళు సాధించిన ఘనకార్యం బుద్ధునికి తెలిసి వాళ్ళనందరినీ తన సమ్ముఖానికి పిలిపించుకొని భిక్షు నియమాలను, అధ్యాత్మ జీవితంలో పాటించవలసిన ఆదర్శ విధానాలను వాళ్ళకు బోధించి ఇక మీదట ప్రాణం పోయినా సరే అలాంటి చౌకబారు యుక్తులకు దిగవద్దని చెప్పి క్రింది శ్లోకాన్ని కూడా పఠించాడు

***శ్రేయాన్ అయోగోళో భుక్తస్తప్తాగ్ని శిఖోపమః***
***యచ్చేద్ భుంజీత దుఃశీలో రాష్ట్రపిండం అసంయతః*** 22-3

మనోవాక్కాయములను నియమించుకొనక దుశ్శీలురై ప్రజల కష్టార్జితాన్నమును తినుటకంటే గనగన కాలుచున్న ఇనుపగోళీలను మింగడం మేలు

# పావేయ్యకం

కోసలరాజైన ప్రసేనజిత్తుగారి గజశాలలో ఏనుగుల సంఖ్య చాలా ఎక్కువే. ఆ ఏనుగుల్లో ముఖ్యమైన వాటికి పేర్లున్నాయి. ఒక ముసలి ఏనుగు పేరు పావేయ్యకం అది పేరు పెట్టి పిలుచుకోవలసినంత ముఖ్యమైనదేమీ కాదు కానీ ఒకప్పుడు అంటే దాని చిన్న వయస్సులో అలా చాలా బలమైనదిగా అందమైనదిగా ఉంటూ అందరి దృష్టిని ఆకర్షించేది. అప్పటి కోసలరాజుకు గజారోహణ ముచ్చట వేసినప్పుడు ఆ ఏనుగునే ఎన్నుకొనేవాడు.

ఒకనాడు పావేయ్యకం, గజశాలకు ఉత్తరంగా ఉన్న ఒక కొలనులోకి అడుగు పెట్టింది బురదలో కాళ్ళు కూరుకుపోవడం వల్ల తిరిగి గట్టు ఎక్కలేక పోయింది. బైట పడడానికి అది పడుతున్న ఆయాసాన్ని చూచిన రాజసేవకుడు నీరాజనుడు పరుగున వెళ్ళి రాజుగారికి ఈ విషయం తెలియజేసాడు. ఇది రాజుగారికి తెలియజెప్పవలసినంత ప్రాధాన్య విషయమేమీ కాదు గజశాల అధికారికి చెప్పవచ్చు లేదా ప్రధానమావటివానికి చెప్పవచ్చు. రాజుగారి దృష్టిలో ఎలాగైనా పడుతూ ఉండాలనే లౌక్యం తెలిసినవాడు కనుక నీరాజనుడు తన అసలు పనిని వదలిపెట్టి రాజుగారి దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళి ఈ విషయం చెప్పాడు

అది విని ప్రసేనజిత్తు “సరే, నీవే వెళ్ళి మావటివానికి విషయం చెప్పి దాన్ని బైటకు లాగే చర్యలు తీసుకోమను” అన్నాడు. నీరాజనుడు పరమానంద భరితుడై హుటాహుటిన గజశాలకు వెళ్ళి మావటివానితో “మహారాజులుం గారు నాద్వారా నీకొక ముఖ్యమైన ఆజ్ఞను పంపారు ఇది శీఘ్రమే చేయవలసిన పని. కుముదాకరం కొలను బురదలో పావేయ్యకం ఇరుక్కు పోయినది. మహారాజులుం

గారికి ఇది తెలిసి చాల ఆందోళన చెందారు. అది శీఘ్రంగా ఆ విపత్తునుండి బైటపడేలా చర్యలు తీసుకోమని నీకు నా ద్వారా ఆజ్ఞ పంపారు" అన్నాడు.

యుద్ధంలో సైనికులకు ఉత్తేజాన్ని కలిగించేందుకు మ్రోగించే దుందుభి, మురజం, కాహళం వగైరా వాద్య విశేషాలను, వాటిని వాయించే వాళ్ళను వెంటబెట్టుకొని మావటివాడు కుముదాకరం కొలను ఒడ్డుకు వెళ్ళాడు. "చతురంగ బలాలు తలపడేటప్పుడు మ్రోగించే విధంగా మీ మీ వాద్యాలను మ్రోగించండి" అని వాళ్ళను పురమాయించాడు మగధదేశ మహాసైన్యం కదలి వస్తున్నదా అన్న భ్రాంతిని పుట్టించే విధంగా వాళ్ళు మ్రోగించడం మొదలు పెట్టారు మావటివాని ప్రయోగం వృధా కాలేదు ఆ వాద్యధ్వనులు విని పావేయ్యకం ఉత్తేజాన్ని పొంది తన బలాన్నంతా కూడగట్టుకొని బురదలో కూరుకుపోయిన కాళ్ళను బైటకు లాక్కోగలిగింది

ఇది జరిగిన సమయంలో బుద్ధుడు జేతవనంలో విడిది చేసియున్నాడు పావేయ్యక ఉదంతాన్ని భిక్షువులు బుద్ధునికి చెప్పారు. బుద్ధుడు అప్పుడిలా అన్నాడు "భిక్షువులారా, లోకంలో జరిగే ప్రతి సంఘటన నుండీ మీరు అధ్యాత్మ పాఠాలను నేర్చుకోవచ్చు. ఆ ఏనుగు, బురదగుంట నుండి బైటపడినట్లుగా మీరు క్లేశములనే బురదగుంట నుండి బైటపడవలెను (రాగం, ద్వేషం, మానం, అవిద్య, విచికిత్స, మిధ్యాదృష్టి - ఇవి క్లేశాలు) వాద్య ధ్వనులను విని పావేయ్యకం ఉత్తేజం పొంది బైటకు రాగలిగింది. అలాగే మీరు కూడా నిర్వాణ సందేశ వాక్యాలను విని ఉత్తేజం పొంది క్లేశ కూపాన్నుండి బైట పడండి"

*అప్రమాదరతా భవత స్వచిత్తమనురక్షత*
*దుర్గాదుద్ధరతా ఽఽ త్మానం పంకే సక్త ఇవ కుంజరః* 23-8

అప్రమాదం అనే చిత్తవృత్తి విశేషాన్ని కలిగి ఉండండి (చేయవలసిన

పనులను చేయడంలోనూ చేయకూడని పనులను చేయకుండా ఉండడం లోనూ ఏమరుపాటు లేని చిత్తవృత్తి విశేషాన్ని అప్రమాదం అంటారు). అధ్యాత్మ సత్యాలను సదా జ్ఞప్తిలో ఉంచుకోవడం ద్వారా స్వీయ చిత్తాలను రక్షించుకొనుడు బురదలో కూరుకుపోయిన ఏనుగు స్వశక్తితో తనను తాను పైకి లేవదీసుకొన్నట్లుగా క్లేశరూపం నుండి మిమ్మల్ని మీరే పైకి లేవదీసుకొనుడు

# ఆజీవక ఉపకుడు

ఆజీవకులు నియతివాదాన్ని (fatalism) అంగీకరించే వర్గానికి చెందినవాళ్ళు కోసల దేశానికి చెందిన గోశాలుడు వీరి గురువు "ఎప్పుడు ఏది ఎలా జరుగాలో అలా జరిగి తీరుతుంది ఎవరూ మార్చలేరు వ్యక్తి జీవితంలో సామాజిక జీవితంలో మార్పులు తీసుకొస్తాము, బాగు చేస్తామనుకొనేవాళ్ళు అజ్ఞానులు. జీవులు నిర్వాణం వైపు ప్రయాణం చేస్తున్నారు కానీ తొందరపడి లాభం లేదు ఏవో సాధనలు చేసి త్వరగా గమ్యం చేరదామనుకోవడం వట్టి భ్రమ గంగానది ఇసుక రేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని అంకెలను కోటి కోటి అంకెలతో గుణించగా వచ్చిన మొత్తం సంఖ్య ఎంతనో అన్ని జన్మలు ప్రతి జీవి పొందిగానీ నిర్వాణం చేరలేడు. తన చివరి జన్మలో జీవి ఆజీవక సిద్ధాంతాన్ని అనుసరించేవాడుగా ఉంటాడు" ఈ ఆజీవక సిద్ధాంతాన్ని అనుసరించే వాళ్ళు శ్రమణ శాఖల్లో ఒక శాఖ జరుగబోయే విషయాలను ముందే వీళ్ళు జోస్యం చెప్పేవాళ్ళు వీళ్ళు చెప్పినట్లుగానే తరచు జరుగుతుండడం వల్ల దాన్ని వీళ్ళు తమ వాదానికి ఋజువుగా చూపుతూ అనుయాయుల బలాన్ని పెంపు చేసుకొనేవాళ్ళు

ఆజీవకుడైన ఉపకుడు దారిలో ఎదురుగా వస్తున్న ఒక మహాతేజస్విని చూచాడు ఆశ్చర్యంతో అలానే కళ్ళప్పగించి చూస్తూ "ఈ ఆశ్చర్యమానుషుడెవరు? అడిగి తెలుసుకొంటాను" అని మనస్సులో అనుకొని ఆ వ్యక్తి తన సమీపం రాగానే గౌరవ సూచకంగా చేతులు జోడించి ఇలా అడిగాడు : "నా సుదీర్ఘ జీవితంలో మీలాంటి ప్రసన్నవదనులను చూచింది లేదు పరమశాంత గంభీరవదనులైన మీరు ఎవరి శిష్యులు?"

బోధివృక్షం క్రింద వైశాఖపూర్ణిమనాడు సంసార దుఃఖ తరణోపాయాన్ని

కనుక్కొని బుద్ధుడై లేచి లోకహితం కోసం ధర్మచక్ర ప్రవర్తనానికి కదులుతున్న గౌతమబుద్ధుడే ఉపకునికి ఎదురైన వ్యక్తి వారణాసికి సమీపంలో మృగదావం అనే చోట తపస్సు చేసుకొంటున్న తన పాత శిష్యులు ఐదు మందికి తాను కనుక్కొన్న దుఃఖ నివారణోపాయాలను తెలియజెప్పటానికి వెళుతున్న కరుణామూర్తియే ఉపకునికి ఎదురైన వ్యక్తి

ఉపకుడడిగిన ప్రశ్నకు సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు

**సర్వాభిభూః సర్వవిదహమస్మి**
**సర్వేషు ధర్మేష్వనుపలిప్తః**
**సర్వం జహః తృష్ణాక్షయే విముక్తః**
**స్వయమభిజ్ఞాయ కముద్దిశేయమ్** **24-20**

"రాగాది సమస్త క్లేశాలను జయించినవాడను సంసారదుఃఖ నిర్ముక్తికి అవసరమయ్యే జ్ఞానాన్నంతటినీ పొందినవాడను దేనియందునూ తగులము లేనివాడను తృష్ణాక్షయము ద్వారా ఆసవములనుండి విముక్తిని పొందినవాడను ప్రతీత్యసముత్పాద సత్యాన్ని స్వయంగా తెలుసుకొన్నవాడినై ఉండి నా గురువని ఎవరి పేరును నీకు చెప్పగలను?"

బుద్ధుని సమాధానం విని ఉపకుడు అంగీకారాన్నీ వ్యక్తం చేయలేదు అనంగీకారాన్నీ వ్యక్తం చేయలేదు. "అలానా" అని తల ఊచి తన దారిన వెళ్ళిపోయాడు

కామము (sense desires), భవము (becoming), దృష్టి (false views), అవిద్య (ignorance) - ఇవి ఆసవములు. (moral defilements)

రాగము, ద్వేషము, మోహము, మానము (conceit), దృష్టి (false views), విచికిత్స (doubt), స్త్యానము (sloth), ఔద్ధత్యము (restlessness), అహ్రీకము (moral shamelessness) అనపత్రాప్యము (moral fearlessness), ఇవి క్లేశములు (passions)

# పృచ్ఛకశీలుడు

విదర్భదేశీయుడొకడు చిన్నప్పుడే తన పేరును పృచ్ఛకశీలుడు అని మార్చుకొన్నాడు అనాడు లిఖితరూపంలో గ్రంధాలు లేవు కనుక విషయాలను గురుముఖత: తెలుసుకోవలసినదిగానే ఉండేది పృచ్ఛకశీలునికి మంచి మంచి ప్రశ్నలు వేసి విషయాలను రాబట్టడం అంటే చాలా ఇష్టం జ్ఞానార్జనకు మూడు మార్గాలను పెద్దలు చెబుతారు. ఒకటి అధ్యయనం, రెండు దేశాటనం, మూడు సజ్జనసాంగత్యం ఈ మూడు మార్గాలను ఏకం చేసి జ్ఞానార్జన చేయదలచాడు పృచ్ఛకశీలుడు

ఆచార్య శ్రేష్ఠులు ఎక్కడున్నారో అక్కడికి పోయి ప్రశ్నలు వేసి విషయాలు తెలుసుకోవాలంటే దేశాటనం తప్పదు ప్రశ్నలడగడానికి ఇంతదూరం వచ్చాడని ఆచార్యులు అతని జిజ్ఞాసకు సంతసించి అతణ్ణి తమ దగ్గరే చాలా నాళ్ళు ఉంచుకొని తమకు తెలిసిన విషయాలన్నీ అతని ప్రశ్నలకు సమాధానరూపంగా చెప్పేవారు ఈ విధంగా అతనికి సజ్జనసాంగత్యం కూడా లభ్యమౌతుండేది

ఆర్యావర్తంలో ప్రసిద్ధమైన ఆచార్యులను చాలా మందిని కలిసి అతడు ప్రశ్నలు వేసియున్నాడు ఆజీవకుల గురువైన గోశాలుని, అజ్ఞేయవాద ప్రచారకుడైన సంజయుణ్ణి, జైనుల గురువైన నిర్గ్రంధనాధ పుత్రుణ్ణి - ఇంకా చాలా మందిని ప్రశ్నలు అడిగిన ఘనత అతనిది

పృచ్ఛకశీలుడు మగధదేశంలో సంచారం చేస్తుండగా ఏ ఊరు వెళ్ళినా శాక్యముని గౌతముని ప్రశంస అతను వినడం జరిగింది. నేరుగా శాక్యమునిని- కూడా కలిసి కొన్ని ప్రశ్నలు అడగదలచాడు శాక్యముని ఎప్పుడూ సంచారం

చేస్తుంటాడని వర్షరుతువుల్లో మాత్రం శ్రావస్తిలోని జేతవన విహారంలో ఎక్కువ భాగం ఉంటాడనీ విన్నాడు అతనికి ఒక దేశం నుండి మరో దేశానికి పోవడం అంటే ఒక గ్రామం నుండి ప్రక్క గ్రామానికి పోయినంత తేలిక పని ముప్పై ఏండ్లుగా అతను అదే పనిగా దేశాలు తిరుగుతున్నాడు మగధనుండి కోసలదేశానికి బయలుదేరాడు

జేతవనం చేరి బుద్ధుని దర్శించిన వెంటనే అతను చాలా యాంత్రికంగా క్రింది నాలుగు ప్రశ్నలు టకటకా అడిగాడు

1 దానములలో ఏది గొప్ప దానం ?

2 రుచులలో ఏ రుచి గొప్ప రుచి ?

3. రతులలో (delights) ఏ రతి గొప్పది ?

4. తృష్ణాక్షయాన్ని ఎందుకు శ్రేష్ఠమైన విజయంగా భావిస్తారు ?

పై నాలుగు ప్రశ్నలకు సమాధానంగా బుద్ధుడు క్లుప్తంగా క్రింది శ్లోకాన్ని చెప్పాడు

***సర్వదానం ధర్మదానం జయతి***
***సర్వం రసం ధర్మరసో జయతి***
***సర్వాం రతిం ధర్మరతిర్జయతి***
***తృష్ణాక్షయః సర్వదుఃఖం జయతి*** **24-21**

అన్ని దానములలో ధర్మదానం గొప్పది (అభ్యుదయ నిశ్శ్రేయస్సులకు హేతువైనదాన్ని ధర్మం అంటారు. మరో విధంగా చెప్పాలంటే పురోగతికి, శాంతికి హేతువైనదాన్ని ధర్మం అనవచ్చు, ధర్మం తెలియనట్టి మోహ (మూఢ) జనులు ఎందరో లెక్కకు మిక్కిలి ఉన్నారు వారికి ధర్మాన్ని తెలియజేయడం ధర్మదానం అవుతుంది అన్ని రుచులలో ధర్మరుచి గొప్పది అన్ని రతులలో (delights) ధర్మరతి గొప్పది సంసార దుఃఖాన్ని నిర్మూలించి అర్హత్వాన్ని కలిగిస్తుంది కనుక తృష్ణాక్షయాన్ని గొప్ప విజయంగా విజ్ఞులు భావిస్తారు

# బంధితులు

ఒకనాడు శ్రావస్తి నగరంలోని బౌద్ధ విహారం నుండి కొందరు భిక్షువులు భిక్షాటన కోసం నగర వీధుల్లోకి వచ్చారు శ్రావస్తి ఆ ప్రాంతంలో ముఖ్యమైన నగరం. కనుక నానా రకాల మనుషులకు అది నివాస స్థలంగా ఉన్నది నేరగాళ్ళు, రక్షకభటులు, కారాగారాలు లేని నగరం ఉండదు కదా! శ్రావస్తి కూడా ఆ త్రివిధ లక్షణాలతో కూడినట్టిదే ! నేరగాళ్ళను కొందరిని కాళ్ళకు చేతులకు దృఢమైన ఇనుప సంకెళ్ళు తగిలించి రక్షక భటులు నడిపించుకొని పోతుండడం భిక్షువులు చూచారు

భిక్షాటన చేసి విహారానికి వచ్చాక ఆనాటి సాయంకాల సమావేశంలో ఒక భిక్షువు తాను ఆ రోజు నగరంలో చూచిన దృశ్యాన్ని ప్రస్తావించి అంత బలమైన దృఢమైన సంకెళ్ళను తాను ఎక్కడా చూచింది లేదని చెప్పాడు

"ఔను, నిజమే. నేను కూడా అంత లావాటి బలమైన దృఢమైన సంకెళ్ళను ఎక్కడా చూడలేదు. మగధ దేశంలో, కోసల దేశంలో, గాంధార దేశంలో నేను చూడని నగరం లేదు అక్కడెక్కడా కూడా ఇంత దృఢమైన బలిష్ఠమైన సంకెళ్ళు నేను చూచింది లేదు మగధదేశ రాజధాని రాజగృహంలో మూడేండ్లున్నాను అయినా ఇలాంటి ఆచ్ఛేద్యమైన సంకెళ్ళు ఆ మహానగరంలో కూడా నేను చూచింది లేదు" అని వాచాలుడైన మరొక భిక్షువు మొదటి భిక్షువు చెప్పిన దాన్ని సమర్థించాడు

అంతవరకు మౌనంగా ఉన్న బుద్ధుడు అప్పుడిలా అన్నాడు "భిక్షువులారా, మీరు వర్ణించి వర్ణించి చెప్పే సంకెళ్ళ కన్నా మిక్కిలి బలమైన, దృఢమైన

సంకెళ్ళున్నాయి. ఆ సంకెళ్ళతో పోల్చుకొంటే ఈ శ్రావస్తిలో మీరు నేడు చూచిన ఇనుప సంకెళ్ళు తామర తూడులతో సమానమని చెప్పవలసి ఉంటుంది. అన్ని దుఃఖాలకు మూల కారణమైన తృష్ణ అనబడే సంకెల విషయం ఆలోచించండి తృష్ణా శృంఖలంచే బంధింపబడి జీవులు సంసారం అనబడే కారాగారంలో ఎలా దుఃఖాల పాలయియున్నారో బాగా ఆలోచించండి ఆ ఇనుప సంకెళ్ళను ఏ కంసాలి యైనా తెగగొట్టగలడు. తృష్ణాశృంఖలాన్ని ఛేదించడం అంత సులభం కాదు కదా! తృష్ణా శృంఖల ఛేదనం కోసమే వివేకులైన మీరు అన్నీ వదలిపెట్టి భిక్షువులయ్యారు కనుక ఆ ఛేదన కార్యంలోనే సదా నిమగ్నులై ఉండండి"

ముగింపుగా క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు.

***న తద్ దృఢం బంధనమాహుర్ధీరా***
***యద్ ఆయసం దారుజం పర్బజం చ***
***సారవద్ రక్తా మణికుండలేషు***
***పుత్రదారేషు చ యా ఉ పేక్షా ।*** **24-12**

***ఏతద్ దృఢం బంధనమాహుర్ధీరా***
***అపహారి శిథిలం దుప్ప్రమోచం***
***ఏతదపి ఛిత్వా పరివ్రజ***
***న్త్యనపేక్షిణః కామసుఖం ప్రహాయ ॥*** **24-13**

ఇనుముతో కొయ్యతో త్రాళ్ళతో చేసిన బంధనాలు దృఢమైన బంధనాలుగా ప్రాజ్ఞులు చెప్పరు మణికుండలాలు మొదలగు ఆభరణాల మీద, భార్యాబిడ్డల మీద ఉన్న రాగాన్నే దృఢమైన బంధనంగా వారు చెబుతారు ఇది మనిషిని అధోగతి పాలు చేస్తుంది వదిలినట్లే అనిపిస్తుంది, కానీ పూర్తిగా వదిలించుకోవడం చాలా కష్టం. అపేక్షారహితులు ఇంద్రియ సుఖాలను త్యజించడం ద్వారా తష్ణాబంధనాన్ని త్రెంచి వేసి స్వేచ్ఛాజీవులవుతారు

స్థవిరరాహులుడు చెప్పినది .

సర్వాకారం కారణమేకస్య మయూరచంద్రకస్యాపి
నాసర్వజ్ఞైర్జ్ఞేయం సర్వజ్ఞబలం హి తత్ జ్ఞానమ్

*Every variety of cause*

*Which brings about the glittering shine*

*In a single eye of a peacock's tail*

*Is not accessible to limited understanding*

*The omniscient knows them all*

- Stcherbatsky

# పంచభిక్షువులు

శ్రావస్తి నగరంలో ఒక ఆశ్రమంలో అప్పుడప్పుడు గట్టిగా మాటలు వినబడేవి "ఏమిటి ఇంత గట్టిగా మాట్లాడుకొంటున్నారు" అని ఎవరైనా కుతూహలంతో వెళ్ళి చూస్తే కనబడే దృశ్యం అక్కడి భిక్షువుల మధ్య జరిగే వివాద దృశ్యమే ఇంతకీ ఆ ఆశ్రమంలో ఉన్నది ఐదుమంది భిక్షువులే వారి వారి పనులయ్యాక తీరికగా ఒకచోట కూర్చున్నారంటే ఇక వివాదం మొదలైనట్లే !

ఆ ఐదుగురు ఆశ్రమంలో తలా ఒక బాధ్యతను తీసుకొని చక్కగానే చేస్తున్నారు ఇక్కడ సమస్య లేదు కానీ వారు చేసే సాధనలు వ్యక్తి వ్యక్తికి వేరైనందువల్ల సమస్య వచ్చి పడింది ఇక్కడ కూడా సమస్య తలెత్తేది కాదు కానీ వాళ్ళు తమ తమ సాధనల్లో అభిమానం ఎక్కువ పెంచుకొన్నారు ఆ కారణం వల్ల వాళ్ళు ఇద్దరో ముగ్గురో నలుగురో ఐదుగురో ఒకచోట చేరడం జరిగితే ఇక వాగ్యుద్ధం మొదలైనట్లే !

వాళ్ళల్లో ఒక భిక్షువు చక్షురింద్రియ నిగ్రహం అభ్యసిస్తున్నాడు ఈ అభ్యాసం చాలా శ్రేష్ఠమనీ తక్కిన నిగ్రహాలు దీని ముందర దిగదుడుపనీ అతని దృఢాభిప్రాయం మానవుని శక్తిలో 80 శాతం చక్షురింద్రియం ద్వారా వ్యయమైపోతుందట ! కనుక ఈ ద్వారం మీద అదుపు సంపాయిస్తే అధ్యాత్మశక్తి పెరిగి మనిషి గొప్పవాడవుతాడని అతని విశ్వాసం ఆ వాదాన్నే అతను అనేక ఉదాహరణలతో నిరూపించే ప్రయత్నం చేస్తుంటాడు. శలభ దృష్టాంతంలాంటి దృష్టాంతాలు క్రొత్త క్రొత్తవి వినిపిస్తుంటాడు

మరో భిక్షువు సాధనక్రమం వేరుగా ఉంది అతను జిహ్వేంద్రియ

నిగ్రహ సాధకుడు. "బ్రహ్మచర్యనియమం పాటించేవాళ్ళలో ఎక్కువ మందికి జిహ్వాచాపల్యం చుట్టుకొంటుంది. కనుక బ్రహ్మచర్యంతోబాటు జిహ్వాచాపల్యాన్ని కూడా అరికట్టగలిగితే మూడొంతులు సాధన ముగిసినట్లే" అని అతని వాదన.

మరో భిక్షువు వాదన ఇలా ఉంటుంది "అసలు సాధన అంటే ఏమిటి? మనస్సును విక్షేపం పాలు చేయకుండా ప్రశాంతంగా ఉంచుకోవడమేగదా! నా దృష్టిలో మనస్సును విక్షేపం పాలు చేసేవి ముఖ్యంగా మనుష్యుల మాటలే కనుక ఈ ఒక్క శ్రవణేంద్రియ విషయంలో తగు జాగ్రత్త తీసుకొంటే ఇక సాధించవలసింది సాధించినట్లే!"

మరొక భిక్షువు తన వాదనను చాలా క్లుప్తంగా ఇలా వినిపిస్తుంటాడు. "దుస్సాధ్యమైనదాన్ని సాధించేదాన్నే నేను సాధన అంటాను నా మటుకు నాకు ఘ్రాణేంద్రియ నిగ్రహం దుస్సాధ్యమనిపిస్తుంది గాలి పీల్చకుండా జీ: ౹ేపు పీల్చే గాలితోబాటు వాసనలు లోపలికి వస్తాయి గాలి మాత్రమే ౹ వచ్చేట్లు, వాసనలు బంధయ్యేట్లుగా సాధించాలనుకొంటున్నాను ఇది చాలా గొప్ప సాధన అని ఎవరైనా సరే ఒప్పుకొని తీరవలసిందే"

ఐదవ భిక్షువు ఇలా అంటాడు · "సాధకుడైనవాడు అసలు మూలాన్ని పట్టుకోవాలి పైపై సాధనల వల్ల శ్రమ ఎక్కువ, ఫలితం తక్కువ. బాగా ఆలోచిస్తే అన్ని ఇంద్రియాలకు మూలమైన ఇంద్రియం స్పర్శేంద్రియం అని స్పష్టంగా తెలుస్తుంది దేహాన్నంతా చర్మం కప్పి ఉంది చర్మం అంతటా స్పర్శేంద్రియం వ్యాపించి ఉంది. తక్కిన ఇంద్రియాలన్నీ ఈ స్పరేంద్రియ రూపాంతరాలే అనే విషయాన్ని, ఆలోచించేవాడెవడైనా సరే ఒప్పుకొనక తప్పదు, అలాంటి మూలేంద్రియ నిగ్రహం సాధిస్తే తక్కినవి కూడా సాధించనట్లే"

వీరి వాదనలు తీవ్ర స్థాయికి చేరుకొంటున్న సమయంలో బుద్ధుడు పర్యటన చేస్తూ శ్రావస్తి సమీపంలోని జేతవనంలో విడిది చేశాడు. పంచ భిక్షువుల

మధ్య జరుగుతున్న వాదనను అక్కడి భిక్షువులు కొందరు బుద్ధునికి వినిపించారు ఆ వాదన విని ఆయన ప్రసన్న గంభీరంగా "ఏ ఒక ఇంద్రియ నిగ్రహమైనా మంచిదే  అన్ని ఇంద్రియ నిగ్రహాలు ఇంకా మంచిది." అని క్రింది రెండు శ్లోకాలను పఠించాడు

చక్షుషా సంవర: సాధు: సాధు: శ్రోత్రేణ సంవర:
ఘ్రాణేన సంవర: సాధు: సాధు: జిహ్వాయా సంవర: 25-1

కాయేన సంవర: సాధు: సాధు: వాచా సంవర:
మనసా సంవర: సాధు:, సాధు: సర్వత్ర సంవర:
సర్వత్ర సంవృతో భిక్షు: సర్వదు:ఖాత్ ప్రముచ్యతే 25-2

# భూస్వామి

ఒకనాడు భిక్షాటనకు వెళ్ళిన బుద్ధునికి ఒక భూస్వామి ఎదురుపడి ఇలా అన్నాడు: "ఇలా భిక్షాటన చేస్తూ ఎందుకు జీవించాలి? ఇతరుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బ్రతకడం ఎందుకు? ఒకరోజు పెట్టారు మరో దినం లేదు పొమ్మంటారు ఇలాంటి అనిశ్చితమైన బ్రతుకు తలచుకొంటేనే భయం వేస్తుంది కదా! మీరంతా గుంపులు గుంపులుగా ఎలా భయం లేకుండా తిరుగుతున్నారో ఆశ్చర్యంగా ఉంది. నన్ను చూడు, నేనూ మీలాంటి మనిషినే కానీ నా జీవితంలో భయానికి చోటివ్వకుండా బ్రతుకుతున్నాను. పొలాలకు నీళ్ళు పెట్టి దున్నుతాను నాట్లు వేసి పైరు పెంచుతాను కోత కోసి ధాన్యం ఇంటికి తెచ్చుకొంటాను ఒక సంవత్సరం పండకపోయినా ఫరవాలేదు నెట్టుకరావడానికి తగినంత నిల్వ పెట్టుకొని నిశ్చింతగా జీవిస్తాను ఇలాంటి భయం లేని జీవితాన్ని మీరు కూడా వెదుక్కోవాలి అనిశ్చితమైన, భద్రతారహితమైన జీవితాలతో ఏమి సాధిస్తారు?"

అతని వాగుడును ఓపికగా విని బుద్ధుడిలా సమాధానం చెప్పాడు: "మేము కూడా మనోక్షేత్రమనే పొలాన్ని కరుణాజలంతో నింపి శమదమములనే ఎద్దులను పూన్చిన ఏకాగ్రత అనే నాగలితో దున్నుతాము కుశల ధర్మాల నాట్లు వేసి పెంచుతాము అకుశల ధర్మాల కలుపుతీతను కూడా చేస్తాము నిశ్శ్రేయస ఫలాన్ని తెచ్చిపెట్టుకొని సుఖంగా నిర్భయంగా జీవిస్తాము. ఒక సంవత్సరం కరువేమిటి అసంఖ్యేయ కల్పాల కరువైనా మాకు భయం ఉండదు" ముగింపుగా ఈ క్రింది శ్లోకాలను కూడా చెప్పాడు

తృష్ణాయా జాయతే శోకః తృష్ణాయా జాయతే భయం
తృష్ణాయా విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ 16-8

తృష్ణ (craving) వలన శోకం కలుగుతుంది, భయం కలుగుతుంది తృష్ణా విముక్తునకు శోకం ఎందుకుంటుంది? భయం ఎందుకుంటుంది?

ప్రియతో జాయతే శోకః ప్రియతో జాయతే భయమ్
ప్రియతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ 16-4

ప్రియం = affection

ప్రేమతో జాయతే శోకః ప్రేమతో జాయతే భయమ్
ప్రేమతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ 16-5

ప్రేమ = endearment

రత్యా జాయతే శోకో రత్యా జాయతే భయమ్
రత్యా విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ 16-6

రతి = attachment to sensual pleasures

కామతో జాయతే శోకః కామతో జాయతే భయమ్
కామతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ 16-7

కామ = lust

# హంసఘాతకుడు

ఒక శ్రామణేరునికి (భిక్షుసంఘంలో క్రొత్తగా చేరి ప్రాథమిక శిక్షణావస్థలో ఉన్నవాడు  ఇంగ్లీషులో novice) పాత అలవాట్లు ఇంకా వదలలేదు  ఏదైనా రాయి కనబడితే దాన్ని తీసి దేన్నైనా గురి చూసి కొట్టడం అతని అలవాటు. చిన్నప్పటి నుండి ఈ చపలతను అతను అలవాటు చేసుకొన్నాడు.  అతని స్నేహితులు కూడా అతని చపలతను పెంచి పోషించారు  ఎక్కడైనా మామిడి పండ్లు, వెలగపండ్లు మొదలగు వాటిని రాళ్ళు రువ్వి క్రింద పడవేయడానికి ఇతణ్ణి బాగా ఉపయోగించుకొనేవారు.

భిక్షుసంఘంలో చేరిన కొన్నాళ్ళకు అక్కడున్న కొందరు శ్రామణేరులతో కలిసి అతడు ఒక నది ఒడ్డుకు వాహ్యాళిగా వెళ్ళాడు  నది గట్టున నడుస్తుంటే చేతితో పట్టుకొని విసిరివేయడానికి అనువైన చిన్న చిన్న రాళ్ళు అతనికి కనబడితే చపలతను ఆపుకోలేక ఒంగి ఒక రాయిని చేతికి తీసుకొన్నాడు  అలా తీసుకోగానే అతనికి పాత సంఘటనలు చకచకా జ్ఞాపకం రాసాగాయి.  తను గురి చూసి కొట్టి సాధించిన విజయాలను స్నేహిత శ్రామణేరులకు చెప్పాలని కూడా మనస్సు ఆరాటపడింది  ఒకసారి ఊర్లో ఒక మామిడి చెట్టు చిటారుకొమ్మలోని పండును ఎలా రాయితో కొట్టి ఆ పండు భూమి మీద పడకముందే పరుగెత్తి దాన్ని ఎలా చేత్తో పట్టుకొన్నాడో గర్వంగా చెప్పాడు  ఇంకా కొన్ని సంఘటనలు చెప్పాడు ఒక చిన్న శ్రామణేరుడు ఇదంతా చాలా ఆసక్తిగా ఉత్సాహంగా వింటూ నదికి మీద కొంత ఎత్తులో ఎగురుతున్న కొంగను చూచాడు  "నీ గురి కౌశలం గురించి ఊరక కోతలు కోయకు  అంత మొనగాడివే అయితే ఏదీ ఆ కొంగను కొట్టు చూద్దాం" అన్నాడు కవ్వింపుగా.  గురి మొనగాడికి రోషం వచ్చేసింది

చేతిలో పట్టుకొని త్రిప్పుతున్న రాయిని కొంగకు గురి పెట్టి వేగంగా విసిరాడు ఆ కొంగ దురదృష్టం, రాయి దానికి సూటిగా తగిలి ఆ క్షణంలోనే చచ్చి దబ్బుమని నీళ్ళలో పడింది

గురిమొనగాడి కళ్ళల్లో విజయగర్వం' ఒక్క క్షణం మెరిసి వెంటనే మాయమైంది అతనికి భయం పట్టుకొంది కొంగను కొట్టి చంపినట్లు తెలిస్తే విహారంలో ఎన్ని చీవాట్లు తినాలో ఊహించుకోగానే అతనికి చమటలు పట్టాయి. కొంగను కొట్టి చంపిన విషయం ఎవరికీ చెప్పకండని స్నేహిత శ్రామణేరులను ప్రాధేయపడినాడు. 'మేమెందుకు చెప్తాం చెబితే నీతోబాటు మాకూ చీవాట్లు తప్పవుగా'' అని వాళ్ళు అతనికి ధైర్యం చెప్పారు.

విహారానికి తిరిగి వెళ్ళగానే గురిమొనగాడికి పిలుపు వచ్చింది-బుద్ధుని సమ్ముఖానికి రావలసినదిగా. "కొంగ విషయమై ఉండదు ఇంకేదైనా విషయమై పిలిచి ఉంటారు'' అని అతడు ధైర్యం తెచ్చుకొని వెళ్ళాడు వాస్తవానికి బుద్ధుడు పిలిచింది కొంగ విషయం మాట్లాడడానికే. దూరం నుండి ఆ సంఘటనను చూచిన ఒక భిక్షువు నేరుగా బుద్ధుని దగ్గరకు వెళ్ళి శ్రామణేరుని ఆ దుశ్చేష్టితాన్ని చెప్పియున్నాడు

ఆ శ్రామణేరుణ్ణి బుద్ధుడు ఇలా మృదువుగా మందలించాడు 'నాన్నా, ఆ కొంగను ఎందుకు చంపావు? అది నీకేమి అపకారం చేసింది? మైత్రి, కరుణ, అహింస మొదలగు సద్గుణాలను అలవరచుకొనడానికి కదా నీవు ఇక్కడ చేరింది. మరి నీవు చేసినదేమిటి? మనం గృహస్థులకు కూడా అహింసను ప్రధానంగా బోధిస్తున్నాము కదా! శ్రమణుడై ఉండీ నీవు అహింసోల్లంఘనం చేయడం ధర్మమా? నీ హృదయము మంచిదే అయినా నీ చపలత కారణంగా తప్పిదం జరిగిపోయింది. ఇకనైనా నీ చేతులను కాళ్ళను నాలుకనూ అదుపులో పెట్టుకో బాబూ! నీ గురిని కొంగల మీద పెట్టవద్దు నిర్వాణం మీద పెట్టు'' ముగింపుగా

క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు.

**హస్తసంయత: పాదసంయతో వాచా సంయత: సంయతోత్తమ:**
**అధ్యాత్మరత: సమాహిత: ఏక: సంతుష్టస్తమాహుర్భిక్షుమ్** 25-3

చేతులను, పాదాలను, వాక్కును, అదుపులో పెట్టుకొని తనను తాను చక్కగా నియమించుకొనువాడు, ప్రజ్ఞా సాధనములైన ధ్యానాది అభ్యాసములందు ఇష్టము చూపువాడు, శాంతుడు, ఏకాకి, సంతోషుడు అయినట్టి వానిని భిక్షువని చెప్పుదురు.

# సంగలకులుడు

సంగలుడు ఒక పేద రైతుకూలీ ఒక భూస్వామి దగ్గర సేద్యం పనులు చేస్తూ జీవించేవాడు. ఒకనాడు అతను యజమాని పొలం దున్నుతుండగా ఆ దారిలో ఒక భిక్షువు పోవడం జరిగింది. ఆ భిక్షువును చూచి ఇతను మనస్సులో అనుకోవాలనుకొన్న మాటలను అదుపు తప్పి పైకి గట్టిగానే అనేశాడు. "ఈ సన్న్యాసుల అదృష్టమే అదృష్టం. పెట్టి పుట్టారు. నౌకరి చాకిరి ఏమీ లేకుండానే హాయిగా జీవించేస్తున్నారు."

ఈ మాటలు విని ఆ భిక్షువు ఆగి అతణ్ణి చూచాడు. చీలికలు పేలికలైన మాసిన గుడ్డలతో ఒళ్ళంతా మట్టి కొట్టుకొన్న దేహంతో ఉన్న అతణ్ణి చూచాడు. "నీకు సన్న్యాసి కావాలనుందా? అయితే మా ఆశ్రమంలో చేరుతావా?" అని అడిగాడు. దీన్ని వేళాకోళం మాటలుగా అతను తీసుకొంటాడేమోనని నొక్కి నొక్కి అడిగాడు. "నీవు సిద్ధమేనా? ఇప్పుడే ఆశ్రమానికి తీసుకెళ్ళి చేరుస్తాను." సంగలునికి బలే ఆశ్చర్యం వేసింది. పెద్దచదువులవాళ్ళు, పెద్దకులాలవాళ్ళే సన్న్యాసులవుతారని ఇన్నాళ్ళు తను భావించాడు. తనకు కూడా అలాంటి అవకాశం ఉందని కలలో కూడా ఊహించలేదు వెంటనే నాగలిని వదిలిపెట్టి భిక్షువును అనుసరించాడు. భిక్షువు అతణ్ణి దారిలో ఒక కొలను దగ్గర ఆపి "ఈ మాసిన బట్టలతో మురికి దేహంతో ఆశ్రమం లోపలికి పోవడం బాగుండదు. నీవిక్కడ చక్కగా స్నానం చేయి. ఆ మాసిన బట్టలు మళ్ళీ కట్టుకోవద్దు. కొత్తవి తెచ్చిస్తాను. అంతవరకు ఆగు" అని భిక్షువు ఆశ్రమం వైపు వెళ్ళాడు.

కొత్తబట్టలు ధరించి సంగలుడు విహారంలోకి ప్రవేశించాడు. ఎందుకైనా

మంచిదని మాసిన బట్టలను ఒక చుట్టగా చుట్టి కొలను గట్టున ఉన్న ఒక చెట్టు తొఱ్ఱలో భద్రపరచాడు.

విహారంలో కొత్త జీవితం సంగలునికి బాగానే ఉంది. మంచి నియమాలు, వేళకు పుష్టికరమైన ఆహారం, చదువులు, సత్సాంగత్యం మొదలగు వానివల్ల అతనిలో కొట్టొచ్చిన మార్పులు వేగంగా వచ్చేశాయి. దేహం కూడా బాగా నునుపుదేలి రంగును, ప్రకాశాన్ని సంతరించుకొన్నది.

కానీ కొన్నాళ్ళకు ఆ జీవితం మీద అతనికి విసుగు పుట్టింది. పాత జీవితం వైపు మనస్సు లాగుతున్నది. అదే సమయంలో వివేకం కూడా పని చేస్తూనే ఉన్నది కొత్త జీవితంలోని లాభాలను పాత జీవితంలోని నష్టాలను బేరీజు వేసి బైటకు వెళ్ళడం మంచిది కాదని చెబుతున్నది. ఇలా ఘర్షణ అంతరంగంలో ఏర్పడినప్పుడు అతను ఆ కొలను గట్టున ఉన్న చెట్టు దగ్గరకు వెళ్ళేవాడు. ఆ చెట్టు తొఱ్ఱలోని మాసిన బట్టలను పైకి తీసి ఇలా అనేవాడు : "ఒరే నంగలా, ఈ బట్టలతో మళ్ళీ ఆ దుర్భరమైన జీవితాన్ని గడపదలచుకొన్నావా? అయితే వెళ్ళరా వెళ్ళు, ఈ బట్టలను ధరించి మరీ వెళ్ళు" ఇలా కొంతసేపు ఆత్మ సంబోధన చేసుకొన్నాక అతనికి పాత జీవితం ఎడల రోత పుట్టి మళ్ళీ ఆశ్రమంలోకి వచ్చేసేవాడు ఇతను అప్పుడప్పుడు ఒంటరిగా కోనేటిగట్టుకు పోవడం గమనించిన ఆశ్రమవాసులు "ఎందుకు అక్కడికి వెళ్తుంటావు?" అని అడిగేవారు. "అక్కడ మా గురువుగారున్నారు మనస్సు చలించినప్పుడల్లా ఆయన్ను కలిసి మాట్లాడి వస్తుంటాను" అని నంగలుడు సమాధానం చెప్పేవాడు.

ఇలా కొంతకాలం గడిచింది. సాధనావస్థలో అతను ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్న కొలదీ కోనేటిగట్టుకు పోవడాలు తగ్గిపోతూ వచ్చింది. చివరి మెట్టైన అర్హత్వాన్ని కూడా అతను చేరుకోగలిగాడు. కోనేటి గట్టుకు పోవడం పూర్తిగా మానేశాడు. "పోవడం ఎందుకు మానేశావు?" అని ఎవరైతే అడిగితే "అవసరం

ఉన్నన్నాళ్ళు గురువు దగ్గరకు వెళ్ళాను. ఇక పోవలసిన అవసరం లేదు కనుక మానేశాను" అని జవాబిచ్చేవాడు

ఆ పిమ్మట ఒకనాడు భిక్షువుల సమావేశంలో నంగలుని ప్రస్తావన వచ్చింది. ఒక భిక్షువు బుద్ధునితో ఇలా అన్నాడు . "నంగలుడు పూర్వం లాగా అమాయకుడు కాదు ఇప్పుడు డాంబికం మాటలు, అబద్ధాలు చెప్పడం కూడా నేర్చాడు. తాను అర్హతుడనని ప్రకటించుకొంటున్నాడు"

ఎవరు ఏ స్థితిలో ఉన్నారనేది బుద్ధునికి కరతలామలకమే కదా ! ఆయన ఆ భిక్షువుని వారిస్తూ ఇలా అన్నాడు "సంగలుడు డాంబికాలు పలకడం లేదు, అబద్ధాలు చెప్పడం లేదు అతను మొదటినుండి ఆత్మసంబోధన చేసుకొంటూ తన్ను తాను క్రమంగా చక్కదిద్దుకొంటూ చివరకు అర్హత్వాన్ని సంపాయించాడు" ఈ ప్రస్తావన ముగిస్తూ క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు.

**ఆత్మనా చోదయేదాత్మానం ప్రతివసేదాత్మానమాత్మనా**
**స ఆత్మగుప్తః స్మృతిమాన్ సుఖం భిక్షో విహరిష్యసి** 25-20

ఓ భిక్షూ, నిన్ను నీవే ప్రేరణ పరచుకొనుము నిన్ను నీవే పరీక్షించి చూచుకొనుము తన్ను తాను రక్షించుకొనువాడు, తన్ను తాను పరిశీలన చేసుకొనువాడు సుఖ శాంతులతో జీవించును

**ఆత్మాహ్యాత్మనో నాథ ఆత్మాహ్యాత్మనో గతిః**
**తస్మాత్ సంయమయాత్మనం అశ్వం భద్రమివ వణిక్** 25-21

ఆత్మయే ఆత్మకు అభయస్థానము. ఆత్మయే ఆత్మకు గమ్యస్థానము. గుఱ్ఱముల వ్యాపారము మీద బ్రతుకువాడు తన దగ్గరున్న జాతి గుఱ్ఱమును చాలా జాగరూకతతో చూచుకొనునట్లు ఎవనికి వాడే తన విషయములో జాగ్రత్త తీసుకొనవలెను.

# ఆనందుడు

స్త్రీలు కూడా ముక్తికోసం ఇల్లు వదలిపెట్టి పరివ్రాజక జీవితాన్ని చేపట్టే అధికారం పురుషులతో సమానంగా కలిగియున్నారని తలచి వారికి భిక్షుసంఘంలో ప్రవేశాన్ని 2500 ఏండ్ల క్రితమే బుద్ధుడు అనుగ్రహించి యున్నాడు. ఈ విప్లవాత్మక చర్య వెనుక ఆనందుని ప్రేరణ చాల ఉన్నది.

ఆనందుడు వరుసకు బుద్ధుని తమ్ముడౌతాడు శుద్ధోదనుని తమ్ముడైన అమితోదనుని కుమారుడు ఆనందుడు. ఇతను పుట్టినప్పుడు శాక్యవంశీయులందరూ ఆనందించారు కనుక ఇతనికి ఆనందుడని నామకరణం చేశారు. బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తనం రెండవ సంవత్సరంలో ఆనందుడు, అనిరుద్ధుడు, దేవదత్తుడు మొదలగు ప్రముఖ శాక్యయువకులు సంఘంలో చేరారు.

ధర్మచక్ర ప్రవర్తనం మొదటి ఇరవై సంవత్సరాలు బుద్ధునికి సేవక శిష్యులెవరూ స్థిరంగా నియమింపబడలేదు. తన ఏభై ఐదవయేట బుద్ధుడు ఒకనాడు జేతవన విహారంలో శిష్యులనుద్దేశించి "ఇప్పుడు నేను వృద్ధుడవౌతున్నాను. నాకు సహాయంగా ఎప్పుడూ నాతోనే ఉండే ఒక సేవక శిష్యుణ్ణి ఎన్నుకోండి" అని చెప్పాడు. ఇది ఒక మహద్భాగ్యంగా భావించి శారిపుత్రుడు మొదలగు శిష్యులనేకమంది "నేను నేను" అని ముందుకు వచ్చారు. "శారిపుత్రా, నీవు నాకు సేవలు చేయడానికి వచ్చేస్తే ఇక క్రొత్తవాళ్ళకు అభిధర్మంతో జ్ఞానం ఇచ్చేదెవరు?" అని ఇలా ముందుకు వచ్చిన ప్రతి శిష్యుడికి ఏదో ఒకటి చెప్పి బుద్ధుడు వారించాడు. ఈ తతంగం జరుగుతున్నంతసేపు ఆనందుడు మౌనంగా కూర్చున్నాడు. చివరకు అందరి దృష్టి అతని మీదికి పోయింది. అందరూ ఒక్కసారిగా "ఆనందుడే ఆ భాగ్యానికి అర్హుడు" అని ధ్రువీకరించారు.

"సేవకశిష్యుడుగా ఉంటాను కానీ ముందుకు తథాగతుడు- నా ఎనిమిది నిబంధనలను అంగీకరించాలి" అన్నాడు ఆనందుడు.

1. బుద్ధుడు తాను స్వీకరించిన వస్త్రాలను నాకు ఇవ్వరాదు.
2. తనకు వచ్చిన ఆహారాన్ని నాకు ఇవ్వరాదు.
3. తన కుటీరంలో నన్ను ఉండమనరాదు
4 తనను ఆహ్వానించిన స్థలాలకు నన్ను కూడా రమ్మనరాదు
5. నన్ను ఆహ్వానించిన స్థలాలకు బుద్ధుడు దయతో నాతో రావలెను
6 బుద్ధుని దర్శనం కోసమై వచ్చే భక్తులను ప్రవేశపెట్టి పరిచయం చేసే అనుమతి నాకు ఎప్పుడూ ఉండవలెను
7 నాకు ఏమైనా సంశయాలు కలిగితే వెంటనే బుద్ధుడు సంశయ నివారణ చేయవలెను
8. నా పరోక్షంలో బుద్ధుడు చేసిన ధర్మప్రవచనాలను మళ్ళీ నాకు వినిపించవలెను

కడు చిత్రమైన ఈ నిబంధనలను బుద్ధుడు అంగీకరించాడు ఆనాటి నుండి బుద్ధుని పరినిర్వాణం వరకు ఇరవై ఐదేండ్లు విడువకుండా ఆనందుడు బుద్ధుణ్ణి నీడవలె అనుసరించి సేవలు చేసి ధన్యుడయ్యాడు

రోహిణీనది జలాల వాటా విషయమై తగాదాలు పడుతున్న శాక్యులు కోలియుల మధ్య సామరస్య సాధనకోసమై బుద్ధుడు ఒకసారి కపిలవస్తు నగరానికి పోయినప్పుడు మహాప్రజాపతి గౌతమి బుద్ధుణ్ణి సందర్శించి స్త్రీలను కూడా భిక్షు సంఘంలో చేర్చుకోమని బ్రతిమలాడింది బుద్ధుడు ఒప్పుకోలేదు. తాను పుట్టిన ఏడవ దినమే కన్నతల్లి మాయాదేవి గతించగా అప్పటి నుండి తనను కన్నబిడ్డవలె ప్రేమతో పెంచి పెద్దచేసిన పినతల్లియే మహాప్రజాపతి గౌతమి అయినా సరే ఆమె అభ్యర్ధనను త్రోసిపుచ్చి బుద్ధుడు వైశాలికి ప్రయాణమయ్యాడు.

కొన్నాళ్ళ తరవాత ప్రజాపతి గౌతమి తానే స్వయంగా శిరోజాలను కత్తిరించుకొని, పసుపు బట్టలు ధరించి, పాదరక్షలు కూడా లేకుండా, కొన్ని వందలమంది స్త్రీలు వెంటరాగా కాలినడకన వైశాలికి ప్రయాణమయ్యింది 150 మైళ్ళ దూరం నడచివచ్చి బుద్ధుని కుటీరం ముందు ఏడుస్తూ నిలబడింది ఆమె దీనావస్థను చూచి ఆనందుడు చలించిపోయాడు బుద్ధుని మీద వత్తిడి తెచ్చి చివరకు ఆయన్ను అంగీకరింపజేసి స్త్రీలకు కూడా భిక్షుసంఘంలో ప్రవేశార్హతను ఆనందుడు సాధించాడు.

ఆనందుడు లెక్కలేనన్ని సార్లు బుద్ధుణ్ణి సంభాషణల్లోకి దింపియున్నాడు. మచ్చుకు ఒక సంభాషణ.

"స్త్రీల విషయంలో ఎలా మసలుకోవాలి భగవాన్ ?"

"చూడనేవద్దు"

"తప్పనిసరి చూడవలసివస్తే ఎలా భగవాన్ ?"

"మాట్లాడకు"

"తప్పనిసరి మాట్లాడవలసివస్తే ఎలా భగవాన్ ?"

"మెలకువ కలిగి ఉండు."

పాండిత్యం, జ్ఞాపకశక్తి, మంచినడత, పట్టుదల, సేవాతత్పరత, ఈ ఐదింటిలో ఆనందుడు అగ్రగణ్యుడని బుద్ధుడొకసారి మెచ్చుకొనియున్నాడు. ఒకసారి ఒక బ్రాహ్మణుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆనందుడు తనకు మొత్తం 84వేల ఉపదేశవాక్యాలు తెలుసునన్నాడు. 82వేల వాక్యాలు బుద్ధునివి. 2వేల వాక్యాలు బుద్ధుని శిష్యులవి. ఆనందుని జ్ఞాపకశక్తి అపారం. [illegible] బుద్ధుని పరినిర్వాణం తరువాత భిక్షువులందరూ అతణ్ణి ధర్మపాలకుడిగా [illegible]

జేతవనంలో [illegible] తెచ్చిన పుష్పాలను [illegible]

నిరాశతో తిరిగిపోవడం చాలా సార్లు చూచిన ఆనందుడు ఒకనాడు బుద్ధునితో "మీరు ఇక్కడలేని సమయాల్లో వచ్చిన భక్తులకు వారి భక్తికి ఆలంబనగా ఏదైనా చైత్యాన్ని సూచించండి" అని ప్రాధేయపడినాడు. బోధివృక్షాన్ని చైత్యంగా పెట్టు వచ్చని బుద్ధుడు చెప్పాడు. ఆనందుడు వెంటనే గయనుండి బోధివృక్షఫలాన్ని తెప్పించి జేతవనంలో బుద్ధుని కుటీరం ముందు ఒక బోధివృక్షాన్ని మొలకెత్తింపజేశాడు. ఆ వృక్షానికి ఆనందబోధి అనే పేరు ఏర్పడింది

బుద్ధుని పరినిర్వాణం నాటికి ఆయన శిష్యుల్లో ఐదువందల మంది అర్హతులు (ముక్తులు) అయినవారున్నారు. ఆ అర్హతులలో చాలా మంది అట్టడుగు వర్గాల నుండి వచ్చినవారు, స్త్రీలు కూడా ఉన్నారు ఆనందుడు అప్పటికి అర్హతుడు కాలేదు బుద్ధుని పరినిర్వాణం తరువాత కొన్ని నెలలకు ఆనందుడు కూడా అర్హతుడైనాడు పరినిర్వాణం తరువాత మూడు నెలలకు రాజగృహనగరంలో ఏర్పాటైన అర్హతుల ప్రథమ సంగీతిలో ఉపాలితో బాటు ఆనందుడు కూడా ప్రముఖపాత్ర వహించాడు బుద్ధుని వాక్యాలను క్రోడీకరించి త్రిపిటకాలుగా విభజించి ఆ ఉపదేశామృతం భావితరాలకు చెక్కు చెదరకుండా అందింపజేసిన మహా ఘనత ప్రథమ సంగీతికి దక్కుతుంది

ఒకానొక సందర్భంలో బుద్ధుడు క్రింది శ్లోకాన్ని ఆనందునికి చెప్పాడు.

**దివా తపత్యాదిత్యో రాత్రావాభాతి చంద్రమా**
**సన్నద్ధ: క్షత్రియస్తపతి ధ్యాయీ తపతి బ్రాహ్మణః**
**అథ సర్వమహోరాత్రం బుద్ధస్తపతి తేజసా** 26-5

సూర్యుడు పగటివేళ ప్రకాశించును చంద్రుడు రాత్రివేళ ప్రకాశించును. క్షత్రియుడు యుద్ధసన్నద్ధుడైనప్పుడు (కవచం, కత్తి, డాలు వగైరా ధరించినప్పుడు) ప్రకాశించును ధ్యానం (meditation) కలిగిన వేళల్లో బ్రాహ్మణుడు ప్రకాశించును. బుద్ధులు అన్ని వేళల్లోనూ ప్రకాశించుచుందురు

కూడా కదిలారు.

వైశాలిలోని మహావన విహారానికి వచ్చి బుద్ధుని కుటీరం ముందు ఏడుస్తూ నిలబడింది గౌతమి. ఆమె దీనావస్థను చూచి ఆనందుడు చలించిపోయి బుద్ధుని మీద తీవ్రమైన ఒత్తిడి తెచ్చి ఎట్టకేలకు స్త్రీలు కూడా భిక్షుసంఘంలో చేరే అనుమతిని పొందాడు

ఒకనాడు గౌతమి బుద్ధుని దగ్గరకు వచ్చి "సుగతా, ఏది ధర్మం, ఏది అధర్మం అనే విషయంలో నానా రకాల వాదాలున్నాయి వీటిల్లో పడి గందరగోళం పాలు కాకుండా ఉండడానికి ఏదైనా సూత్రం చెప్పు" అని అడిగింది సమాధానంగా బుద్ధుడు క్రింది వాక్యాలు చెప్పాడు.

"ఏ సిద్ధాంతం క్లేశాలను పెంచేదిగా ఉంటుందో, సంసార బంధనాలను మరింత గట్టి చేసేదిగా ఉంటుందో, ఆమిష (material goods) సంపాదనలో మనిషిని తత్పరుని చేసేదిగా ఉంటుందో, లోభాన్ని పెంచేదిగా ఉంటుందో, జనసమ్మర్ద సందడి జీవితానికి నెట్టేదిగా ఉంటుందో, సోమరితనాన్ని పెంచి పోషించేదిగా ఉంటుందో, పాపకర్మలలో నెట్టేదిగా ఉంటుందో దానిని అధర్మ సిద్ధాంతంగా తెలుసుకొని దూరంగా ఉండు క్లేశ నిర్మూలనానికి దారి చూపించేది, అనాసక్తతను, వైరాగ్యాన్ని కలిగించేది, ఏకాంతవాసాన్ని అభిలషింపజేసేది, మైత్రీ, కరుణలను హృదయంలో నింపేది, సత్కర్మాచరణలో అమితోత్సాహాన్ని కలిగించేది అయిన సిద్ధాంతాన్ని ధర్మసిద్ధాంతంగా తెలుసుకొని దాన్ని స్వీకరించు

మరొకసారి గౌతమి "నిజమైన బ్రాహ్మణుడెవరు?" అని ప్రశ్నించింది ఆమెకు సమాధానం ఇస్తూ బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**యస్య కాయేన వాచా మనసా నాస్తి దుష్కృతమ్**
**సంవృతం త్రిభిః స్థానైః తమహం బ్రవీమి బ్రాహ్మణమ్** **26-9**

త్రికరణ శుద్ధుణ్ణి, త్రికరణ సంవృతుణ్ణి (restrained) బ్రాహ్మణుడని నేను చెబుతాను.

# ఆక్రోశక భారద్వాజులు

భరద్వాజ గోత్రానికి చెందిన ఇద్దరు సోదరులకీ ఆక్రోశకులు అనే విశేషణం వాడుకలోకి వెచ్చింది కోపం వచ్చినప్పుడు ఒళ్ళు మరిచి గట్టిగా అరుస్తారు గనుక ఆక్రోశకులనే పేరు సంపాయించుకొన్నారు చిన్న భారద్వాజుని భార్య కూడా ఇంచుమించు ఆ రకమే ఆమె వాక్కులో పారుష్యమేకాదు అనృతం, పైశున్యం (చాడీలు చెప్పే స్వభావం), అసంబద్ధ ప్రలాపం కూడా చోటు చేసుకొన్నాయి దానివల్ల ఆమెకు, ఇతరులకీ కూడా అశాంతి ఎక్కువయింది

ఆమె అదృష్టం బాగుండి ఒకనాడు బుద్ధుని ప్రసంగం వినడం జరిగి ఆనాటి నుండి తన వాక్కును సంస్కరించుకోవడం, అదుపులో పెట్టుకోవడం ప్రారంభించింది. పాత అలవాటు బలం చేత ఆమెకు ఎప్పుడైనా వాక్కు వశం తప్పుతున్నదనిపించిన వెంటనే ఆమె 'నమో తస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స" అని తథాగతుని స్మరించి వాక్కును వశంలోకి తెచ్చుకొనేది.

ఆమె మాటిమాటికి తథాగతుని స్మరించడం చిన్న భారద్వాజుడు సహించలేకపోయాడు. ఎన్ని చెప్పినా భార్య ఆ స్మరణ మానడం లేదు అతని కసి బుద్ధుని మీదికి మళ్ళింది కానీ బుద్ధుడు సామాన్యుడు కాదు. కనుక కేవలం కొన్ని వెటకారం ప్రశ్నలు వేసి కసి తీర్చుకొని రావడానికి వేణువనవిహారానికి పోయాడు.

బుద్ధుణ్ణి అతడు అడిగిన ప్రశ్న · "సుఖంగా శాంతంగా జీవించాలంటే మనం ఏ పశువును చంపాలో సెలవిస్తారా?" చంపడం అనే పదాన్ని బాగా నొక్కి అడిగాడు

అంగుళిమాలుడంతటివాణ్ణి పరివర్తనం కావించిన అనుగ్రహకరుణాదృష్టిని అతని మీదకు ప్రసరింపజేసి పరమ శాంతగంభీరంగా బుద్ధుడు ఇలా సమాధానమిచ్చాడు . "సుఖంగా జీవించాలంటే ముందు వ్యాపాదం (ద్వేషం = ill will) అనే పశువును చంపవలసి వుంటుంది

చిన్న భారద్వాజుడు చల్లబడడమే కాదు, పరివర్తనం కూడా చెంది బుద్ధుని శరణు పొంది ఆ పిమ్మట భార్య అనుమతి తీసుకొని భిక్షు సంఘంలో చేరిపోయాడు

ఈ వార్త విని పెద్ద భారద్వాజుడు మండిపడ్డాడు. కోపంతో అరుస్తూ వేణువనానికి వెళ్ళి బుద్ధుణ్ణి అనరాని మాటలతో తిట్టాడు.

అతని తిట్ల చదివింపులు పూర్తయ్యాక తథాగతుడు నిర్వికారంగా మామూలు శాంతస్వరంతో పెద్ద భారద్వాజుణ్ణి చల్లగా చూస్తూ ఇలా అడిగాడు "బ్రాహ్మణోత్తమా, నీవు ఒక వస్తువును దానం చేయదలచి ఒకరికి ఇచ్చావనుకో ఆ వస్తువును అతను పరిగ్రహించకపోతే అది ఎవరికి చెందుతుంది?"

"నాకే చెందుతుంది. అసంబద్ధంగా ఈ ప్రశ్న ఎందుకేశావు?" అని పెద్ద భారద్వాజుడు కోపం తగ్గని స్వరంతో అడిగాడు

"నీవు ఇంతసేపు ఇక్కడ నాకు తిట్లదానం ఇస్తూ నిలబడ్డావు నీ తిట్లలో ఒకటి కూడా నా మనస్సును బాధ పెట్టడంగానీ, వికారంపాలు చేయడంగానీ, కోపం తెప్పించడంగానీ చేయలేదు కనుక నేను వాటిని పరిగ్రహించలేదు నేను పరిగ్రహించని ఆ తిట్లు మరి ఇప్పుడు ఎవరికి చెందుతాయి?" అని ప్రశ్నించాడు ప్రసన్న గంభీరుడైన సుగతుడు

పెద్ద భారద్వాజునికి కనువిప్పు కావడం మొదలయ్యింది. ఎంత కోపిష్టియైనా సంస్కారం వున్నవాడు గనుక వెంటనే తన తప్పిదాన్ని తెలుసుకొని పశ్చాత్తప్తుడై "బుద్ధం శరణం గచ్ఛామి" అని తథాగతుని పాదపద్మాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు ఆ పిమ్మట అతను కూడా భిక్షుసంఘంలో చేరిపోయాడు

పరివర్తనకు ముందు నామమాత్ర బ్రాహ్మణులుగా వుండిన భారద్వాజ సోదరులు పరివర్తనం తరువాత నిజమైన బ్రాహ్మణులయ్యారనే విషయాన్ని ధర్మపదం 26వ అధ్యాయమైన బ్రాహ్మణవర్గంలోని కొన్ని శ్లోకాలు తెలుపుతున్నాయి. మచ్చుకు ఒక శ్లోకం చూడండి.

***యస్య రాగశ్చ ద్వేషశ్చ మానో మ్రక్షశ్చ పాతిత:***
***సర్షప ఇవా రాగ్రాత్ తమహం బ్రవీమి బ్రాహ్మణమ్.*** 26-25

రంపం కొననుండి ఆవగింజ జారిపోవునట్లుగా ఎవనినుండి రాగము, ద్వేషము, మానం (pride), మ్రక్షము తొలగినదో అట్టివానిని బ్రాహ్మణుడని చెప్పుదును.

(మన హితాన్ని కోరిన వ్యక్తి మనం చేసిన తప్పులను ఎత్తి చూపినప్పుడు ఆ తప్పులు అసలు తాను చేయలేదని కప్పిపుచ్చే స్వభావాన్ని మ్రక్షం అంటారు. తప్పును ఒప్పుకొని సరిదిద్దుకొనే మంచి గుణానికి మ్రక్షం ప్రతిబంధకంగా వుంటుంది).



ఆనంద బుద్ధ విహార ట్రస్ట్

బౌద్ధ ధర్మానికి, సంస్కృతికి అంకితమైన ధర్మ సంస్థ



నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స


**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ తుకారాంగేట్, నార్త్ లాలాగూడ,

సికింద్రాబాద్ - 500 017 ఎపి, ఇండియా